శ్రీరస్తు

శ్రీ రామకృష్ణ పరబ్రహ్మణే నమః

వసిష్ఠ ప్రోక్తమగు

# పులిప్పాణి వైద్యము



ప్రకాశకులు

సి.వి.కృష్ణా బుక్‌డిపో.,
121 అమ్మన్ కోవిల్ వీధి,
వాల్‌టాక్సు రోడ్డు పోస్టు, మదరాసు.1.



---

శ్రీరస్తు

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

వసిష్ఠ ప్రోక్తమగు

# పులిప్పాణి వైద్యము

ఆంధ్రీకరణకర్త:

అనువంశికాయుర్వేద వైద్యులు

ఆయుర్వేద విద్వాన్

శ్రీ ఎస్. కృష్ణస్వామిగారు

ప్రకాశకులు:

సి.వి.కృష్ణా బుక్ డిపో.
121 అమ్మన్ కోవిల్ వీధి.
చాకారుపేట పోస్టు. మదరాసు - 79.



దీని వెల] [40·00

శ్రీరస్తు

శ్రీ రామకృష్ణ పరబ్రహ్మణే నమః

వసిష్ఠ ప్రోక్తమగు

# పులిప్పాణీ వైద్యము



ప్రకాశకులు

సి.వి. కృష్ణా బుక్ డిపో.
121 అమ్మన్ కోయిల్ వీధి,
వాల్టాక్స్ రోడ్డు పోస్టు, మదరాసు-1



శ్రీరస్తు

## ఉపోద్ఘాతము

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥

శ్లో॥ పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ బాధతే।
తచ్ఛాంతి రౌషధైర్దానై ర్జపహోమ క్రియాదిభిః॥

మన దేశీయ వైద్యము ఒకానొకప్పుడు విదేశాలలో కూడా ప్రచారము కలిగియుండెను. పాశ్చాత్యులు మన వైద్యవిధానమునే ఆధారముగ గొని తమ తమ దేశమున కనువైన విధమున వ్యాధులకు దగినటుల ఔషధములను తయారుచేసికొని పాశ్చాత్య వైద్య విధానము నభివృద్ధి చేసికొనిరి. పాలకులు పాశ్చాత్యులగుటచే క్రమముగ దేశీయ వైద్యమును అణగద్రొక్కిరి. కాని ఇకనుండియు మన దేశీయ వైద్యము అభివృద్ధి నొందుటకు దగిన ఆధారములు కాన్పించుచున్నది.

మానవశరీరమునకు పూర్వకాలమునగూడ నేదేనొక వ్యాధి పీడించుచు వచ్చునటుల తెలియుచున్నది. ఇందుకు పూర్వజన్మ కృత పాప మొక కారణమగును. దానిని శాంతింప జేయుటకు జపము హోమము దానము మున్నగు క్రియలు సాధనములు మరియు ఔషధ సేవనముగూడ ముఖ్యసాధనము. ఈ ఔషధ యోగములను ఆయుర్వేదమను నామముతో బ్రహ్మదేవుడు కల్పించియుండెను. ఈ వేదమును బ్రహ్మదేవుడు దక్షప్రజాపతి కుపదేశించెను. దక్షప్రజాపతి అశ్వని దేవతలకు ఉపదేశించెను. దేవాసుర యుద్ధములలో అశ్వని దేవతలు వైద్యవరులుగ ప్రవర్తించియుండిరి, వారినుండి భారద్వాజ,

గార్గేయ, అంగిరసాది మహర్షులు ఆయుర్వేదచికిత్సా విధానముల నభ్యసించిరి. ఆత్రేయ మహర్షి తపనిష్ఠాశ్రమమున అనేక శిష్యుల కీ వేదము నధ్యయనము చేయించిరి. వారినుండి ప్రజల ప్రచారమును బొందియుండెను. వారు రోగనిదానము, గుణపాఠములుగ విభాగించి అనేక గ్రంథములను రచించియుండిరి. వారి తర్వాత నేర్పడినదే చరకసంహిత. చరకమహాముని తన నామముతోనే యీ గ్రంథమును రచించియుండెను.

కాలక్రమమున ధన్వంతరి భగవాన్ భూలోకమున నవతరించి ఆయుర్వేదము నుద్ధరించి ప్రజలకు మహోపకారము చేసియుండిరి. వీరి కాలముననే సుశ్రుతము అను వైద్యగ్రంథము సుశ్రుతాచార్యుని వలన రచింపబడినది. ఈ గ్రంథమున శస్త్రచికిత్సా విధానము పేర్కొనబడినది. చరకసంహితయందు కాయచికిత్స వివరింపబడినది. ఈ గ్రంథముల నాధారము చేసుకొని పలువురు సిద్ధులు, మునీశ్వరులు, విజ్ఞులు, విద్వాంసులు లెక్కలేనన్ని బహుళ గ్రంథముల తమ తమ పరిశోధనా ఫలితముగ రచించియుండిరి. ఇందులోనిదే పులిప్పాణి వైద్యగ్రంథము. ఇందు కాధారము వసిష్ఠప్రోక్త వైద్యగ్రంథము. ఇందు ప్రస్తుత కాలమున కనువగు రీతి సులభపద్ధతులు, అనుభవసిద్ధములగు యోగములు వివరింపబడినవి. ఈ గ్రంథసహాయమున ప్రతియొకరు ఔషధములను తయారు చేసికొనవచ్చును. శరీరతత్త్వము నెరుగవచ్చును. నాడీ పరిజ్ఞానమును బొందవచ్చును. భాషాజ్ఞానము గల ప్రతివారు సత్ఫలితములను బొందుటకు వీలుగ ప్రతివిషయమును విభాగించి సులభశైలిలో రచింపనైనది. ప్రజలు దీనిచే కలుగునట్టి సత్ఫలితములను పొందుదురు గాక!

ఆంధ్రీకరణకర్త

శ్రీరస్తు

# విషయానుక్రమణిక



విషయానుక్రమణిక సంపూర్ణము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

## మానవశరీరము

బ్రహ్మసృష్టిచే నేర్పడిన మానవశరీరము అస్థిపంజరమయి యున్నది. అసలు శరీరము శక్తిస్వరూపిణియగు స్త్రీగర్భమునుండి ఉత్పత్తియగుచున్నది. గర్భోత్పత్తికనువయిన వయస్సునుపొందిన స్త్రీ, పురుష సంపర్గముచే గర్భవతియగుచున్నది. గర్భము శుక్ల శోణిత సంబంధము. గర్భము నిలచినతోడనే ఋతుస్రావమంత మగును. అప్పటినుండి దశమాసములకు శిశువు జనించును. క్రమముగ గర్భధారణమయిన మొదటి మాసమున గర్భములోని పిండము ఒక క్రిమివలెనుండును. నెలదాటి రెండు నెలలలోపల తల పెద్దదగును. నేత్రములుకూడ నపుడే యేర్పడును. హృదయము, దవడలు, ఎముకలుగూడ నానెలలోనే యేర్పడును. రెండునెలల యనంతరము, స్త్రీ లేక పురుష చిహ్నము లేర్పడును. చేతులు కాలూచేతులు కలుగును. కండరములు, ముక్కు, కంటిరెప్పలు, నోరు, చర్మము ఇవి స్పష్టముగ నేర్పడును. మూడవనెలలో హృదయచలన మేర్పడును. నాల్గవమాసమున శరీరావయవములన్నియు నగుదును. అయిదవమాసమున శిశువుయొక్క పొడవు పదునొకండు అంగుళములు మొదలు పన్నెండు అంగుళములలోవుండును. తూకమున నొక పవును వుండును. తలలో వెండ్రుకలు మొలచును. కండ్లు మూతపడియుండును. లలాటము, భ్రూమధ్యమున సన్నని వెండ్రుకలు ఉత్పత్తియగును. ఏడు, ఎనిమిది మాసములలో పిండములోని శిశువు సంపూర్ణస్థితినిబొంది యభివృద్ధి చెందును. ఇట్టి యపుడు శిశువు ప్రసవమయినచో శ్వాసము వదలుటకును ఏడ్చుటకును పాలు చప్పరించుటకును సమర్థమయియుండును

తొమ్మిదవమాసమున పిండస్థ శిశువు ఇరువదంగుళముల పొడవుండును. అరువౌనులపైన బరువు వుండును. శిశువుయొక్క రక్తనాళములలో మంచిరక్తము ప్రవహించుచుండును. ఈ మాసాంతములోపల గర్భములోని శిశువు ప్రసవమగును. ఇంతవరకు గర్భమున చేరిన శుక్లశోణితము జీవమును పొంది క్రమముగ పెరిగి శిశువుగ భూపతనమగు విషయము వివరింపబడినది. భూపతనమయిన శిశువు కాలక్రమమున తల్లియిచ్చునట్టి ఆహారాది పోషణవలన పెరుగుచున్నది.

ప్రతి అవయవమును పోషణాద్యాహారములచే వృద్ధిబొందును. ఇట్టి శరీరమునకు ముఖ్యముగ కావలసినవి నీరు, గాలి, ఆహారము. మనము త్రాగునట్టి నీరు పరిశుభ్రముగ నుండవలెను. మరియు తేలికగనుండవలెను. అట్టినీరు శరీరమునకు ఆరోగ్యకరము. గాలి లేకున్న మనము క్షణములోనుగావలసివచ్చును. ఆహారము లేకున్నను కొన్ని దినములు గడపవచ్చును గాని గాలిలేకున్న శరీరావయవములు వృద్ధి బొందనేరవు. శరీరపోషణకు ఆహారము ముఖ్యాధారము, అటులని ఆహారమును మితిమీరి పుచ్చుకొనరాదు, బాగుగ ఆకలియైనపుడే ఆహారమును మితముగ భుజింపవలెను, ఎక్కువగ భుజించుట వలన అజీర్ణ రోగములు సంభవించును.

ఇట్టి శరీర భాగము ఎముకల గూడని యిదివరకే వివరించితిమి. శరీరమునకు ప్రధానము శిరోభాగము, శిరోభాగమున (కంఠో పరి భాగము) అరువది రెండు ఎముకలు, కంటిపై భాగమున ఏబదిరెండు ఎముకలు, భుజము, హస్తములు వీనియందు అరువదినాలుగు ఎముకలు, తొడ పాదము వీనియందు అరువది యెముకలు, ఇటుల 240 ఎముకలు గలవు. ఈ ఎముకలు చర్మము కండరములతో కప్పబడి యుండును. దీనికి పొరధాతువని పేరు. కండరములుమూడు విధములు, శరీరము కణములప్రోవు. కొన్ని కణములుచేరిన ధాతువగును, కొన్ని ధాతువులు చేరిన ఒక అవయవమగును, కొన్ని అవయవములు కలిసి కృత్యములు చేయుటకు శరీరమునకు తోడ్పడిన అట్టి వానిని సంస్థయందురు, ఎముకల ప్రోవువలెనే శరీరమున జీవాణువులు



నిండియున్నవి. ఇట్టి జీవాణువులే శరీరము చేయునట్టి పనులకు కారణభూత మగుచున్నవి.

శిరస్సు తర్వాతను మానవశరీరమున హృదయస్థానముముఖ్యమైనది. ఇచ్చట శ్వాసకోశము, ఇంద్రియకోశము మున్నగు ప్రధానాంగములుగలవు శరీరమునగల సకల రక్తనాళములు యీ భాగమునకు చేరుచున్నవి. ఇటనుండియే అవి ప్రసరణ ప్రారంభించును, స్త్రీల కిది ముఖ్యస్థానము రజస్వలయగువరకు బాలికలకు రొమ్ము సామాన్యముగనే యుండును. రజస్వలయైన తర్వాతను స్తనములుబుకును, గర్భధారణ తర్వాతను అవి పెద్దవై జన్మించు శిశువునకు ఆహారధారమగుచున్నవి.

దీని తర్వాతను ఉదరము (కడుపు) ముఖ్యమైనది. ఇచట జీర్ణకోశము, మలమూత్ర కోశములు గలవు స్త్రీలకు గర్భకోశము గూడ ఇచ్చటనే యున్నది. మనము పుచ్చుకొను నాహారమును జీర్ణకోశములోని జఠరాగ్ని పచనము చేయుచున్నది. జీర్ణకోశము సరియైన స్థితిలోనుండినచో ఆరోగ్యము పూర్ణముగ నుండును. తర్వాతను ఊరూ, పాద భాగములు, భుజము, చేతులు ఇవియు ముఖ్యాంగములే పురుషునకుగాని, స్త్రీకిగాని నాడీ పరీక్షకు ముఖ్యముగ పనికివచ్చునది చేతులే, శరీరతత్వమును చేతులలోని నాడిద్వారానే వైద్యుడు గ్రహించుచున్నాడు.

### శరీర లక్షణము

అన్నపానాద్యాహారాది రసములచే కలిగిన మానవశరీరము యొక్క పై భాగమున అనగా కడుపున అన్నమయ కోశము, రొమ్మున ప్రాణమయకోశము, శిరస్సున మనోమయ కోశము, మూడు కోశములు గలవు శిరస్సునగల మనోమయ కోశమున విజ్ఞానమయ, ఆనందమయము అనునట్టి కోశములు గూడ కలిసి యున్నది. అన్న పానాదులచే జనించిన రసధాతువు ప్రథమమున చిక్కగను, తర్వాత తేలికయైన జలరూపముగను మారుచున్నది. పిదప నారసము ప్రాణవాయువుతో సంఘర్షణ జెంది, పరిశుద్ధమై తేజస్సుతో కలిసి రక్తమయమగు చున్నది. ఆ రక్తమునే ప్రాణ లక

మనియు, జీవ రసమనియు నందురు. ఈ రసము శరీర మంతటను వ్యాపించి సంచరించుచున్నది. ఈ జీవరసము శిరస్థాను విషపదార్థ ముగు నుఱుగుతో కలసి, అధికమయిన శీతల విషముతో కలియునేని అపుడా శ్లేష్మము పైత్యప్రకోపమయి రొమ్మున గడ్డకట్టి రక్తము స్తంభించినపుడు దేహియయినవాడు చలనము లేక స్తంభించి పోవును. హృదయములో రక్తకోశము స్తంభించినచో ప్రాణవాయువు శరీరమును త్యజించును. అట్టి సందర్భమునందు ఉష్ణతత్వముగల ఔషధములను వాడవలెను.

మరియు హృదయభాగమున శ్లేష్మధాతువు గలదు. దీని క్రిందిభాగమున వస్తియనునట్టి మూత్రాశయ ముండును. స్త్రీలకు మూడు రక్తాశయములు గలవు. సాధారణముగ రక్తము శరీరమున నుండవలసిన దాని కంటెను నధిక మయినను, తక్కువయినను వ్యాధియో లేక మరణమో సంభవించును.

### వాతపిత్త శ్లేష్మములు

మానవ శరీరమున వాత, పిత్త, శ్లేష్మము లనెడి త్రిధాతువులు గలవు. వాతము వీర్యవంతముగను, రజోగుణ స్వరూపముగను, శైత్యముతో గూడియు నుండును. పైత్య తత్వము ఉష్ణముగను, సత్వగుణ స్వరూపముగను నున్నది. శ్లేష్మ తత్వము తామస గుణ స్వరూపముగను, గురువుగను, శైత్యముగను నున్నది. త్రాతమనీయను వట్టివి నాభిస్థానమున నుండును.

### వాతముయొక్క గుణము

దేహమున వలుపు, ఎఱుపు, సంచారము, కీళ్ళుపట్టు, నొప్పి నిద్రలేమి, కృశత్వము, పొట్టుబాపు తిమ్మిర, అంగముల అదురుపాటు, మలబల బంధనము, గొయ్యబారుట, నోటిలో వగరుగ నీరూరుట, అంగముల కదలిక, గుంటపడుట, అదరుట, అన్న ద్వేషము, కడుపున సంకటము ఇట్టివి వాత లక్షణములు.

### పైత్య లక్షణము

శరీరమున పసుపుపచ్చ యేర్పడుట, ఉక్క, దాహము, జీర్ణ సమయమున శరీరము వేడిగనుండుట, రోమద్వారముల నుండి ఉక్క



పోయుట, భ్రాంతి, జ్వరము, పాడు జ్ఞాపకశక్తి క్షీణించుట, మూర్ఛ, తలపోట్లు, మూత్రము పచ్చగను, ఎఱ్ఱగను వెడలుట, పుల్లగను చేదుగను కారముగను నోట నీరూరుట, రక్తతైక్ష్ణ్యము ఇట్టివి పిత్త లక్షణము,

### శ్లేష్మ లక్షణము

శరీరము తెల్లబారుట, నిగనిగలాడుట, దురద, చల్లదనము, కీళ్ళు కదలకుండుట, మందగుణము, జీర్ణశక్తి పెరుగుట, నిద్రలేమి, ఉప్పగను, తియ్యగను నోట నీరూరుట, ఊర్ధ్వశ్వాస, అన్నద్వేషము, దగ్గు, చెమటపోయుట, క్షయ, చిక్కిపోవుట, తెల్లబారుట, మూత్రము కొంచెము కొంచెముగ జారుట, ఎక్కిళ్లు ఇట్టివి శ్లేష్మ లక్షణములు,

### నాడి పరీక్షించు విధము

రోగియొక్క చేతినిపట్టుకొని వ్రేళ్ళను వలిపి బొటన వ్రేలి పైపు క్రింది భాగమునగలచోట వైద్యుడు తన బొటనవ్రేలు, కనిష్ఠపువ్రేలుతప్ప మధ్యగల మూడువేళ్ళతో నాడిని పరీక్షింపవలెను. అటగల నరములు పలుకునట్టి నాడీశబ్దమువలన వాత, పిత్త, శ్లేష్మముల నెఱుగనగును.

### స్త్రీ పురుషులకుగల నాడీ భేదము

స్త్రీలకు నాడిని పరీక్షింపవలసినపుడు స్త్రీల యెడమచేతి మణికట్టు క్రింది భాగమున నాడిని పరీక్షింపవలెను. పురుషులకైనపుడు కుడిచేతిని పరీక్షింపవలెను. అటుల పరీక్షించినపుడు మొదటి వ్రేలి క్రిందను చలించునది వాతనాడియనియు, రెండవ వ్రేలిక్రిందను చలించునది పిత్తనాడియనియు, మూడవ వ్రేలి క్రిందను చలించునది శ్లేష్మనాడియనియు నెఱుంగవలెను. పురుషులకు వాత నాడి చలనము కోయిల, నెమలి, హంస, కోడి వీని నడకవలె నుండును. పిత్తనాడి తాబేలు, జలగ నడకవలెను, శ్లేష్మనాడి పాము నడకవలెను నుండును. స్త్రీలకు వాతనాడి పామువలెను పిత్తనాడి కప్పవలెను, శ్లేష్మనాడి హంసవలెను నడక కలిగియుండును.

### నాడీచలన భేదము

శరీరము శ్రమాధిక్యముచే అలసట జెందినను, మత్తు పదార్థములు, ఉష్ణపదార్థములు సేవించినపుడును, యెండలో తిరిగినను, నిద్రాభంగము కలిగినను, మనస్సున కాయాసము కలిగినను, గాయము తగిలి రక్తస్రావ మేర్పడినను, ఉద్రేకము కలిగినను యిట్టి సమయములయందు నాడి తీవ్రముగ కొట్టుకొనును.

ఆకలి, దప్పి, చింత, అతినిద్ర ఇటువంటి పరిస్థితులు కలిగినపుడు నాడీచలనము మందముగ నుండును.

చేతిలోనికి నాడీ స్థానమున వ్రణముండినను, నాడీ పరీక్షించు సమయమున రోగి మరొక చేతిని క్రిందనాన్చుట, కాళ్ళను కట్టుకొనియుండుట, ఇట్టివి చేయరాదు. ఇట్టియపుడు నాడీ చలనము సరిగ నుండజాలదు. వైద్యునకు రోగనివారణచేయుటకూడ దుర్లభమగును.

### సంయోగ నాడీ లక్షణము

వాతమున వాతము సంయోగమైనచో శరీరమున పోట్లు, వణకుట, అన్న ద్వేషము, సోమరితనము ఇట్టివి కలుగును.

వాతమున పిత్తాధిక్యమైనచో సంబంధములేని మాటలు, అరుచి, నోట నీరూరుట, ఇత్యాదులు కలుగును.

వాతమున శ్లేష్మప్రకోపమైనచో శరీరము మాంద్యము, వాపు, శిరోభారము తెల్లబారుట అన్నద్వేషము, సోమరితనము ఇట్టివి సంభవించును.

పిత్తమున పిత్తాధిక్యమైన సంబంధములేని మాటలు, తల తిరుగుట, ఆయాసము, ఇట్టివి కలుగును.

పిత్తప్రకోపముతోపాటు వాతము మిళితమైనచో, శరీరము కృశించుట, సంధులలో పోట్లు, జ్వరము ఇట్టివి కలుగును. అట్టి సమయమున కోపాధిక్యము కలుగును.

పిత్తమున శ్లేష్మము సంయోగమైన మాటలు తడబడుట, నోరు నీరూరుట, తలతిరుగుట, కడుపునొప్పి ఇట్టివి కలుగును.

శ్లేష్మమున వాతముచేరిన నరములలో బాధ, నడుమునొప్పి, మాట తడబడుట యిట్టివి సంభవించును.



శ్లేష్మమున పిత్తప్రకోప మేర్పడిన నోరు చేదుగ నుండుట, బొంగురు పోవుట, కంట పుసికట్టుట ఇట్టివి సంభవించును.

శ్లేష్మమున శ్లేష్మము కలిసిన చూపుతిరుగుట, మైకము, మూర్ఛ, అన్ని ఇట్టివి కలుగును.

### వైద్యునకు సలహా

వాతమున వాతప్రకోపమైన:—శరీరము కృశించుట, శరీరము చురచురలాగుట, హంస నడకవలె వాతనాడి చలించుట ఇట్టి లక్షణములు కలుగును.

వాతమున పిత్తాధిక్య మేర్పడిన:—మాట తడబడుట, తలనొప్పి ప్రేవులలో బాధ ఇట్టి లక్షణములుండును.

వాతశ్లేష్మమున:—దీర్ఘశ్వాసము, తలనొప్పి, చిత్తచాంచల్యము, శరీరము తెల్లబడుట, నాలుకవాచుట, ఇట్టి లక్షణములుండును.

పిత్తముతో పిత్తసంయోగ మేర్పడిన:—శరీరకాంతిమాయుట, కృషించుట, వాపు, బడలిక, తల తిరుగుట ఇట్టి లక్షణములు కలుగును.

పిత్తవాతమున:—కపాలమున పోట్లు, వనస జ్వరము, కాళ్ళు, చేతులలో పోట్లు, కోపాధిక్యము ఇట్టి లక్షణములుండును, మరియు పాండు, కామెర్ల, మహోదరము ఇట్టివికూడ కలుగును.

### నాడియొక్క భేదాభేదములు

వాతము రెండు వంతులు, పిత్త మొకవంతు అయినచో వాత పిత్త సంబంధమైన రోగము ఉద్భవించును. రక్త శీఘ్ర చలనము, స్త్రీలపై ఆశ, వ్యసనమధిక మగుట, వాతము పెరుగు కొలది అంగచలన మధికమగుట, వీనిని గ్రహింపవలెను.

పిత్తము ద్విగుణము, వాత మేకగుణము కలిగియున్నప్పుడు పిత్తవాత సంయోగమువలన శరీరమున, ఉష్ణమెక్కువై కండ్లు మంట, అరికాలి మంట, దప్పి, ఆకలి, నోట చేదు యిట్టి లక్షణములు కలిగియుండును.

వాతము ద్విగుణము శ్లేష్మము ఏకగుణము సంభవించినపుడు వాతశ్లేష్మ సమ్మిళితరోగము సంభవించును. అట్టి యపుడు ఆకలి మందగించుట, కడుపున సంకటము, ఇట్టి లక్షణము లుండును.

పిత్తము రెండంశములు, శ్లేష్మ మొకాంశ మేర్పడినపుడు పిత్తశ్లేష్మ రోగలక్షణ మేర్పడును. దురద, కడుపునమంట, ప్రక్కలో బాధ ఇటువంటివే ఆ లక్షణము లగును.

శ్లేష్మము ద్విగుణము, వాత మేక గుణమయినప్పుడు తల నొప్పి, నోరు రుచి తెలియకుండుట, దప్పి, జీర్ణము మాంద్యమగుట ఇట్టి లక్షణము లేర్పడును.

శ్లేష్మము ద్విగుణము పిత్త మేకగుణమైనపుడు, వికారము, నోట నీరూరుట, అగ్నిమాంద్యము ఇట్టి లక్షణము లేర్పడును.

### మరణకాలపు నాడి లక్షణము

వాత, పిత్తనాడులు తీవ్రముగ పలుకుచుండగ, శ్లేష్మనాడి మెరుగుపడియుండును అట్టి సమయమున నాడి బల్లితోకవలె నాడు చుండును. రొమ్మున ఉక్కపోయును. శరీరము క్రుంగును, దృష్టి మారును, వీనిని మరణలక్షణమని యెరుగవలెను.

వాత పిత్త నాడులు మందగించి శ్లేష్మనాడి తీవ్రచలనము కలిగియుండిన నిదియు మరణలక్షణమగును. మరియు ఎముకలు విరుచుకొనుట, రొమ్ము మధ్యమున గుంటలు పడుట ఇవియు పై దానిలోనె చేరును.

త్రిధాతువులు గంభీరముగ కదలిక కలిగియుండినను, శరీర వర్ణము మారినను, ముక్కు క్రింద చెమట కలిగియుండినను, దృష్టి మాంద్య మేర్పడినను, ప్రక్కలు త్రుళ్ళి శ్వాసవచ్చినను ఇవికూడ మరణలక్షణమని గ్రహింపవలెను.

జలగవంటి చలనము, కాకులు నడక కలిగియుండి పిత్తనాడి పాముపడక కలిగిన అట్టిప్రాణి మూడుదినములు మాత్రమే యుండు నని తెలిసికొనవలెను.



పిత్తనాడి మాంద్యము కలిగి, వాతనాడి తీవ్రచలనములో నుండి, దృష్టిమాంద్య మేర్పడిన అట్టి ప్రాణి ఐదు దినములకంటె జీవదశతో నుండదని గ్రహింపవలెను.

కుక్కుటము, హంసలాంటి నడక కలిగినను, వాతనాడి సాధారణ చలనము కలిగియుండినను అట్టి ప్రాణి వారమువరకు బ్రతుక గలదని గ్రహింపవలెను.

కప్ప, పామువంటి చలనము కలిగిన, శ్లేష్మనాడి తీవ్రచలనము కలిగియుండిన ఒక నెలవరకు ప్రాణభయము లేదనవచ్చును.

వాతపిత్త నాడి సామాన్యముగనుండి శ్లేష్మనాడి తీవ్రముగ నుండిన సన్నిపాత దోషము కలుగును. మరియు అట్టి సమయమున సర్పచలనము, కప్పనడక కలిగిన మరణము ధ్రువమని గ్రహింపవలెను.

మరణావస్థను తెలుపునట్టిచిహ్నము లేవనగా కాళ్లు చేతులు చల్లబడుట, క్రమముగా ముఖము, రొమ్ము పార్శ్వములు, ముక్కు, కంఠము, చెవులు ఇవన్నియు చల్లబడిన అట్టి శరీరమును శ్లేష్మ మాక్రమించినదని, అట్టి స్థితి మరణ చిహ్నమని తెలియంగవలెను.

దీర్ఘశ్వాసము, కంఠమున గురగురలాడుట, కడుపుబ్బరము, ముఖము నల్లబడుట, నాడి వీణాదండమువలె పలికిన నిదియు మరణ చిహ్నమే యగును.

మరియు నాడీ సమూహము ముందు వెనుక లూగులాడుచు, గంతులు వేయుచున్నటుల నడచిన, అట్టి సమయమున మాటలు తడబడుచుండిన పది మాసముల వరకు గడువు చెప్పవచ్చునని వైద్యశాస్త్రము నుడువుచున్నది.

శ్లేష్మనాడి గుఱ్ఱము నడకవలె చలించుచుండిన నట్టి ప్రాణికి గూడ పదిమాసములు గడువు చెప్పవలెనని శాస్త్ర ప్రమాణము.

వాతనాడి చంద్రగమనము కలిగి యుండినను, నాడీచలనము తీవ్రముగ నుండినను, రెండవ దినము శ్లేష్మనాడి సంయోగము కలిగినను, పిత్తనాడీ తీవ్రముగ నుండినను అట్టి తరుణమున వాత నాడి క్షీణించినదని, త్వరలోనే ప్రాణికి మరణము సంభవించునని తెలియగవలెను.

దీపముయొక్క కొనవలె నాడి పలికిన త్వరలోనే మరణము సంభవించునని గ్రహించి చికిత్సకు పూనుకొనగూడదు.

మరియు, శ్వాసము ముక్కుతో కాకను నోటితో వెడలుట, కండ్లు, పెదవులు, నోరు నల్లబడుట, శ్లేష్మనాడి ఉధృతముతో నడచినను అట్టి సమయమున ఘాటైన మందిచ్చినను, మార్పు కలుగనపుడు అట్టి ప్రాణి ప్రపంచమును వీడునని ఘట్టిగ గ్రహింపవలెను.

శరీరమునగల నరము లుబికినను, కండ్లు దూదికప్పినట్లులైనను మాటలు స్పష్టముగ నుండక పోయినను, ముఖము వికారరూపము దాల్చినను ఇట్టి గుణములు కలిగినపుడు ఇక చికిత్స చేయుటవలన ప్రయోజనము కలుగదని భావించవలెను.

## రోగులయొక్క శరీర తత్వము

వాతరోగి శరీరము చల్లగను, ముఖము, కండ్లు, పండ్లు, మలము నల్లగను నుండును. కండ్లనుండి నీరు కారును జిహ్వ నల్లబడును, నాలికపై ముండ్లుండునటుల అనిపించును,

పిత్తరోగి శరీరము ఉష్ణముగను ముఖము, కండ్లు, నాలుక, దంతములు, మలము నీరు పసుపు పచ్చగా నుండును.

శ్లేష్మరోగి శరీరము చెమటపోయును ముఖము కండ్లు, పండ్లు, నాలుక, మలము, నీరు తెల్లగ నుండును, కండ్ల బుసి కట్టును.

ద్వంద్వరోగి దేహము, ముఖము, కండ్లు, పండ్లు, నాలుక, మలము, జలము పలువిధములుగ గోచరించును,

## సద్వైద్యుని లక్షణము

గురు శుశ్రూషచే శ్రమబద్ధముగ ఆచార్యునివద్ద వైద్య శాస్త్ర మభ్యసించి అనుభవము గడించినవాడు అమృతహస్తుడు, చికిత్సా పద్ధతిలో సూక్ష్మబుద్ధి గలవాడును, అత్యాశారహితుండును, ధైర్యశాలి ప్రాణులపై దయగలవాడు, శరీరతత్వశాస్త్రము, రోగశాస్త్రము పదార్థగుణ శాస్త్ర మభ్యసించినవాడు, శవ శరీరమువలె యితరుల శరీరమును భావించువాడు, ప్రయాణ ప్రవేశమువలన శరీరతత్వముల



నెరిగినవాడు, రోగియొక్క శరీర తత్త్వము గ్రహించి చికిత్స చేయువాడు, నాడీజ్ఞానము గలవాడు సద్వైద్యుడని యెరుగవలెను.

## కుత్సిత వైద్యుని లక్షణము

వైద్య శాస్త్రజ్ఞానము లేనివాడు, అనుభవరహితుండును, నాడీ పరిజ్ఞానము లేనివాడు, సర్వజ్ఞునివలె నటించువాడు, మేకపోతు గాంభీర్యము ప్రకటించువాడు అసద్వైద్యుడని గ్రహింపవలెను. అట్టి వైద్యుని విషతుల్యముగా భావింపవలెను. అట్టివానియొద్ద చికిత్స పొందినరోగి నయమును పొందజాలడు.

## శకునములు

### శుభ శకునములు

వైద్యుడు రోగిని పరీక్షించుటకు బయలు దేరునపుడు, పురుషుడు వైద్యునకు యెడమ వైపునుండి కుడివైపునకు, స్త్రీ కుడి పార్శ్వమునుండి యెడమ పార్శ్వమునకును పోయిన యెడల శుభ శకునమనబడును. రోగము త్వరగ నయమగును. మరియు పుష్ప గజము, మొంగ గాడిద, ఆడ నలుపు కుక్క, యివి యెదురుపడిన శుభమగును. ఛత్రము, ఆవు, బ్రాహ్మణులు, కన్య, మాంసము, కల్లు, వారాంగన, గోరోచనము, చెవికింపగునట్టి సంగీతము, యువతి, ఉత్తముడైన యోగి వీరెదురువచ్చిన శుభశకునమగును, ఈ శకునముయొక్క ఫలము త్వరగ వ్యాధి నివారణమగును.

### అశుభ శకునములు

వైద్యుడు రోగిని పరీక్షించుటకు బయలు దేరునపుడు దుర్గంధ పదార్థములు, ఉప్పు, పచ్చి పెసలు నువ్వులు మున్నగు నల్లధాన్యములు, బెల్లం, కట్టెలు, పిడకలు, కసువు, అమేధ్యము, బురద, తైలం నేయి, వట్టిపాత్రములు, వల, ఇట్టివి కనుపించినను లేక యెదురుపడినను, దుర్భాషలాడువాడు, తుమ్మువాడు, ఏడ్చువాడు వాంతిచేయువాడు, ఛండాలుడు, క్రూరుడైన ఆయుధములను ధరించినవాడు ఇట్టివారు యెదురుపడినను, క్రూరమైన పక్షులు, చతుష్పాద జంతువులు, ఒక దానితో నొకటి తగువు వేసికొని యేడ్చు స్వరము

వినబడినను, యుద్ధము, కలహము, అపాయ వీనిని చూచినను, వేదిక, గృహమండలము, పూర్ణకుంభము హఠాత్తుగా భూమిమీద పడినను, గజ్జము, ఆసనము, పడక, మాఖము, బోరగిల ఉండుటను చూచినను, తొండ, పిల్లి, కోతి మున్నగునవి మార్గమున అడ్డముగ నడచినను రోగి యింటిలో ప్రవేశించునపుడు అమంగళకరముగు వస్తువు యెదుటపడినను ఇట్టివన్నియు అపశకునములని యెరుగవలెను. ఇట్టివి సంభవించినపుడు వైద్యుడు రోగిని చూచుట మానవలెను.

### దూతపరీక్ష

గ్రుడ్డివాడు, గూనుగలవాడు, చెవిటివాడు, అంగవిహీనుడు, భయస్థుడు, దీనుడు, బిగ్గరగను, అమంగళకరముగను మాట్లాడువాడు, వికారస్వరూపుడు మురికి వస్త్రమును ధరించినవాడు, శస్త్రము ధరించినవాడు, కర్రను ధరించినవాడు, రోగపీడితుడు, ఎల్లప్పుడు చెడ్డపనులు చేయువాడు, ఎర్రని పుష్పమాలను ధరించినవాడు, రక్త చందనమలందికొనినవాడు, సర్వాంగము తైలము పూసికొనినవాడు, బురద పూసికొనినవాడు, అపరిశుద్ధుడు, తనతోబాటు మరొకని సహాయముగ తీసికొని వచ్చువాడు, జటాధారి, తడిసిన వస్త్రమును ధరించినవాడు, ముసలివాడు, ఏకవస్త్రధారి, ఒంటె, ఏనుగు, వీనిపై స్వారిచేయుచు వచ్చువాడు ఇట్టివాడు వైద్యుని పిలుచుటకు వచ్చినచో ఇది అపశకునమే యగును. ఇట్టివారి పిలుపును వైద్యు డంగీకరించి రోగిని పరీక్షింప వెడల కూడదు.

### గోచార ఫలాఫలములు

#### రవియొక్క ఫలము

సూర్యుడు జన్మ లగ్నమునగాని, లేక 4, 5, 6, 7, 8 స్థానములలోగాని ఉన్నప్పుడు, స్థానచలనము, మనోవిచారము, ప్రయాణము, ఆరోగ్యము చెడుట, కలహము, ధనవ్యయము, కంటిజబ్బు, తలనొప్పి ఇట్టివి సంభవించును. పై స్థానములలోగాక యితరత్ర రవి యుండినచో మంచి ఫలితముల నిచ్చునని తెలుసుకొనవలెను.



#### చంద్రునియొక్క ఫలము

చంద్రుడు లగ్నమునకు ద్వితీయమునగాని 4, 5, 8 స్థానములలోగాని ఉన్నచో ద్రవ్యనాశము, కడుపునొప్పి, కార్యవిఘ్నము, మరణవేదన ఇట్టివి కలుగును. ఇతర చోట్లనున్నచో మంచి ఫలితముల నిచ్చును.

#### కుజునియొక్క ఫలము

కుజుడు జన్మరాశిలో నుండినను, 2, 4, 8, 10, యీ స్థానములలో నుండిన శత్రుభయము, ద్రవ్యనాశము, దుఃఖము, పలువిధములగు వ్యాధులు సంభవించును. ఇతర స్థానములలో నుండినచో మంచి ఫలితములు గలుగును

#### బుధునియొక్క ఫలము

బుధుడు 4, 6, 7, 8 స్థానములలో నుండి దానితో పాపగ్రహములు చేరిన బంధనము, అభిమానము, రోగము, ద్రవ్య వ్యయము ఇట్టివి కలుగును. మిగిలిన స్థానములలో నుండినచో మంచివి కలిగించును.

#### గురువుయొక్క ఫలము

గురువు జన్మలగ్నమునగాని, 3, 4, 6, 8, 10, 12 స్థానములలోగాని నుండినచో భయము, రోగము, వ్యయము, స్థానచలనము పీడ ఇట్టివి సంభవించును. మిగిలిన స్థానములలో నుండినచో మంచి ఫలితముల నిచ్చును.

#### శుక్రునియొక్క ఫలము

శుక్రుడు 6, 8, 10, 12 స్థానములలో నుండిన శత్రుభయము రోగము, మనఃక్లేశము, దుఃఖము, అవమానము ఇట్టివి సంభవించును, మిగతస్థానములలో నుండినచో మంచి ఫలితముల నియ్యగలదు.

#### శనిగ్రహముయొక్క ఫలము

శని జన్మరాశిలో నుండినను, 2, 6, 8, 12 స్థానములలో నుండినను భయము, ధనహాని, మనస్సంకటము, ధనవ్యయము, దుఃఖము, వ్యాధి, ప్రయోగము మున్నగునవానివలన బాధ యేర్ప

దుట ఇట్టివి కలుగును. ఇతర స్థానములలో నుండినచో మంచి ఫలితములనే యిచ్చును.

రాహు, కేతు గ్రహములయొక్క ఫలములు

రాహు, కేతువులు 4, 5, 8, 9, 10 స్థానములలో నుండినచో ద్రవ్యనాశము, అస్పష్టముగ మాట్లాడుట ఇట్టివి యేర్పడును. ఇతర స్థానములలో నుండినచో మంచి ఫలితముల నిచ్చును.

ఋతుచర్య-ఆరోగ్య విధానము

వసంతఋతువు-చైత్ర, వైశాఖ మాసములు వసంతఋతువగును. ఈ రెండు మాసముల కాలమానము ఉష్ణముగ నుండును. ఈ ఋతువునకు అధిపతి శుక్రుడు, కషాయము బలవత్తరమైనది. దేహబలము సామాన్యముగ నుండును. వాతనాడి మధ్యముగను, పిత్తము బలహీనముగను, శ్లేష్మము ప్రకోపముగను నుండును. ఈ ఋతువున తినదగినది చేదు, కారము, వగరు పదార్థములు త్రాగ దగిన నీరు నదీజలము. రోగులకు త్రాగదగినది బాగుగ మరగించిన నీరు మూడుదినములకొకసారి సంభోగక్రియ జరుపవచ్చు. వ్యాయామము సామాన్యముగ చేయవలెను, పాతబియ్యము, గోధుమలు, కొఱ్ఱలు, పెసలు, బార్లీ, అవ, వేపపువ్వు, వాకుడు, ములక, పొట్ల, వంగ, మామిడి, తేనె, మజ్జిగ ఇవి వాడవలెను, నది చేపలు ఆరోగ్యప్రదము, అడవి జంతువుల మాంసము తినదగినది, వనవిహారము, విలాసగోష్ఠి, శరీర మర్దనము, సంచారము ముఖ్యములు

గ్రీష్మఋతువు-జ్యేష్ఠ, ఆషాఢ మాసములు గ్రీష్మఋతువు, ఈ ఋతువున కాలమానము ఉష్ణముగ నుండును, అధిపతి కుజుడు, కార పదార్థములు వాడనగును. దేహబల మల్పముగ నుండును, వాతనాడి సంచయముగ, పిత్తనాడి సామాన్యముగ శ్లేష్మనాడిక్షీణముగ నుండును, తీపి వస్తువులను వాడవలెను, నూతినీరు త్రాగుట మంచిది. రోగులకు సగము మరిగించిన నీరు త్రాగనిచ్చుట శ్రేయము సంభోగము పనికిరాదు, వ్యాయామము అల్పముగ నుండవలెను, చల్లనివి, తేలికైనవి అయిన ద్రవ పదార్థములు, బియ్యము, వరి పేలాలు, చోళ్లు, కొత్తిమిరి, బచ్చలి, దోస, అరటి ద్రాక్ష, పుచ్చ,



మామిడిపండ్లు, గేదెపాలు, వెన్న, మజ్జిగ ఇట్టివి వాడనగును, మడుగులోని చేపలు ఆరోగ్యప్రదము, నీటిజంతువులు, నీటిపక్షులు మాంసము హితకరము. తాటియాకులు కప్పబడిన యిండ్లలో నివసించుట ఉత్తమము. ఆరోగ్యగృహములలో విశ్రాంతి పొందుట మంచిది. మద్యపానము విడువవలెను పగటి నిద్ర హితము,

వర్ష ఋతువు-శ్రావణ, భాద్రపద మాసములు వర్ష ఋతువు, ఈ ఋతువున కాలమానము వర్షప్రదము. ఈ ఋతువున కధిపతి చంద్రుడు, ఆమ్లము బలవత్తరము. వ్యాయామము అల్పముగ నుండవలెను, వాతనాడి తీవ్రముగ, పిత్తనాడి సామాన్యముగను కఫనాడి క్షీణముగ నుండును. తీపి పులుపు, ఉష్ణపదార్థములు వాడుట మంచిది. నూతినీరు త్రాగుట ఆరోగ్యప్రదము. రోగులకు బాగుగ మరగించిన నీరు త్రాగనిచ్చుట సుఖవంతమగును. సంభోగము విసర్జింపవలెను. వ్యాయామము అల్పముగ నుండవలెను. వేడిగా, ఎండి సన్నిగా అగ్నిదీపకమును కలిగించునట్టి పదార్థములు, పాతబియ్యము పెసలు, వరుగులు, అప్పడములు, వడియములు, వేపుడుకూరలు, నిమ్మ, నారింజ, తేనె, మీగడ, పెరుగు ఇట్టివి సేవించుట ఉత్తమము చెరువుచేపలు ఆరోగ్యదాయకము. పెంపుడు జంతువు, కాల్చిన మాంసము ఉత్తమము మేడలపై నివాసము, పావుకోళ్లు తొడుగుట ఇట్టివి గమనార్హము.

శరదృతువు-ఆశ్వీజ, కార్తీక మాసములు శరదృతువు, ఈ ఋతువున కాలమానము వర్షయుతముగ నుండును. ఈ ఋతువునకు బుధుడు అధిపతి, లవణ పదార్థము బలప్రదము, దేహబలము మధ్యమము. వాతనాడి ప్రశమనమగును, పిత్తనాడి ప్రకోపముగను, శ్లేష్మనాడి సామాన్యముగ నుండును తీపి, చేదు, వగరు పదార్థములు వాడవలెను. ప్రవాహజలము త్రాగుట ఆరోగ్య ప్రదము. రోగులకు చక్కగ మరగించిన నీరు వాడవలెను. మూడు దినముల కొకసారి సంభోగము శ్రేయస్కరము. వ్యాయామము మధ్యమముగ నుండవలెను, శీతలములు, తేలికగా జీర్ణమగు పదార్థములు, ఎర్ర బియ్యము, పెసలు, పొట్ల, కాకర, ఉసిరిక, తేనె, మజ్జిగ ఇవి హిత

కరములు, ఏటిచేప మంచిది. అడవి జంతువులు, కోడి, నెమలి మున్నగు మాంసములు భుజించుట ఉత్తమము. మేడలపై నివసించుట మంచిది. చందన మలందికొనుట, ముత్యాల హారము హితకరము.

హేమంతఋతువు:—మార్గశిర, పుష్యమాసములు హేమంత ఋతువు ఈ ఋతువున కాలమానము చలిగనుండును. ఈ ఋతువున అధిపతి గురుడు, మధుర పదార్థములు బలమునిచ్చును. దేహబలము పూర్ణప్రదము, వాతనాడి అనుబలముగను, పిత్తనాడి ఉపశమనముగను, శ్లేష్మము సంచయముగను నుండును. తినదగిన పదార్థములు తీపి, ఉప్పు, పులుపు, సర్వజలములు వాడనగును. రోగులు బాగుగ మరగిన నీరు త్రాగుట మంచిది. తలచినపుడు సంపర్గము చేయవచ్చును. వ్యాయామము పూర్ణము. చమురుగలిగినవి, వేడి, బలవర్ధకమగు పదార్థములు భక్ష్యములు క్రొత్తబియ్యము గోధుమలు, జొన్నలు, గంటెలు, కందులు, మినుములు, సెనగలు, అనుములు, బొబ్బర్లు, నువ్వులు, చిక్కుడుకాయలు, గుమ్మడి, దుంపకూరలు, సీతాఫలములు, నేయి, పెరుగు ఇవి హితకరములు, నూతిచేప ఆరోగ్యప్రదము, జలము, క్రొవ్వుగల జంతువుల మాంసము వాడనగును. వెచ్చని యిండ్లలో నివాసము, శరీర మర్దనము, వాతహార తైలములచే అభ్యంగన స్నానము, తైలములచే పాదమర్దనము, ప్రాతఃకాల భోజనము, ఉన్నివస్త్రములు ధరించుట ఇట్టివి సర్వశ్రేష్టము

శిశిరఋతువు—మాఘ,ఫాల్గుణ మాసములు శిశిరఋతువు ఈ ఋతువున కాలమానము శీతమునసే యుండును. ఈ ఋతువున అధిపతి శని. వగరు పదార్థము బలకరము. దేహబలము పూర్ణము, వాతనాడి బలహీనముగను, పిత్తనాడి బలముగను, కఫము ప్రకోపముగను నుండును. పులుపు, తీపి, ఉప్పు పదార్థములు వాడుటహితకరము, చెఱకురసము, నూతినీరు వాడవచ్చును. రోగులకు బాగుగ మరగిన నీరు యీయవచ్చును. సంభోగము యథేచ్ఛగ చేయవచ్చును, వ్యాయామము పూర్ణముగ చేయనగును. ఆహారమునకు



వాడదగినవి హేమంత ఋతువునకు చెప్పబడినవే అనుష్ఠేయము. సరస్సులోని చేపలు ఆరోగ్యప్రదము. బలకరమైన మాంసము తినవచ్చును. హేమంత ఋతువునకుగల నిబంధనలే ఈ ఋతువునకుకూడ అనుష్ఠేయమగును.

పై ఋతు ధర్మము ననుష్ఠించినచో ఆరోగ్యముగ నుండుటకు వీలగునని శాస్త్రము నుడువుచున్నది.

నక్షత్రములలో సంభవించు వ్యాధుల ఫలితములు

ఏ యే నక్షత్రములలో జ్వరము మున్నగు వ్యాధులు సంభవించునో దాని పరిణామము క్రింది విధముగ నుండును.

అశ్వని నక్షత్రమునాడు జ్వరము ప్రారంభించిన ఆరుదినములు పీడించి నయమగును.

భరణినాడు ప్రారంభించిన జ్వరము ఐదుదినములుండి తర్వాత నయమగును. క్రూర నక్షత్రమున ప్రారంభించిన వ్యాధి గనుక జాగ్రతగ నుండి చికిత్స పొందవలెను

కృత్తికా నక్షత్రమునాడు జ్వరము వచ్చినచో పదునొకండు దినములలో నయమగును. లేకున్న 21 దినములు పట్టవచ్చును.

రోహిణి నక్షత్ర దినమునాడు జ్వరము ప్రారంభించిన ఒక వారము దినములు బాధించును. తర్వాతను క్రమముగ తగ్గుచు వచ్చును.

మృగశిరా నక్షత్రమునాడు ప్రారంభించిన జ్వరము ఏడు దినములు బాధించును. 11-వ నాటికి పూర్తిగ తగ్గిపోవును.

ఆర్ద్రా నక్షత్రమున తగిలిన జ్వరము 5 దినములు, లేకున్న 18 దినములలో నయమగును. ఈ నక్షత్రమున ప్రారంభించిన జ్వరము తీవ్రముగ యుండును.

పునర్వసు నక్షత్రమునాడు జ్వరము తగిలినచో నాలుగు దినములు, లేకున్న తొమ్మిది దినములుండును.

పుష్యమిలో ప్రారంభమైన జ్వరము ఐదు దినములు లేకున్న 8 దినములలో నయమగును.

ఆశ్లేషా నక్షత్రమున తగిలిన జ్వరము పది దినములు తప్పి నచో ఇరువది దినములలో నయమగును. ఈ నక్షత్రముకూడా స్వల్పముగ క్రూరమైనదే యగును.

మఖా నక్షత్రమున జనించిన జ్వరము పది లేక ఇరువది దినములలో నయమగును. ఇదియు క్రూరమైనదే.

పుబ్బలో ప్రారంభమైన జ్వరము 11 దినములు లేకుండిన 20 దినములలో నయమగును.

ఉత్తరా నక్షత్రమున ప్రారంభించిన జ్వరము 11 దినములు నుండి 20 దినములలోపల పూర్తిగ తగ్గిపోవును.

హస్తా నక్షత్రమునాడు ప్రారంభమైన జ్వరము పది దినముల నుండి ఇరువది దినములలోపున నయమగును.

చిత్తలో ప్రారంభమైన జ్వరము పది లేక ఇరువది దినముల వరకు పీడించును.

స్వాతినాడు జనించిన జ్వరము తొమ్మిది లేక 11 దినములలో గుణమగును.

విశాఖలో ప్రారంభమైన జ్వరము ఏడు దినములు లేక 18 దినములలోపున నయమగును. ఈ నక్షత్రము క్రూరమైన దగుటచే చాలా విపరీతమైన ఫలితముల నీయవచ్చునుగాని తగు జాగ్రత తీసుకొనవలెను.

అనూరాధా నక్షత్రమునాడు జ్వరము వచ్చిన ఆరు దినములు లేక 18 దినములలో నయమగును.

జ్యేష్టా నక్షత్రమున ప్రారంభమైన జ్వరము ఇరువది దినముల వరకు బాధించును. ఇది క్రూరనక్షత్రము గనుక తగుజాగ్రతతో చికిత్స పొందవలెను. లేకున్న ప్రమాదభూయిష్టమగును.

మూలలో వచ్చిన జ్వరము పది దినములలో నయమగును. ఇదియు వ్యాధులకు క్రూరనక్షత్రమే యగును.

పూర్వాషాఢా నక్షత్రమున ప్రారంభమైన జ్వరము పది లేక ఇరువది దినములవరకు పీడించును.



ఉత్తరాషాఢ నక్షత్రము నాడు తగిలిన జ్వరము ఎనిమిది దినములవరకు నయముకాదు. ఇదియు క్రూరనక్షత్రమే యగును.

శ్రవణ నక్షత్రమునాడు ప్రారంభమైన జ్వరము ఎనిమిది దినములు బాధించును. క్రూరనక్షత్రము గనుక తగుజాగ్రత పుచ్చుకొనవలెను.

ధనిష్టా నక్షత్రము నాడు ప్రారంభమైన జ్వరము నాలుగు దినములలో నయమగును. లేకున్న 17 దినములు బాధించును.

శతభిషములో సోకిన జ్వరము ఎనిమిది దినములనుండి 20 దినములలోపల నయమగును.

పూర్వాభాద్రలో పుట్టిన జ్వరము నాలుగు దినములనుండి పది దినములలోపల నయమగును.

ఉత్తరాభాద్రలో అంటిన జ్వరము ఏడు దినములనుండి ఇరువది దినములవరకు బాధించును.

రేవతి నక్షత్రమున ప్రారంభమైన జ్వరము ఆరు దినముల నుండి ఇరువది దినములవరకు బాధించి నయమగును.

ఈ ఫలితముల కాధారము ఆయుర్వేద శాస్త్రము కనుక ఈ ఫలితములను గమనించుట కూడ ఆవశ్యకమే యగును.



శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణి వైద్యము

## ఔషధముల శుద్ధిప్రకరణము

### అభ్రక శుద్ధి

ఒక వీశె అభ్రకము ఒక కుండయందు పరచి దానిపై పంచితము మూడుపళ్ళుపోసి పొయ్యిమీదనుంచి ఒక పడి ఇగురువరకు కాచి దించి అభ్రకమును పాన కలిగిన పల్లెయందు ఒక దినముంచి మరునాడు తీసి కాడియందుంచి నానిన తర్వాత నలిపినచో పొడి యగును. ఇది సింధూరమునకు తగునైన శుద్ధి యగును.

### అయః శుద్ధి

ఇనుప బాణలియందు మంచినూనె పోసి బాగుగా నూనె కాగిన తర్వాత అయః పొడిని వేసి కాసేపుంచి పొడిని యెత్తుకొని పల్లెరుమ్మపట్టి రసములో రెండుజాములు నానబెట్టి తర్వాతను కాడిలో కడిగిన శుద్ధి యగును.

### అశ్వగంధి శుద్ధి

అశ్వగంధిని ఆవుపాలలో మునుగునటుల వేసి ఉడికించిన శుద్ధి యగును.

### అంజనములకు శుద్ధి

గుంటగలగరాకు రసమున ఒకరోజు భావనచేసి యెండించిన శుద్ధి యగును.



### ఇంగిలీక శుద్ధి

ఇంగిలీకమును తేనెయం దొకదినమును, చనుబాలలో నొక దినమును నానబెట్టి మరుదినము గ్రహించి, నిమ్మపండ్లరసము, కుప్పింటాకురసము, చనుబాలు యీ మూటిని సమముగా చేర్చి పొయ్యిమీద నుంచి దానియందు ఇంగిలీకపు ముక్కనువేసి కాచిన నది శుద్ధి యగును.

### ఇంగువ శుద్ధి

ఇంగువను చిన్నముక్కలుగ కొట్టి నేతిలో దోర వేయించిన ఇంగువ శుద్ధియగును.

### ఉమ్మెత్తవిత్తుల శుద్ధి

ఈ విత్తులను ఏటినీళ్ళలో ఒకజాము నానబెట్టిన శుద్ధియగును.

### ఎలుకపాషాణ శుద్ధి

పంది పాలలో మూడుగడియలు డోలాయంత్రమున నుడికించి శుద్ధోదకమున కడిగిన శుద్ధి యగును.

### కర్పూర శిలాజిత్తు శుద్ధి

తమలపాకుల రసములో కర్పూరమును నూరిన శుద్ధి యగును. శిలాజిత్తులు సరస్వతి ఆకురసములోనూరి యెండించిన శుద్ధి యగును.

### కఛరి శుద్ధి

కఛరిని చిన్న ముక్కలుగ చేసి గుడ్డలో మూటగట్టి త్రిఫలా కషాయములో గాని, గోమూత్రముతో గాని రెండుజాములు వండిన శుద్ధి యగును.

### కృష్ణాభ్రక శుద్ధి

పుల్లని కూటినీళ్ళలో పదిదినములు ఉడకనిచ్చిన శుద్ధియగును.

### కంచు శుద్ధి

కంచును కాచి చింతాకురసములోను, ఉలవకషాయములోను ప్రత్యేకముగ మూడుసార్లు ముంచిన శుద్ధియగును.

### కంకుష్ఠ శుద్ధి

కంకుష్ఠమును అల్లపురసములో ఏడుసార్లు భావనచేసిన శుద్ధి యగును.

### కాంత శుద్ధి

పొన్నగంటి ఆకురసములో కాంతమును బాగా కాగనిచ్చి యా రసములో ముంచవలెను. ఇటుల పదిమారులు చేసిన శుద్ధియగును.

### గరుడపచ్చ శుద్ధి

గరుడపచ్చను చిన్నచిన్న ముక్కలుచేసి గుడ్డలోకట్టి కలబంద రసములో ముప్పదిఘడియలు ఉడకనిచ్చి కడిగిన శుద్ధియగును.

### గైరికము (కావిరాయి) శుద్ధి

ఆవుపాలలో ఒకజాము భావనచేసిన శుద్ధియగును.

### గారిపాషాణ శుద్ధి

గారిపాషాణమును ఆవుపాలు, పేకరసము, సున్నపుతేట, మిరియాల కషాయము వీనిలో దేనిలో నయినను డోలాయంత్రమున గట్టి వండి పిదప వంటిపాలలో వండిన శుద్ధియగును.

### గంధక శుద్ధి

గంధక మొక పలము ఆవునేతిలో వేయించి పిదప పాలయందు ఏడుమార్లు కాచిన శుద్ధియగును.

### మరొక విధము

నల్లికాయ గంధకమునుమారి వెడల్పుమూతి కుండను తెచ్చి అందులో ఉమ్మెత్తాకురసము, మెంగలిచండ్లరసము, లింగపొట్ల ఆకు రసము, కలబందరసము, తెల్లగలిజేరు మూలరసము, చిత్రమూల రసము, వావిలాకురసము, ఆవునేయి, తేనె వీనిలో ఒక్కొక్క రసమును కుండలో సగమువరకు పోసి ఆ కుండమూతికి కొత్త పై జిగుడ్డ బాగుగ లాగినకట్టి ఆ గుడ్డమీద గంధక చూర్ణమును తేలికగ పట్టి సంతపోసి పైన మూకుడు బోర్లించి సంధిబంధనముచేసి మట్టిపూసి పాడిమీద చల్లి ఆరనిచ్చి గుంటత్రవ్వి దానిలో కుండనుపెట్టి మూతి వరకు మన్నుపోసి పూడ్చి మూకుడుపైన పిడకలతో పుటము పెట్ట వలెను. పుటము వేసినతర్వాత పైబూడిదతీసి నెమ్మదిగ మూకుడు తీసి లోపల కాలియున్న గంధకమును గ్రహించవలెను. పక్వమైన మెదలు జొన్నగింజలవలెనుండును. మంట ఎక్కువైన గంధకము రసములో పడియుండును. మంట తక్కువైన గంధకము కరగ



కుండును. ఇటుల శుద్ధి చేయబడిన గంధకము ఔషధముల నుపయో గింప శ్రేష్ఠమగును.

### చూర్ణ శుద్ధి

వస్త్రగాలితము చేసిన చూర్ణమును పాలతో తడిపి ముద్ద చేసి కుండకు గుడ్డకట్టి ఆ గుడ్డపై చూర్ణముద్దను పెట్టి మూతపెట్టి ఆవిరిలో ఉడికించి పిదప తీసి పొడిచేసి యెండించి చక్కెర కలుపుకొని వాడవలెను. ఇటులచేసిన శుద్ధియగును.

### జాజికాయ శుద్ధి

ఎసరు కాగు సమయమున జాజికాయను ఎసరులోవేసి ఉడికించిన శుద్ధియగును. పిదప మందులలోనికి వాడుకొనవచ్చును.

### జిలకర (తెలుపు నలుపు)

సున్నపు తేటలో ఏడు జాములు నానబెట్టిన శుద్ధియగును.

### జీడిగింజల శుద్ధి

మంచినీళ్ళలో అరువది ఘడియలు యీ గింజలను నాననిచ్చిన శుద్ధియగును.

### తాళకము శుద్ధి*

తాళకములో రెండు రకములున్నవి. ఒకటి పత్రతాళకము, రెండవది పిండతాళకము. పత్రతాళకము బంగారు వర్ణము కలిగి పొరలువచ్చును. ఇది ఔషధములకు మిక్కిలి యుపయుక్తమైనది. పిండతాళకము పైపూత నుపయోగించు మందులలో వాడుదురు. పత్రతాళకమును పలుచని రేకులుగ ఒలిచి చిన్నచిన్న ముక్కలు చేసి గుడ్డలో మూటగట్టి డోలాయంత్రమున బూడిద గుమ్మడికాయ రసముతోగాని త్రిఫలా కషాయము లేక సున్నపునీళ్లు వీటిలోగాని ఒకజాము వండిన శుద్ధియగును. శుద్ధితాళకమును నిమ్మకాయ రసముతో తడియ లేకుండ నుండువరకు మర్దించి చూర్ణించి యుంచుకొనినచో సర్వదానిని ఔషధములలో చేర్చుకొన వీలగును.

### తారమాక్షిక శుద్ధి

నిమ్మపండ్ల రసమున మూడుదినములు భావనచేసి మంచు ఎండలో యెండించిన శుద్ధియగును.

* తాళకం 1 ఫలం, సున్నపునీరు/కాడి కషాయం నందు 3 రో. నాన బెట్టి ఎత్తిన శుద్ధి అగును.

### తామ్ర శుద్ధి

ఒక పలము తామ్రమును అగ్నిలో తప్తముచేసి ఎర్రగ కాగిన పిదప దానిని మజ్జిగ, జిల్లేడుపాలు, నువ్వుల నూనె, నిమ్మ రసము, ఆవుపాలు వీనియందు ఏడుసారులు భావనచేసిన తర్వాతను పొన్నగంటి ఆకు రసములో భావనచేసిన శుద్ధియగును.

### తెల్ల పాషాణము శుద్ధి

తెల్లపాషాణము ఒక పలమును గోధుమపిండి కవచముచేసి తెల్లమేక పంచితమును ఒక కుండయందు పోసి డోలాయంత్రమున నుడకబెట్టిన శుద్ధియగును.

సౌవీరపాషాణమును టెంకాయనీళ్ళతో ఒకజాము (3గంటలు) వండినను లేక స్తన్యముతో ఏడుమార్లు మర్దించినను శుద్ధియగును.

### నల్లసీసం శుద్ధి

తెల్లమేక పంచితమున నల్లేరు సమానం నూరి కలిపి, నల్ల సీసమును మంచిమూసలో కరిగించి ఆవు పంచితమునబోసి, అడుగు జిడ్డును పారబోస్తు ఇటుల పదిమార్లుచేసిన శుద్ధియగును.

### నల్లమందు శుద్ధి

నల్లమందును నేతితో నొక దినము మర్దించిన శుద్ధియగును.

### నాగ శుద్ధి

ఒక పలము నాగమును తెల్లవుమ్మెత్త పుచ్చ లేక నిమ్మరసమును కాడినీళ్లు వీటియందు కాచి ఏడుమారులు భావనచేసిన శుద్ధియగును.

### * నాభి శుద్ధి

పుచ్చని మంచి నాభిని ఆవు పంచితములో రెండు రోజులుంచి తీసి నిలువగల పంచితమును పారబోసి తిరిగి క్రొత్త పంచితమును తెచ్చి పింగాణి పల్లెములో యీ ముక్కలను వేసి బాగా కడిగి పారబోయవలెను. తర్వాత కత్తితో సన్నగా చక్రములుగ తరిగి ఆవు పంచితమును కుండలోపోసి డోలాయంత్రమున రెండుజాములు వండవలెను. ఇటుల మరొక్కసారి చేసి యెండబెట్టవలెను. ముక్కలు కోసిన తర్వాతకూడా ఏడుదినములు గోమూత్రములో నానబెట్టి తర్వాత యెండబెట్టుటకూడ కలదు. ప్రతిదినము గోపంచితము పోయ

* [illegible] నాభిని [illegible] శుద్ధి



వలెను. ఇదికూడ ఒక పద్ధతియే యగును. నాభి అపాయకరమైనది కనుక శుద్ధి క్రమమున దానికొరకు ఉపయోగింపబడిన పాత్రలు గాని, వలచినములుగాని ఇతర వస్తువులతో కలియనీయక జాగ్రతగ నుంచి శుభ్రపరచి యుంచుకొనవలెను. కుండను పగులగొట్టి పారవేయవలెను. చేతులను శుభ్రముగ కడుగుకొనవలెను. ఈ విషయమున తగిన జాగ్రత తీసుకొనవలెను.

### * నేపాళము శుద్ధి

నేపాళము విత్తులపై గల బెరడును పగులగొట్టితీసిన గింజలను ఆవుపేడ కల్కములో ఒక జాముఉండి తీసి వేడినీటిలో కడిగి వెంటనే గింజలను ఒలిచి లోపలగల నాలుకలను తీసివేసి ఆ పప్పును తెల్లపు పానకము, ఆవుపాలు వీనితో డోలాయంత్రమున ఒక్కజాము వండవలెను. ప్రతిదినము పప్పులను వేడినీళ్ళతోనే కడుగవలెను. తర్వాత ఆరవేసి ఆవునేతితో గింజలను దోరవేయించిన శుద్ధియగును.

### పగడ శుద్ధి

పగడమును పులిసిన కూటినీళ్ళలో నాలుగు ఘడియలు డోలాయంత్రమున నుడికించిన శుద్ధియగును.

### మరొక పద్ధతి

ఆవు మజ్జిగలో ఉడికించినను శుద్ధియగును.

### పటికారము శుద్ధి

ఆవు పాలలో నొకదినము నానబెట్టి మంచినీటితో కడిగిన శుద్ధియగును.

### పాలతుత్తము శుద్ధి

పాలతుత్తమును సున్నపు తేటలో రెండుజాములు డోలాయంత్రమున వండిన శుద్ధియగును.

### పాషాణముల శుద్ధి

గౌరీపాషాణమును నిమ్మరసముతోనూరి ముద్దచేసి యెండించి గుడ్డలో మూటగట్టి డోలాయంత్రమున సున్నపునీళ్ళతో నొకజాము (3 గంటలు) వండిన శుద్ధియగును. శంఖపాషాణమును కాకరాకు స్వరసముతో డోలాయంత్రమున వండిన శుద్ధియగును.

* [illegible] శుద్ధి.

### పిప్పళ్ళ శుద్ధి

పిప్పళ్ళను నిమ్మపండ్ల రసమున నానబెట్టిన శుద్ధియగును.

### పాషాణాలతో చేరినవాని శుద్ధి

గుంటగలగరాకు, కుప్పింటాకు, తాదాకు, ఉమ్మెత్తాకుల రసము, నిమ్మపండ్లరసము, తునిపిమూత్రము, కాటినీళ్లు ఇవి సమం, కాటిపుప్పు సున్నము చేరినది ఒక పలం, సూర్యనార ఉప్పు 1 పలం, పటికారం 1 పలం వీటిని పై రసమున వేసి కలిపి యుంచుకొని పాషాణాలతో చేరిన వస్తువులను వేఱువేఱు గుడ్డలలో మూటగట్టి యా రసమున నలుబది రోజులు నానబెట్టిన శుద్ధియగును

### పెన్నేరుగడ్డ-తెగడ వీని శుద్ధి

ఆవుపాలలో నాలుగు ఘడియలు ఉడకనిచ్చిన శుద్ధియగును.

### మండూర శుద్ధి

మండూరపురాళ్ళను పగులగొట్టి కాల్చిన గోపంచితమున ఏడుమారులు ముంచియెత్తిన శుద్ధియగును.

### మణిశిల శుద్ధి

ఎఱుపు వర్ణము కొద్దిగ పసుపు వర్ణముగల మణిశిల ఉత్తమమైనది. కంపీర మన్నిటికంటెను శ్రేష్టమైనది. మణిశిలను అవిశాకు రసముతోగాని లేక అల్లపు రసముతోగాని ఏడుసార్లు భావనచేసి యెండించిన శుద్ధియగును.

### మాచికాయ శుద్ధి

ఆవు నేతియందు వేయించిన శుద్ధియగును,

### మిర్యాల శుద్ధి

మిరియము ఒక పలం పుల్లని పెరుగునందు మూడు దినములు నానబెట్టి యెండించి వేయించిన శుద్ధియగును,

### ముష్టివిత్తుల శుద్ధి

ముష్టివిత్తులను (ముషిణి) ముక్కలుచేసి చిర్రివేళ్ళ రసముతో రెండుజాములు వండవలెను. తర్వాత నిమ్మపండ్ల రసముతో రెండు జాములు వండిన శుద్ధియగును. వానిని తడిమీదనే ముక్కలుచేసి ఎండించి భద్రపరచవలెను,



తెల్లపాషాణం గంధకము వేసి ఎత్తిన శుద్ధి.

### ముదారుసింగు శుద్ధి

కాటికల్లులో డోలాయంత్రమున నాలుగు ఘడియలు వండిన ముదారుసింగు శుద్ధియగును.

### మైలతుత్తము శుద్ధి

మైలతుత్తమును పెరుగుతో నూరి బిళ్ళలుచేసి మూకుడిలో నుంచి అది యెండి ఎఱ్ఱనగువరకు నిప్పుపై కాచవలెను. అటుల చేసిన శుద్ధియగును. లేక పెరుగులో నొకగంట నానబెట్టి కడిగి యెండించి నిప్పుపై పొంగించిన నది తెల్లగ పొడియగును. ఇటుల చేసికూడా మందులలో వాడవచ్చును.

### ముత్యపు చిప్పలు (శుక్తి) శుద్ధి

ముత్యముల చిప్పలను చిన్న ముక్కలుగ గొట్టి నిమ్మపండ్ల రసముతో నొక్కజాము డోలాయంత్రమున వండిన శుద్ధియగును,

### రసకర్పూర శుద్ధి

రసకర్పూరమును ఒకజాము చనుబాలలో మర్దించిన శుద్ధియగును.

### రససింధూర శుద్ధి

రససింధూరము నిమ్మపండ్ల రసముతో నొకజాము, చనుబాలతో నొకజాము మర్దించిన శుద్ధియగును,

### రసశుద్ధి

ఇంగిలీకమునుండి తీసిన పాదరసమునకు శుద్ధి యక్కరలేదని కొందరి మతము, కాని రసమును రసాయనముగ నుపయోగించునపుడు క్రింది విధముగ ఎనిమిది విధములగు సంస్కారములను చేసి తర్వాత నుపయోగించవలెను.

### స్వేదనము

త్రికటుకములు, ఆవాలు, అల్లము, ముల్లంగిదుంప, సైంధవ లవణము, చిత్రమూలము వీనిని (సమము ఎత్తు) మెత్తగా నూరి మధ్యను పల్లముచేసి యందు రసమునుంచి ఆ ముద్దతో నేకప్పి గుడ్డలో మూటగట్టి డోలాయంత్రమున కాంజికముతో మూడు రోజులు వండవలెను.

### మర్దనము

ఆవాలు, పసుపు, అల్లము, త్రిఫలములు, లశునము కరి ధూపము, సైంధవ లవణము, వీనిని పై విధముననే చేసి మూడు దినములు మర్దించవలెను.

### మూర్ఛనము

చిత్రమూల కషాయము, త్రిఫలా కషాయము, కలబందగుజ్జు వీనితో నొక్కొక్కదానితో ఏడుసార్లు మర్దించవలయును.

### ఉత్థాపనము

రసమును కాంజికముతో ఒకజామునూరి నీటితో శుభ్రపరచవలెను.

### పాతనము

ఈ క్రియలో రెండు విధములు గలవు ఒకటి ఊర్ధ్వపాతనము రెండవది అధఃపాతనము, ఊర్ధ్వపాతనము ఇటుల చేయవలెను, ఇంగువ, పంచలవణము, సర్జక్షారం, యవక్షారము వీనిని నిమ్మరసముతో నూరి ఊర్ధ్వపాతమున యంత్రమునందుంచి రసమునకు ఊర్ధ్వపాతనము చేయవలెను.

### అధఃపాతనము

ఆవాలు, కానిక్కాయ, కరక్కాయ, సైంధవలవణము, చిత్రమూలం, మునగచెక్క వీనితో రసమును మర్దించి అధఃపాతన యంత్రమున పైకుండకుబూసి రసమునకు అధఃపాతనము కలిగించవలెను.

### బోధనము

సైంధవోదకమునందు రసమును వేసి దానిని సీసాలోపోసి మూడు దినములు భూమిలో ఖననముచేసి యుంచి తర్వాత తీసికొనవలెను.

### నియమనము

నల్లికాయ, గుంటగలగర, తుంగముస్తెలు, చింత నవాసారము వీని కల్కమందు రసము కాంజికముతో స్వేదనము చేయవలెను.



### దీపనము

చిత్రమూల కషాయము, కాంజికము, వీనితో రసమును అన్నభేది, మిర్యాలు, పటిక, వెలిగారం, చిత్రమూలం, పంచలవణము, ఆవాలు వీని కల్కములో నుంచి మూటగట్టి డోలాయంత్రమున వండవలెను. ఇటుల చేయుటకు విశేష శుద్ధి యనబడును,

### సామాన్య శుద్ధి

త్రికటుచూర్ణము త్రిఫలాచూర్ణము, కలబందరసము, సైంధవలవణము, కరిధూపము, ఆవాలుపొడి, వెల్లుల్లిరసము, కాంచియాకురసము వీనితో ప్రత్యేక ప్రత్యేకము ఒకజాము చొప్పున మర్దించి బియ్యపు కడుగుతోగాని వేడినీళ్ళతోగాని కడిగిన శుద్ధియగును,

### రాతిమధురం శుద్ధి

మనిషి ఉచ్చలోను, గాడిద ఉచ్చలోను కడిగిన శుద్ధియగును.

### రాతినార శుద్ధి

గాడిద ఉచ్చలో డోలాయంత్రముతో ఉడకనిచ్చిన శుద్ధియగును,

### లక్క శుద్ధి

మంచినీళ్ళలో వేసి పొయ్యిమీదనుంచి వండవలెను, ఇటుల ముమ్మార్లు చేసిన శుద్ధియగును,

### లింగ శుద్ధి

ఒకపలము నుంచి లింగమును కప్పింటాకు నూరి ఉండగా చేసి మధ్యనుంచి 3 దినములు ఉంచి తర్వాతనుతీసి చనుబాలలో నానబెట్టిన శుద్ధియగును,

### లోహ శుద్ధి

మంచినూనెలో ఒక దినము ఊరనిచ్చి కడిగి, నిమ్మపండ్ల రసములో నొకదినము ఊరనిచ్చి కడిగిన శుద్ధియగును,

### కాము శుద్ధి

సున్నపు తేటలో ఒకజాము నానబెట్టిన శుద్ధియగును,

### వెలిగారము శుద్ధి

మడ్డి వెలిగారపు పలుకులను ఆవుపేడ కలాపిలో ముంచి తీసి వేన్నీళ్ళతో కడిగి వెంటనే గుడ్డలోవత్తి ఎండబెట్టవలెను, ఎంత మాత్ర మాలిన్యమైనను నీటిలో కరిగిపోవును,

### వైక్రాంతశుద్ధి

వైక్రాంతములను కాల్చి ఉలవకషాయమున ఏడుసార్లు వేసిన శుద్ధియగును.

### శంఖముశుద్ధి

శంఖమును (తెలుపు బరువుగలవి) ముక్కలుచేసి నిమ్మపండ్ల రసముతో నాలుగుజాములు డోలాయంత్రమున వండిన శుద్ధియగును. లేక మూడుదినములు నిమ్మరసముతో నానవేసినను శుద్ధియగును.

### శృంగిశుద్ధి

దుప్పికొమ్ములను ముక్కలుచేసి వావిలాకు కషాయములోగాని నేలవుసిరిక కషాయములోగాని డోలాయంత్రమున నొకజాము వండిన శుద్ధియగును.

### శొంఠిశుద్ధి

శొంఠి కొమ్ముకపలమును పై బెరడుతీసి సున్నముపూసి యెండబెట్టిన శుద్ధియగును.

### సత్తుశుద్ధి

మనిషి మూత్రము, రాతిసున్నం, నిమ్మరసం, నవాచారం ఇది సమం. ఇందులో కొంచెము తీసికొని ఒకపాత్రలో వుంచి మేక నేయి కొంచెము సత్తువేసి కరగనిచ్చి, దానిని పారబోసి ఇటుల పదిసార్లు చేసిన శుద్ధియగును.

### సహస్రభేదిని శుద్ధి

చిచ్చిలికాయ రసములో నొకదినము నాననిచ్చిన శుద్ధియగును

### స్వర్ణమాక్షీ శుద్ధి

స్వర్ణమాక్షికమునకు ¼ వంతు సైంధవలవణము వేసి మాదీఫలరసమునగాని, నిమ్మరసమునగాని నూరి ఇనుపబాణలిలో వేసి కొలిమిలోనుంచి గాఢాగ్నితో, స్వర్ణమాక్షికము బాణలికూడ ఎర్రగ నగువరకుంచి పిదప చల్లారినపిదప తీసికొనిన శుద్ధియగును.

### హరిదారశుద్ధి

హరిదారమును చిన్నతునకలుచేసి చిప్పలోవేసి పై మూతలో మూడు ద్వారములుంచి నిప్పుపై నబెట్టి ఊదిన మొదట నల్ల పొగ వచ్చును. పిదప ఎఱ్ఱగ పొగవచ్చునపుడు దింపుకొనిన శుద్ధియగును.

శుద్ధి ప్రకరణము సమాప్తము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు
# పులిప్పాణివైద్యము

## చూర్ణప్రకరణము

ముఖ్యగమనిక :— చూర్ణములో నుపయోగింపబడు వస్తువులన్నియు సాధ్యమైనంతవరకు క్రొత్తవిగను పుచ్చనివిగను ఉండవలెను. ఒక సంవత్సరము పాతబడిన మూలికలను ఉపయోగింపరాదు. వస్తువులలో కల్తీలేకుండ, మన్ను దుమ్ము ఇట్టివి లేకుండ చూడవలెను. కొన్ని వస్తువులు వేయించియే వాడవలెను పిప్పళ్ళు, శొంఠి, జీలకర్ర, జాజిపత్రి, లవంగాలు, నాగకేసరం, తక్కోలాలు వీని దోరగ వేయించవలెను. చూర్ణము వస్త్రగాళితము తప్పక చేయించవలెను. చూర్ణము సూక్ష్మముగ నుండుట అవశ్యకము.

పచ్చకర్పూర, ఇంగువ, లవణములు, బాదంపప్పు, జాజికాయ, జాపత్రి, సారపప్పు ఇట్టివి వస్త్రగాళితము చేయ వీలులేదు, అట్టి వానిని బాగుగ దంచి చూర్ణముతో కలిపి యుంచవలెను. చూర్ణములను పింగాణీ జాడీలలోగాని, సీసాలలోగాని, లేక డబ్బాలలోగాని గాలిపోకుండ భద్రపరచవలెను. లవణమును, క్షారములు, ఆమ్లరస పదార్థములు కలసినవానిని డబ్బాలలో నుంచరాదు. చూర్ణము లన్నియును 60 దినములకంటె నిలువయుండరాదు, తర్వాతను దాని బలము క్షీణించిపోవును.

### అశ్వగంధి చూర్ణము (పెన్నేరుగడ్డ)

| | | | |
|---|---|---|---|
| 1 లవంగాలు | 1 పలం. | 5 పిప్పళ్ళు | 16 పలం |
| 2 నాగకేసరాలు | 1 ప. | 6 శొంఠి | 32 ప. |
| 3 తేలకులు | 4 ప. | 7 పెన్నేరుగడ్డ | 64 ప. |
| 4 మిర్యాలు | 8 ప. | 8 చీనిచక్కెర | 124 ప. |

వస్నికగడ్డను అవుపాలలో శుద్ధి చేసికొని నీడ నెండించి ఇతర వస్తువులను దోరవేయించి అన్నిటిని కలిపి బాగుగ దంచి వస్త్రగాలితముచేసి దీనిచక్కెర కలిపి సీసాలో జాగ్రతచేయవలెను. మూడువ్రేళ్లు పట్టునంత చూర్ణమును దినమునకు రెండు పూటలు సేవించేది. అనుపానము చన్నీరు, పాలు.

### తీరునట్టి వ్యాధులు

మేహాసంబంధమైన వాతము, పిత్తవాతము, ఉష్ణవాతము, గ్రహణీభేదులు, అస్థిగతజ్వరములు, కృశించుట ఇవి తీరును. స్త్రీలకు వంధ్యత్వము పోవును. 5 వయస్సు మొదలు 16 వయస్సు గలవారలకు శరీరబలమున కిది వాడవచ్చును.

### అష్టచూర్ణము

| | |
|---|---|
| 1 శొంఠి | 5 నల్లజిలకర్ర |
| 2 పిప్పళ్ళు | 6 అజామోదము |
| 3 మిర్యాలు | 7 సైంధవలవణము |
| 4 జిలకర్ర | 8 ఇంగువ |

ఇవన్నియు సమము. ఇందు 1, 2, 4 వస్తువులను దోరవేయించి చూర్ణించి వస్త్రగాలితము చేయవలెను. ఇంగువను నేతితో వేయించి పొడిచేసికొనవలెను. నల్లజిలకర్ర తైలమిశ్రమము మైనది గనుక ఖల్వమున నూరవలెను. సైంధవ లవణము ఇంగువ నల్లజిలకర్ర వీనిని జల్లెడపట్టి అన్నింటిని ఏకముచేసి సీసాలో భద్రపరచవలెను. లేక డబ్బాలలో నుంచిన తేమపట్టును.

మూడువ్రేళ్ళతో పట్టినంత చూర్ణము పూటకు వాడవలెను.

### ఇందున తీరునట్టి వ్యాధులు

కడుపులోని బాధ, అమవిరేచనములు, ఆకలిలేమి, పరిణామశూల ఇవి తీరును. కడుపులోని బాధకు వేడినీళ్ళు, అమవిరేచనములకు మజ్జిగతేట అనుపానము. ఆకలిలేమి, పరిణామశూలకు భోజనమప్పుడు మొదటిముద్దతో చూర్ణమును వేసుకొని నేయి కలిపి తినవలెను, దీనిని బారమున కొకసారి తయారుచేసికొనవలెను.



### ఏలాదిచూర్ణము

| | | | |
|---|---|---|---|
| 1 లవంగ | 1 భాగము | 5 తుగ్గ సేరు | 16 భాగము |
| 2 మిరియాలు | 2 ,, | 6 శొంఠి | 32 భాగము |
| 3 నాగకేసరములు | 4 ,, | 7 ఏలకులు | 64 భాగము |
| 4 తాళిసపత్రి | 8 ,, | | |

వీనిని దంచి వస్త్రగాలితముచేసి సమం చీని చక్కెర చేర్చి సీసాలో భద్రపరచవలెను. ఉదయం సాయంకాలములయందు మూడువ్రేళ్ళు పట్టినంత చూర్ణమును సేవించవలెను.

### ఇందున తీరునట్టి వ్యాధులు

వాత, పిత్త సంబంధమైన గ్రంథులు, వ్రణములు, మేహకురుపు, దురద, గజ్జి ఇవి తీరును.

### తాళిశపత్రిచూర్ణము

| | |
|---|---|
| 1 కురాసానివోమం | 12 లవంగపత్రి |
| 2 వాము | 13 గసగసాలు |
| 3 ధనియాలు | 14 సోంపు |
| 4 జిలకర్ర | 15 చెంగల్వకోష్టు |
| 5 అక్కలకర్ర | 16 జాపత్రి |
| 6 తాడికాయ బెరడు | 17 లవంగాలు |
| 7 నల్లికాయ బెరడు | 18 జాజికాయ |
| 8 కరక్కాయ బెరడు | 19 అతిమధురం |
| 9 మిర్యాలు | 20 చలవమిర్యాలు |
| 10 సన్నపిప్పళ్ళు | 21 యేలకులు |
| 11 శొంఠి | 22 నాగకేశరాలు |

ఇవి సమం

తాళిశపత్రి వీనికి పది వంతులు

వీనిని యెండించి దంచి వస్త్రగాలితముచేసి సమముగ చీని చక్కెర కలిపి సీసాలో భద్రపరచవలెను. మూడు వేళ్ళు పట్టినంత చూర్ణము పూటకు సేవించవలయును.

### ఇందున తీరునట్టి వ్యాధులు

గ్రహణి, అతిసారభేదములు, ఉష్ణవాతభేదములు, కడుపులో మంట, పైత్యవికారము, అరోచకము, ఆకలిలేమి, వాంతులు, అరికాలు అరచేయి మంట ఇట్టివి.

### అమృతవల్లి చూర్ణము

తిప్పతీగ పై బెరడును కత్తితో చివ్వి ఎండించి చూర్ణించి ఒకపడి చూర్ణమునకు 8 పళ్లు మంచి నీరుపోసి 8 జాములు నానబెట్టి తర్వాతను చూర్ణము జారిపోని విధముగ నీళ్ళను వడయపోసి మళ్ళీ నీటిలో నానబెట్టి వడయపోయవలెను ఇటుల 10 మారులు చేయవలెను. ఇదైన తర్వాత 8 సేర్ల పుల్లనీళ్ళలో అర్ధసేరు నిమ్మరసముపోసి 8 జాములు నాననిచ్చి వంచుకొనేది. తర్వాత ఆవుమజ్జిగ 8 సేర్లు, నిమ్మరసము అర్ధసేరు కలిపి అందు 8 జాములు నాననిచ్చి వడపోసుకొనేది, తర్వాత ఆవుపాలు 2 సేర్లు, పంచదార అర్ధవీసె కలిపి నాననిచ్చి యెండించవలెను.

| | | | |
|---|---|---|---|
| తిప్పసత్తు | 1 పలం | లవంగాలు | 1 పలం |
| జాజికాయ | 1 పలం | గసగసాలు | 1 పలం |
| జాజిపత్రి | 1 పలం | తాళీసపత్రి | 1 పలం |
| చలవమిర్యాలు | 1 పలం | మాచికాయ | 1 పలం |
| ఏలకులు | 1 పలం | | |

వీనిని చూర్ణముచేసి శుద్ధిచేయబడిన తిప్పబెరడు చూర్ణముతో కలిపి 6 పలాల చీనాపంచదార చేర్చి మూడువ్రేళ్లు పట్టినంత చూర్ణమును ఉదయ సాయంకాలములందు నెయితో పుచ్చుకొనేది.

### దీనివలన తీరునట్టి వ్యాధులు

ఇరువదిరెండు విధములగు మేహములు, ప్రమేహములు, తీరును, క్షీణించిన శరీరము పుష్టిగాగును. అస్థిగతజ్వరము నిశ్శక్తి, మూలరోగము, పైత్యరోగములు, కండ్లుమంట ఇవి తొలగి శరీరము చల్లబడి రక్తము శుభ్రమగును. దేహకాంతి పెరుగును.

బాలరససింధూరం, ఘృతసింధూరం కలిపి కూడా వాడవచ్చు.



### త్రిఫలా చూర్ణము

కరక్కాయ తానికాయ ఉసిరికాయ

వీని బెరడు సమయము యెండించి చూర్ణించి వస్త్రగాళితము చేసి సమము పంచదార కలిపి యుంచుకొనవలెను. పూటకు మూడు వ్రేళ్ళు పట్టినంత పుచ్చుకొనవలెను.

### ఇందువలన తీరే వ్యాధులు

మలబద్ధమును పోగొట్టును, త్రిదోషములను హరించును, శ్వాసకాసలను నివారించును, బలమును కలిగించును, అనుపానము, దగ్గులకు తేనెతోను, మలబద్ధకములకు వేనీళ్లు, నేత్రములకు దృష్టి కలుగుటకు, ఈ చూర్ణమును నెయి, తేనె కలిపి రాత్రిపూట సేవించవలెను.

### శాల్మలీ చూర్ణము

బూరుగబంక నెండించి దంచి వస్త్రగాళితముచేసి యుంచుకొనవలెను. పెసరమొత్తు వాడవలెను.

### ఇందు తీరునట్టి వ్యాధులు

రక్తపిత్తము తీరును, పైత్యాహరము, రక్తమును కట్టును, రక్తవిరేచనములకు వెన్నతో పుచ్చుకొనవలెను. రోగబలము ననుసరించి రోజుకు నాల్గునార్లవరకు వాడవచ్చును, రక్తబంక విరేచనములకు, దానిమ్మ పిందెలు, దాదినచెక్క. జీలకర్ర కషాయము అనుపానము.

### త్రికటు చూర్ణము

శొంఠి మిర్యాలు పిప్పళ్లు

ఇందులో శొంఠిని, పిప్పళ్ళను వేయించి చూర్ణించవలెను. మిర్యాలు యెండించి చూర్ణించవలెను. అన్నిటిని కలిపి చూర్ణించి వస్త్రగాళితము చేసికొనవలెను. మూడు వ్రేళ్ళు పట్టినంత చూర్ణము వాడవలెను.

### తీరునట్టి వ్యాధులు

ఆకలి కలిగించును, వాతమును ఖండించును, జ్వరహారము,

## మహారామేశ్వర చూర్ణము

| | | | |
|---|---|---|---|
| జాజికాయ | 1 పలం | గసగసాలు | 1 ప |
| జాపత్రి | 1 ప | చలవమిర్యాలు | 1 ప |
| పత్తివిత్తుల పప్పు | 1 ప | పరంగిచెక్క | 1 ప |
| అతిమధురం | 1 ప | నేలగుమ్మడివేళ్ళు | 1 ప |
| మొగ్గలుతీసిన లవంగం | 1 ప | సోంపు | 1 ప |
| నీరుబొబ్బి విత్తులు | 1 ప | ముల్లంగి విత్తులు | 1 ప |
| యేలకులు | 1 ప | అత్తివిత్తులు | 1 ప |
| సన్నరాష్ట్రం | 1 ప | మర్రివిత్తులు | 1 ప |
| లవంగపట్ట | 1 ప | చల్లవిత్తులు | 1 ప |
| తులసివిత్తులు | 1 ప | రుద్రజడ విత్తులు | 1 ప |
| రావివిత్తులు | 1 ప | నేలతాటిగడ్డ | 1 ప |

ఇవన్నియు సమం, వీటిని దోఁడించి చూర్ణించి వస్త్రగాలితము చేసుకొనవలెను. పిదప అందులో కుంకుమపువ్వు, పచ్చ కర్పూరము, అభిని ఇవికూడ పై వాటితో సమము. వీటిని చూర్ణించి పై చూర్ణముతో కలిపి 5 పలములు చక్కెర కలుపుకొని పూటకు పావలాయెత్తు చూర్ణము రెండుపూటలు సేవించి ఆవుపాలు పుచ్చుకొనేది.

### ఇందున తీరునట్టి వ్యాధులు

చచ్చువాతము, వాతరోగము, మేహరోగములు, సర్దిరోగములు, నపుంసకత్వము. దీని సేవనవలన ధాతువృద్ధి. ఇచ్ఛాపథ్యము.

## పంచదీపాగ్ని చూర్ణము

| | | | |
|---|---|---|---|
| శొంఠి | 1 పలం, | జిలకర | 1 పలం |
| పిప్పళ్ళు | 1 ప. | ఏలకులు | 1 ప |
| మిర్యాలు | 1 ప. | | |

వీనిని వేడిచేసి చూర్ణించి వస్త్రగాలితముచేసి ఇందుకు సమంగా చీనిచక్కెర కలుపుకొని మూడు వేళ్ళు పట్టునంత చూర్ణము నేతితోగాని తేనెతోగాని పుచ్చుకొనేది.



### ఇందున తీరే వ్యాధులు

ఉష్ణమును శమించును, శూలవాతము, పిత్తవాతము శ్లేష్మము, అజీర్ణము, మైకము, అస్థిజ్వరం ఇవి ఇచ్ఛాపథ్యం.

## సుగంధపాల చూర్ణము

| | | | |
|---|---|---|---|
| సుగంధపాల | 10 పలములు | ముదురు వేప చెక్క | 1 ప. |
| శ్రీగంధపు చెక్క | 1 ప. | మునగ చెక్క | 1 ప. |
| నేరేడు వేళ్లు | 1 ప. | బిల్వ వేళ్లు | 1 ప. |
| వాడిశ చెక్క | 1 ప. | | |

వీటన్నిటిని చూర్ణించి వస్త్రగాలితముచేసి పూటకు పావలా యెత్తు చూర్ణమును వెన్నతోగాని, లేక నేతితోగాని, చక్కెరతోగాని పుచ్చుకొనేది.

### ఇందున తీరే వ్యాధులు

తెలుపురోగములు, పసిమిరోగములు, నీరుచురుకు, అతిదాహ, మేహవ్రణములు, ఇవి, శీతలపదార్థములు భుజింపకూడదు.

## పుష్యానుగ చూర్ణము

| | |
|---|---|
| చిరుబొద్ది | మారేడు గుజ్జు |
| నేరేడువిత్తుల పప్పు | లొద్దుగ చెక్క |
| మామిడిగింజల పప్పు | కేలుకురాయి |
| కొండిపిండి వేళ్ళు | కాయఫల చెక్క |
| రసాంజనము | మిర్యాలు |
| మాచికాయ | ద్రాక్ష |
| బూరుగబంక | శొంఠి |
| వాకుడు | దుండిలము |
| మంజిష్ట | రక్త చందనము |
| తామర మొగ్గలు | కొడిశపాలవిత్తులు |
| ఇంగువ | అడవి అత్తిపూవు |
| అతివస | నల్లసుగంధిపాల |
| తుంగముస్తెలు | తెల్లవద్ది చెక్క |
| | ఇప్పపువ్వు |

## దాడిమి చూర్ణము

| | |
|---|---|
| దానిమ్మ బెరడు | కొడిశపాల |
| మామిడిపప్పు | చింతవిత్తుల బెరడు |
| జీలకర | శొంఠి |
| జాపత్రి | అతివస |
| జాజికాయ | జటామాంసి |
| పత్తివిత్తుల పప్పు | పిప్పళ్ళు |
| ఉసిరికవరుగు | మిరియాలు |
| వెలగబంక | కురాసానివాము |

ఇవి సమం, వీనిని వచ్చుచేసి చూర్ణించి వస్త్రగాలితము చేసి నేతితోగాని, చక్కెరతోగాని పూటకు అర్ధతులము వంతున పుచ్చుకొనిన పైత్యసంబంధ రోగములు వాత సంబంధ రోగములు నయమగును.

## వజ్రవల్లి చూర్ణము

| | | | |
|---|---|---|---|
| నల్లేరు | 5 పలం. | నెల్లికాయ | 1 పలం |
| కరక్కాయ | 1 ప. | తానికాయ | 1 ప |
| దుష్టపువేళ్ళు | 1 ప. | అడ్డసరపువేళ్ళు | 1 ప |
| వాకుడువేళ్ళు | 1 ప. | ధనియాలు | 1 ప. |
| ఉస్తివేళ్ళు | 1 ప. | జీలకర | 1 ప. |
| నేలమునక్కాయ | 1 ప | ఇందుప్పు | 1 ప. |
| మిర్యాలు | 1 ప. | అల్లపు రసముతో నూరి | |
| పిప్పళ్ళు | 1 ప. | పుటము పెట్టిన | |
| శొంఠి | 1 ప. | ఉప్పు | 1 ప. |

ఇవన్నియు చూర్ణముచేసి వస్త్రగాలితముచేసి యీ చూర్ణముతో రెండు ఉప్పులను పొడిచేసి కలుపుకొని భద్రపరచవలెను. పూటకు అర్ధతులము చూర్ణము పుచ్చుకొనేది

### తీరునట్టి వ్యాధులు

దగ్గు, కఫము కట్టుకొనిన దగ్గు, వాతము, పిత్తము కడుపు నొప్పి, ఉబ్బసము, అజీర్ణము, గుల్మములు ఇవి ఇచ్చాపథ్యము.



## పరంగ్యాది చూర్ణము

| | | | |
|---|---|---|---|
| పరంగిచెక్క (ఆవుపాలతో శుద్ధి) | 10 పలాలు | అశ్వగంధి | 1 పలం |
| నేలగొలిమిడి | 1 పలం | శొంఠి | 1 పలం |
| కేలచెక్క | 1 పలం | పులిమిరిచెక్క | 1 పలం |
| యేలకులు | 1 పలం | పిప్పళ్ళు | 1 పలం |
| చిత్రమూలం | 1 పలం | లవంగాలు | 1 పలం |
| ధనియాలు | 1 పలం | జీలకర | 1 పలం |
| తాళీసపత్రి | 1 పలం | అతిమధురం | 1 పలం |
| నల్లవుప్పివేరు | 1 పలం | తక్కోలం | 1 పలం |
| తెల్లవుప్పివేరు | 1 పలం | చలవమిర్యాలు | 1 పలం |
| జటామాంసి | 1 పలం | మిర్యాలు | 1 పలం |

వీనిని దొండకొట్టి చూర్ణించి వస్త్రగాలితముచేసి చీని చక్కెర కలుపుకొని పూటకు ఒక తులము చొప్పున రెండు పూటలు సేవించేది. ఒక మండలము సేవించిన మేహ సంబంధమైన వ్యాధులన్నియు తీరును. ఉష్ణవాతము, సరముల పోట్లు, మేహవ్రణములు కూడ నయమగును. కందిపప్పు, వంకాయలు, పెసలపప్పు, మేక మాంసము ఇవి పనికివచ్చును.

## కటుకరోహిణి చూర్ణము

దీనిని ఎండించి చూర్ణముచేసి యుంచుకొనవలెను. అర్ధ తులము చూర్ణమును తేనె, పంచదార లేక వెన్నీళ్ళతో సేవించవలెను. దీని సేవనవలన మలబద్ధము తీరును. పైత్యశమనము, జ్వరము కామెర్లు వీనిని కూడా నివారించును.

## కర్పూరాది చూర్ణము

| | |
|---|---|
| కర్పూరము | తవాక్షీరి |
| లవంగము | జటామాంసి |
| ఏలకులు | నల్లకలవ గడ్డలు |
| నాగకేసరములు | పిప్పళ్ళు |

| | |
|---|---|
| దాచిన చెక్క | సుగంధపు చెక్క |
| శొంఠి | గ్రంథితగరం |
| జాజికాయ | కటువేపు |
| వట్టివేళ్లు | తక్కోలము |
| నల్లజీలకర | |
| కృష్ణాగరు చెక్క | ఇవి సమము. |

తక్కోలము, పిప్పళ్లు, శొంఠి, నాగకేసరాలు, లవంగాలు వీనిని దోరవేయించుకొని చూర్ణించవలెను. కర్పూరముతప్ప మిగిలిన వానిని దంపించి చూర్ణించి వస్త్రగాలితముచేసి కర్పూరమును నూరి అందులో చేర్చుకొని పంచదార చూర్ణమునకు సగము కలుపుకొని భద్రపరచవలెను. పూటకు అరతులము చూర్ణము సేవించవలెను. కఫమును హరించును. పడిశము, శ్వాసకాసము, హృద్రోగము వీనిని నిర్మూలించును.

ధనియాల చూర్ణము

| | | | |
|---|---|---|---|
| ధనియాలు | 6 పలాలు | లవంగపట్ట | 1 పలం |
| అతిమధురం | 1 పలం | సోంపు | 1 పలం |
| నల్లజీలకర | 1 పలం | జీలకర | 1 పలం |
| సతకుప్పి | 1 పలం | చీని చక్కెర | 1½ పలం |

వీటిని చూర్ణించి వస్త్రగాలితముచేసి పూటకు రెండు వరహాల ఎత్తు చూర్ణము వేసికొని వేన్నీళ్ళు త్రాగవలెను.

ఇందువలన తీరే వ్యాధులు

రొమ్మునొప్పి, రొమ్మున మంట, చెవినొప్పి, తలనొప్పి, వాంతి, నోట దుర్నీరు, కండ్లలో నీరుకారుట, నడుమునొప్పి, మర్మస్థానమున దుర్గంధం పెరుగుట, చురుకు ఇవి. గర్భిణిస్త్రీలు కూడ పుచ్చుకొనవచ్చును.

శ్వేతవహ్నిమూల చూర్ణము

| | |
|---|---|
| చిత్రమూలం | శొంఠి |
| పిప్పళ్ళు | వాము |



| | |
|---|---|
| గంటుభారంగి | యిందుప్పు |
| గజపిప్పళ్ళు | ఇంగువ |
| మిర్యాలు | వస |
| కోష్టం | ఆవాలుపొడి |

ఇవి సమం. వీనిని వేయించి చూర్ణించి వస్త్రగాలితముచేసి సమం చీనిచక్కెర చేర్చి చూపుడువేళ్లు పట్టునంత చూర్ణము వేడినీళ్లతో పుచ్చుకొనవలెను. గ్రహణిరోగములు, ఊరడవాతము, శ్వాసబంధన వాతము వీనిని పోగొట్టును.

సితోపలాది చూర్ణము

| | |
|---|---|
| పటిక బెల్లము | 4 పలములు |
| సీమతవాషీరి | 2 పలములు |
| పిప్పళ్ళు | 1 పలము |
| ఏలక్కాయలు | ½ పలము |
| దాచినచెక్క | ¼ పలము |

వీనిలో పిప్పళ్ళను వేయించి చూర్ణించవలెను. మిగిలినవానిని చూర్ణించి వస్త్రగాలితముచేసి సీసాలో భద్రపరచవలెను.

¼ తులమునుండి 1 తులమువరకు క్షయ, కాస, పిత్తరోగములను పోగొట్టును.

వాసాది చూర్ణము

| | | | |
|---|---|---|---|
| అడ్డసరపు సమూల చూర్ణము | 10 పలాలు | సైంధవలవణము | 1 పలం |
| అతిమధురం | 1 పలం | దుంపరాష్ట్రము | 1 పలం |
| మిర్యాలు | 1 పలం | చెంగల్వకోష్టు | 1 పలం |
| ధనియాలు | 1 పలం | కటుకరోహిణి | 1 పలం |
| సన్నరాష్ట్రిం | 1 పలం | నల్లజీలకర | 1 పలం |
| శొంఠి | 7 పలం | అతివస | 1 పలం |
| తాళిసపత్రి | 1 పలం | నాగకేసరములు | 1 పలం |
| లవంగాలు | 1 పలం | గంటుభారంగి | 1 పలం |

ఇవన్నియు చూర్ణించి వస్త్రగాలితముచేసి, చూర్ణమునకు నాల్గవ వంతు చక్కెర కలుపుకొని నేయితోగాని, తేనెతోగాని ఉసిరికాయ ప్రమాణము ఉండలుచేసి పుచ్చుకొనేది. తీయదగ్గులు శ్వాసకాసలు, మేహదగ్గులు మొదలైనవి మానును. చింతపండు పనికిరాదు. రెండుపూటలు ఒక మండలము పుచ్చుకొనేది. ఇచ్ఛా పథ్యము.

### పైత్యము, పైత్యకాశములకు

| | |
|---|---|
| ఏలకులు | ధనియాలు |
| చలవమిర్యాలు | అతిమధురం |
| ద్రాక్షపండ్లు | గసగసాలు |
| నెల్లివసుగు | లవంగపట్ట |
| జీలకర | కర్జూరపుకాయ |
| శొంఠి | తానిక్కాయ బెరడు |
| పిప్పళ్ళు | తేలచెక్క |
| మిర్యాలు | గంధపుచెక్క |

ఇవి సమం, వీనిని చూర్ణించి వస్త్రగాలితముచేసి సమంచక్కెర కలుపుకొని భద్రపరచవలెను. అర తులము చూర్ణము రెండు పూటలు పుచ్చుకొనేది. పైత్య సంబంధవ్యాధులు, పిత్తకాశములు కడుపులో మంట, డొక్కుళ్ళు, వాంతి ఇవి తీరును. ఇచ్ఛాపథ్యము.

కరక్కాయలు శొంఠి ఓమము యివి సమభాగములు చూర్ణముచేసి కలిపి మారి మజ్జిగ, వేనీళ్ళు కలితో కూడా కలిపి త్రాగించిన ఆమవాతము, వాపు, మందాగ్ని కాస, పీనసలు తగ్గును.

వెల్లుల్లి, శొంఠి వావిలి ఆకు యివి కషాయముకాచి త్రాగించిన నష్టైన ఆమవాత రోగములు నయమగును.

యిది ఉత్తమమైనది.

చూర్ణ ప్రకరణము సమాప్తము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు
# పులిప్పాణివైద్యము

## లేహ్య ప్రకరణము

ముఖ్యమైన సూచన :—

లేహ్యములు సేవించుటకు రుచికరముగ నుండును. నేయి, తేనె, చక్కెర ఇటువంటి మధురపదార్థములు చేర్చి తయారుచేయబడు ఔషధమగుటచే చప్పరించి తినదగినవేయగును. లేహ్యములలో చేర్చబడు చూర్ణములు వస్త్రగాలితము చేయబడినవై యుండవలెను. లేహ్యములను తయారుచేయుటకు ఔషధ చూర్ణము చక్కెర, తేక కలకండ, నేయి, తేనె, ఇతర వాసన ద్రవ్యములు ద్రవద్రవ్యములు అవశ్యకములు, పాకము చేయుట కుపయోగించు పాత్ర పరిశుభ్రముగ నుండవలెను.

మరియు వీనిని తయారుచేయుటకు వీగటవచ్చునట్లు తయారు చేయబడునట్టి పాకము ఆవశ్యకము, పటిక బెల్లము, చక్కెర, తేక బెల్లము ఇవి ఆయా యోగములందు చెప్పబడిన విధముగ వాడవలెను. బెల్లము, చక్కెర వీనిని పక్వము చేయుటకు ద్రవములు (అనగా కొన్ని వస్తువులయొక్క కషాయములు, స్వరసములు, పాలు, మంచినీళ్ళు ఆయా యోగములలో చెప్పబడినవి) కలిపి పొయ్యిమీదనుంచి కరగించి నెమ్మదిగ కాచుచు పక్వము తంతు పాకము యేర్పడు (అనగా పాకమును బొటన, మధ్యవ్రేళ్ళ మధ్యనుంచి యా వ్రేళ్ళను వేరుచేసిన తీగవలె వచ్చును) సమయమున చూర్ణములను వేసి కలిపి దించవలెను.

పాకమున ఔషధ చూర్ణములను కలిపిన తర్వాత నది గట్టిపడును, అట్టి యెడ్పుడు ఆయా యోగములందు చెప్పబడిన విధమున

తేనెనుగాని, నేయినిగాని కొంత ప్రకారము కలిపి ఔషధమున కలియునటుల దంచి యుంచుకొనవచ్చును.

వాజీకరణ లేహ్యములందు కిసుమిస్సు ద్రాక్ష, బాదంపప్పు వీనిని కలిపెదరు. ద్రాక్షను చేర్చవలసినప్పుడు పండ్లను శుభ్రము చేసి విత్తులను వేరుచేసియు, బాదంపప్పును చేర్చవలసినప్పుడు పప్పును నీటిలో నానవేసి పైతోలును తొలగించి కత్తితో సన్న ముక్కలుగ చేసి కలుపుకొనవలెను. కిసుమిస్సు పండ్లను శుభ్రము చేసి కలుపవలెను.

ఆయా యోగములందు చెప్పబడినటుల గంజాయి, అభిని కలుపవలసినప్పుడు గంజాయి ఆకును నేతితో కాచి, ఆ నేతిని కలుపుకొనవలెను. నల్లమందును కలుపవలసినచో నేతితో కలియునటుల నూరి దానిని కలుపవలెను. ఔషధములను తయారుచేయు వారు తమ చేతులను పరిశుభ్రముగ నుంచుకొనవలెను.

లేహ్యమును తయారుచేయుట కుపయోగింపబడునట్టి పాత్ర మూతి వెడల్పుగ నుండవలెను. తగినంత కళాయి ఉండవలెను. పాత్రలో ఆయా యోగమునందు చెప్పబడిన విధమున ముందుగ పాత్రలో ద్రవమును పోసి చక్కెర లేక బెల్లము వేసి. యది కరిగిన పిదప పొయ్యిమీదను బెట్టి చిన్న మంటతో కాచుచు కలియబెట్టుచుండవలెను. పాత్ర యోగములో చెప్పబడిన ద్రవ్యమునకు రెండు రెట్లుండుట గమనింపవలెను. పాత్ర పెద్దదిగ లేకున్న పొంగిపోవును. పాకమునకు వచ్చిన తర్వాత ఔషధములను కలుపుకొనవలెను. తయారుచేసిన లేహ్యమును, జాడీలలోగాని, సీసాలయందుగాని భద్రపరచవలెను.

## అశ్వగంధాది లేహ్యము

| | | | | |
|---|---|---|---|---|
| పెన్నేరుగడ్డ చూర్ణము | 16 | పలములు | నేయి | 1 వీశ |
| పాలగుమ్మాడు చూర్ణము | 16 | ,, | చక్కెర | 4 వీశ |
| సుగంధిపాల చూర్ణము | 16 | ,, | ద్రాక్ష | 18 పలాలు |
| జిలకర్ర చూర్ణము | 16 | ,, | ఏలకులు | 2½ పలాలు |
| ఫిరంగిచెక్క చూర్ణము | 16 | ,, | తేనె | 2 వీశెలు |



## తయారుచేయు విధము

మొదట మంచినీళ్ళలో పంచదారను పాకముబట్టి పిదప వస్త్రగాళితము చేసిన పై చూర్ణములను, విత్తనాలు వేరు చేయబడిన ద్రాక్షను, ఏలకుల చూర్ణమును ఒకటి తర్వాత నొకటిగ వేసి కలుపవలెను. నేతినికూడ పోసి కలిపిన పిదప పొయ్యినుండి దింపి చల్లారిన తర్వాత తేనె కలుపవలెను. పాకమును జాగ్రతగ చూచుకొనవలెను.

పూటకు కాలుతులమునుండి అరతులమువరకు రెండుపూటలు సేవింపవలెను. దీనియొక్క గుణము, శరీరమునకు బలమును కలిగించును శుక్రవృద్ధి, రక్తవృద్ధి, రక్తశుద్ధి, మూలవ్యాధిని, ఫిరంగి రోగమును పోగొట్టును.

## ఆమలక లేహ్యము

ఉసిరిక వళుగులు ఆవుపాలలో ఉడికించి యెండించినవి పది పలాలు.

| | | | |
|---|---|---|---|
| ధనియాలు | 1 తులం | తామరవిత్తుల పప్పు | 1 తు |
| రూమి మస్తకి | 1 తు | ఏలకులు | 1 తు |
| సాంబ్రాణి | 1 తు | నేలవెలగ వేరు | 1 తు |
| ముత్యపుచిప్ప | 1 తు | నేలవుసిరిక వేరు | 1 తు |

వీటన్నిటిని చూర్ణించి వస్త్రగాళితము చేసి చీని చక్కెర 16 పలాలు, పన్నీరు ఒకపడి పాత్రలోపోసి చక్కెరను వేసి పాకముబట్టి పక్వము కాగానే పై చూర్ణమును పోసి కలియబెట్టి నేయి 6 పలాలు కలిపి దించుకొనవలెను. పూటకు కుంకుడుకాయంత రెండుపూటలు సేవించవలెను

పిత్త సంబంధమైన సకల వ్యాధులు, వాత సంబంధమైన వ్యాధులు నివారణయగును. హృదయమునకు బలమునిచ్చును. దీపనము కలుగును.

## ఆర్ద్రఖండాన లేహ్యము

| | | | |
|---|---|---|---|
| అల్లము (పై చర్మమునుతీసి ముక్కలుగ తరగబడినది) | 64 తు | శొంఠి ఒకటింకాలు | తు, |
| పటికబెల్లం | 64 తు | జాజికాయ | ,, |

| | | | |
|---|---|---|---|
| మిర్యాలు | 3 తు | ఏలకులు | 1¼ తు |
| పిప్పళ్ళు | 2 తు | చిత్రమూలం | 1¼ తు |
| సొండి | 2 తు | శీమకాశీరి | 1¼ తు |

తయారుచేయు విధము

అల్లపు ముక్కలను 8 పలముల ఆవునేతిలో వేయించి మొర మొరలాడునప్పుడు దింపి చూర్ణము చేసికొని, ఇతర వస్తువులను చూర్ణించి వస్త్రగాలితముచేసి పటిక బెల్లమును పాకముబట్టి అందు మొదట అల్లపు చూర్ణమును వేసి కలియబెట్టుచు చూర్ణము కలిసి పోయిన పిదప తక్కిన చూర్ణములను కలియదింపుకొని తేనె నెయ్యి పోసి లేహ్యమును భద్రపరచవలెను. పూటకు ¼ తులమునుండి అర్ధ తులమువరకు రెండువేళల సేవించవలెను.

ఆమ్లపిత్తము, అరుచి, ఆకలిలేమి, పైత్యరోగములు, వాత రోగములు వీనిని హరించును.

కూశ్మాండ లేహ్యము

బూడిద గుమ్మడికాయను చెక్కులుతీసి తురిమి గింజలు తీసి వేసి నీరుపిండి నూరుతులములు, ఆవునేయి 64 తులములు బాణలిలో పోసి కాగనిచ్చి అందు గుమ్మడినీరు ఇంకునంతవరకు వేయించియుంచు కొనవలెను. గుమ్మడిని పిండిగా వచ్చిన నీటిని వడయబోసి, ఆ నీరు బాణలిలో మంచినీరు కలుపుకొని 100 తులముల చీని కలకండను చూర్ణముచేసి పాకముబట్టి లేహ్యపాకము వచ్చినపుడు అందులో క్రింది వస్తువుల చూర్ణమును వేయవలెను.

| | | | | |
|---|---|---|---|---|
| పిప్పలి చూర్ణము | 8 తులములు | యేలక్కాయల చూర్ణము | 2 తుల | |
| శొంఠి | ,, | ,, | ఆకుపత్రి | ,, ,, |
| జీలకర్ర | ,, | ,, | మిర్యాలు | ,, ,, |
| దాలిచెక్క | | ,, | ధనియాలు | ,, ,, |

ఈ చూర్ణములను వేసి గరటెతో కదుపుచు గుమ్మడి కాయనువేసి కలియబెట్టి దింపుకొనవలెను తేనె, నేయి వేసి కలిపి యుంచుకొనవలెను.



గుణము: అగ్నిదీప్తిని కలిగించును. ధాతుపుష్టి, రక్తపిత్తము లను పోగొట్టును. ఉష్ణమును శమింపజేయును శరీరము కృశించుచు వేడికలిగియున్న వారికి పూటకు అర్ధతులము సేవించవలెను. స్త్రీ లకు కలుగు రక్తప్రదరము తెలుపు వీనిని పోవడచును. వేసవి కాలమునందు సేవించుచువచ్చిన తాపమును పోగొట్టును. రుచిగ నుండునని యెక్కువగ తినగూడదు పథ్యము లేదు.

చింతామణి లేహ్యము

| | |
|---|---|
| గుంటగలగరాకు రసము | 2 సేర్లు |
| చెప్పులిట్టాకు రసము | ,, |
| సర్వగలగర రసము | ,, |
| బిల్వవేళ్ళ రసము | ,, |
| నీరుగొబ్బి ఆకు రసము | ,, |
| నేలయుసిరికె రసము | ,, |
| వల్లారాకు (సరస్వతాకు) రసము | ,, |

పై రసములను కళాయి పాత్రలోపోసి యుంచుకొనవలెను. నేరేడుపట్ట, కొబ్బరిపువ్వు, అత్తిచెక్క ఇవి రెండున్నర పలములు నలియగొట్టి రెండుసేర్ల నీళ్ళలోపోసి పావు సేరుగ కాచి, పై రస ములో కలుపుకొనేది. మిరియము, చిట్టామల్లి, మిరపగుంద్రవేళ్లు 2 పలాలు చొప్పున నలియగొట్టి 2 సేర్ల నీళ్ళలో ఉడకబెట్టి 8 పలాల తాటిబెల్లం వేసి 6 సేర్ల ఆవుపాలు యొత్తమురసములో కలిపి పొయ్యిమీదబెట్టి ఇరుగ కాచుకొని,

| | |
|---|---|
| జీలకర | జాపత్రి |
| జాజికాయ | యేలకులు |
| కరకంటు | చెంగల్వకోష్టు |
| లవంగాలు | నాగకేసరములు |
| అక్కలకర్ర | మిర్యాలు |
| వాము | తాళిసపత్రి |
| కురాసానివాము | అతిమధురం |
| త్రిఫలములు | శొంఠి |

ఇవి ఒక్కొక్కపలము గ్రహించి చూర్ణించి వస్త్రగాలితము చేసి పాకపదములో పోసి, ఆవునేయి 10 పలములుపోసి కలుపుతూ త్రిలోహ సింధూరము 2 పలములు, మండూర సింధూరము 1 పలం అందులో బాగుగ కలియునటుల చేసి దింపుకొనేది. గచ్చకాయ ప్రమాణం రెండు పూటలు సేవించేది.

### తీరునట్టి వ్యాధులు

పాండురోగము, మైకము, సంజ, వాంతులు, అన్నద్వేషము, గ్రహణి, అతికాశ, అతిసారము, శోథ, ఇట్టివన్నియు నయమైన రక్తవృద్ధికలిగి, దేహకాంతి పెరుగును. ఇచ్ఛాపథ్యము.

### బిల్వాది లేహ్యము

బిల్వవేరు 100 పలాలు, వెలగవేరు, చిట్టాముట్టివేరు, పేరాముట్టివేరు, పాదిరివేరు, నేలదిరిసినవేరు, సుగంధపాలవేరు, కలిశవేరు, నేలవెలగవేరు, మాగుదోసవేరు, చిత్రమూలవేరు ఇవి 8 పలముల చొప్పున గ్రహించి రోటిలోదంచి 16 పడుల నీళ్ళలోవేసి 8 వ భాగము మిగులునటుల కాచి మాదీఫలరసము ఒకపడి, అల్లపు రసము ఒకపడి చీనాచక్కెర 5 వీశలు, ఆవుపాలు రెండుపళ్ళుపోసి పాకము పట్టవలెను. పక్వమైనపుడు.

| | |
|---|---|
| శొంఠి | చంపక పుష్పం |
| ఏలకులు | మిర్యాలు |
| సహస్రభేది | అతిమధురం |
| పిప్పళ్ళు | తాళిసపత్రి |
| చంగల్వకోష్టు | కరక్కాయ |
| అక్కలకర్ర | శ్రీగంధపుపొడి |
| జిలకర | ఉసిరిక వరుగు |
| ధనియాలు | నల్లజిలకర |

లవంగాలు గంటుభారంగి వాయువిడంగాలు

ఇవి ఒకపలము గ్రహించి చూర్ణించి వస్త్రగాలితముచేసి, దానిని పాకమునవేసి కలిపి పక్వముగ దింపుకొనవలెను. పూటకు గచ్చకాయ ప్రమాణము రెండు పూటలు సేవించవలెను.



### తీరునట్టి వ్యాధులు

పిత్తమేహము, పాండువులు, అరోచకము, అన్నద్వేషము, అస్థిగతమేహములు, కడుపులో మంట ఇవి తీరును. రక్తవృద్ధి, నరములకు బలము, దేహమునకు కాంతి ఇట్టివి కలుగును

### మరొక విధము

మారేడువేర్లు ఒకవీశ గ్రహించి నలగగొట్టి 10 పడుల నీళ్ళతో పోసి కషాయముకాచి కాలు మిగులు నపుడు పాతబెల్లము 16 పలములువేసి పాకముపట్టి అందులో,

| | |
|---|---|
| శొంఠి | దాల్చినచెక్క |
| నల్లజిలకర | ఏలకులు |
| చిత్రమూలం | తాళిసపత్రి |
| చవ్యము | నాగకేసరాలు |
| మోడి | మిర్యాలు |
| ఆకుపత్రి | పిప్పళ్లు |

ఇవి ఒక్కొక్క తులము చొప్పున గ్రహించి చూర్ణించి వస్త్రగాలితముచేసి పై పాకమున పోసి కలియబెట్టుచు గట్టిపడు నపుడు దించుకొని చల్లారినపిదప వలసినంత తేనెకలిపి భద్రపరచి పూటకు అర తులము చొప్పున రెండు పూటలు సేవించవలెను. గ్రహణీరోగములు, పైత్యరోగములు పోగొట్టి, జీర్ణశక్తి, బలవృద్ధి, మాతనశక్తి వీనిని కలిగించును.

### పిప్పలాది లేహ్యము

పిప్పళ్లు కాలు వీశ నాలుగుపళ్ళ నీళ్ళలోపోసి అష్టభాగముగ కాచి యందులో ఒక సేరు కలకండపొడి వేసి పాకము పట్టవలెను. అందులో,

| | |
|---|---|
| శొంఠి | కోష్టం |
| జిలకర | చంపక పుష్పం |
| ధనియాలు | కరక్కాయ బెరడు |
| వాము | అక్కలకర్ర |
| | దుంపరాష్ట్రం |

ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క పలము గ్రహించి చూర్ణించి వస్త్రగాళితముచేసి పై పాకమునబోసి కలియబెట్టుచు 4 పలాలు, తేనె 8 పలాలు పోసి పక్వము అయినపుడు దింపి చల్లారిన పిదప భద్రపరచవలెను. నెల్లికాయప్రమాణము రెండుపూటలు పుచ్చుకొనవలెను. శ్లేష్మరోగములు, వాతరోగములు, దగ్గులు, గుల్మములు, ఉబ్బసము, జ్వరములు, శ్వాసకాసలు ఇవి తీరును. ఇచ్ఛాపథ్యము. మత్స్య పదార్థములు వర్జ్యములు.

ద్రాక్షా లేహ్యము

| | |
|---|---|
| ద్రాక్షపండు 1 వీశ | గసగసాలు |
| అతిమధురం | లవంగము |
| తుంగముస్తెలు | ధనియాలు |
| ఏలకులు | మిరియాలు |
| తాళిసపత్రి | శొంఠి |
| జాజికాయ | సన్నపిప్పళ్ళు |
| జాపత్రి | చలవమిర్యాలు |
| | చీని కలకండ |

ఇవి ఒక్కొక్కటి ఒక పలము గ్రహించి మొదట చీని కలకండను ఒకటిన్నర సేరు జలములోవేసి పొయ్యిమీదబెట్టి పాకము పట్టవలెను. విత్తులుతీసిన ద్రాక్షపండ్లను ముద్దగనూరి పాకములో వేసి కలియబెట్టి, మిగత వస్తువులను చూర్ణించి వస్త్రగాళితముచేసి పాకము పక్వమునకు వచ్చిన వెంటనే చూర్ణమునువేసి కలిపి నెయ్యి 5 పలాలు; తేనె 5 పలాలు పోసి దింపుకొని భద్రపరచి పూటకు పొన్నకాయ ప్రమాణము రెండుపూటలు సేవించవలెను. పైత్య సంబంధ వ్యాధులు, ఉష్ణసంబంధ రోగములు, వాతసంబంధ రోగములు హరించి, శరీరమునకు బలము తేజస్సు ఇవి కలుగును.

తానిక్కాయ లేహ్యము

తానిక్కాయ బెరడు ఒకవీశ 4 సేర్లలోబోసి ఊరనిచ్చి ఎనిమిదవ భాగము మిగులునటుల కాచి వడియబోసి యందులో 5 పలముల చీని చక్కెరవేసి పాకముబట్టి; దానిలో



| | | |
|---|---|---|
| జాజికాయ | అతిమధురం | తాళిసపత్రి |
| అతివస | జాపత్రి | లవంగం |
| గంజాయి | కరకపువ్వు | జిలకర |

ఒక్కొక్కటి ఒక తులము గ్రహించి చూర్ణించి వస్త్రగాళితముచేసి పై పాకమునబోసి లేహ్యపక్వముగ దింపుకొనేది. పూటకు అర తులము చొప్పున రెండు పూటలు సేవించిన ఉబ్బసము, రక్తవిరేచనము, అతిసారము, గ్రహిణి, శీతభేది ఇవి తీరును.

ఖర్జూర లేహ్యము

| | | | |
|---|---|---|---|
| ఖర్జూరపుకాయలు | 10 పలాలు | దేవదారుచెక్క | 1 పలం |
| చిత్రమూలంవేరు పట్ట | 1 పలం | శ్రీగంధపుచెక్క | 1 పలం |
| లవంగచెక్క | 1 పలం | జటామాంసి | 1 పలం |
| నల్లవుప్పివేరు | 1 పలం | ద్రాక్ష | 1 పలం |
| కోష్టు | 1 పలం | పిప్పళ్ళు | 1 పలం |
| మిర్యాలు | 1 పలం | శొంఠి | 1 పలం |

శొంఠి, మిర్యాలు, కోష్టు వీనిని వెచ్చచేసియు మిగిలిన వాటిని ఎండించి అన్నిటిని కలిపి చూర్ణించి వస్త్రగాళితముచేసి యుంచుకొనవలెను. 16 పలాల చీని చక్కెరను పాకముబట్టి ఖర్జూరపుకాయలను సన్నగతరిగి పాకమునవేసి చూర్ణమును కలిపి లేహ్యపక్వముగ దింపుకొని పూటకు ఒకతులము వంతున రెండు పూటలు సేవించవలెను. మేహశాంతి, ఉష్ణభేదులు, పైత్యోష్ణము తీరును శరీరమునకు కాంతి నిచ్చును. ఇచ్ఛాపథ్యము.

శొంఠి లేహ్యము

శొంఠి 38 పలాలు నలగగొట్టి 6 సేర్ల జలములో వేసి ఎనిమిదవ భాగము మిగులునటుల కాచి యందు పాత బెల్లము 8 వీశలు వేసి పాకము బట్టవలెను.

| | | | |
|---|---|---|---|
| వాము | 1 పలము | జాజికాయ | అర పలము |
| ఏలకులు | అర పలము | కరకంటు | ,, |
| అతిమధురం | 1 పలము | నీరుగొబ్బివిత్తులు | ,, |
| ఎండు కరివేపాకు | 3 పలములు | | |

వీనిని చూర్ణించి వస్త్రగాలితముచేసి పక్వమైన పాకముచేసి కలిపి 20 పలాలు నేయివేసి లేహ్యపక్వమున దింపుకొని పూటకు పొన్నకాయ ప్రమాణము రెండు పూటలు సేవించిన మూలం, అతి సారము, గ్రహణి, పులితేపులు సమస్త వాతరోగములు తీరును, జీర్ణశక్తిని కలిగించును, శరీరము తేలికయగును.

చందనాది లేహ్యము

| | | | |
|---|---|---|---|
| శ్రీగంధపుచెక్క | 15 పలాలు | తిప్పతీగ | 5 ప. |
| సుగంధపాలవేళ్ళు | 5 పలాలు | వట్టివేళ్ళు | 5 ప. |
| వెలగవేళ్లు | 5 పలాలు | | |

వీనిని నలగగొట్టి 6 పళ్ళు నీళ్ళుపోసి 16 భాగము మిగులు వరకు కాంచి వడబోసి యందులో గుంటగలగరాకు రసము, పొన్నగంటిఆకు రసము, నూగుదోసాకు రసము, కామాంచాకురసము, కలబంద రసము, బిల్వాకు రసము ఇవి పావుసేరు చొప్పున కలుపుకొని ఒకవీశ చీనిచక్కెరతో పాకము పట్టవలెను.

| | |
|---|---|
| అతిమధురం | కుంకుమపువ్వు |
| త్రికటుకం | వాము |
| లవంగపట్ట | పెన్నేరుగడ్డ |
| లవంగం | చలవమిర్యాలు |
| త్రిఫలాలు | కురాసాని వాము |
| చెంగల్వకోష్టు | నేలతాటిగడ్డ |
| జాజికాయ | భరంగిచెక్క |
| జాపత్రి | |

ఇవి ఒక్కొక్కటి ఒకపలము గ్రహించి చూర్ణించి వస్త్రగాలితముచేసి పాకమున కలిపి నెయ్యి రెండు సేర్లు తేనె ఒకసేరు కూడ కలిపి లేహ్యపక్వమున దింపుకొని కుంకుమపువ్వును పొడిచేసి కలుపుకొని ఒక తులము చొప్పున రెండు పూటలు సేవించవలెను. మేహ సంబంధమైన సకల రోగములు కాళ్ళుచేతులు మంటలు, అసన కండ్లమంటలు, పైత్య ఉష్ణము ఇవన్నియు తీరును. శరీరమును పుష్టిగ నుంచును, బలమును కలిగించును. దేహకాంతి నిచ్చును.



ధాతువృద్ధి లేహ్యము

| | | | |
|---|---|---|---|
| శొంఠి | 1 పలం | గంటుభారంగి | 1 పలం |
| ఏలకులు | ,, | తుంగగడ్డ | ,, |
| సోంపు | ,, | నేలతాటిగడ్డ | ,, |
| జీలకర | ,, | నాగకేశరాలు | ,, |
| జాపత్రి | ,, | పెన్నేరుగడ్డ | ,, |
| దేవదారు | ,, | చిల్లవిత్తులు | ,, |
| జాజికాయ | ,, | పిప్పళ్ళు | ,, |
| లవంగపత్రి | ,, | తామరగడ్డ | ,, |
| వట్టివేరు | ,, | అతిమధురం | ,, |
| తక్కోలం | ,, | అతివస | ,, |
| మంజిష్టి | ,, | చవ్యం | ,, |
| మిర్యాలు | ,, | సాలామిశ్రి | ,, |
| సూరత్తుకరక్కాయబెరడు | 1 ప | కోడిశపాలవిత్తులు | అర ప |
| లవంగపట్ట | 1 ప | చలవమిర్యాలు | అర ప |
| భూచక్రగడ్డ | 1 ప | కలువగడ్డ | అర ప |
| రూమి పకి | అర ప | గోలిమిడివిత్తులు | ఒకటిన్నర ప |
| కాశినివిత్తులు | అర ప | తామరవిత్తులపప్పు | ,, |
| అభిని | ఒకటిన్నర ప | మునగకామేశ్వరపూలు | ,, |
| సురాటి మొగ్గలు | అర ప | దురదగొండి విత్తులు | అర ప |
| ముల్లంగివిత్తులు | అర ప | పుల్లిగడ్డ | అర ప |
| కుంకుమపువ్వు | 2 వరహాలయెత్తు | పచ్చకర్పూరం | 2 వరహాలయెత్తు |
| గోరోజనము | 2 వరహాలయెత్తు | | |

వీనిలో కుంకుమపువ్వు, గోరోజనం, అభిని, పచ్చకర్పూరం, మునగకామేశ్వరపూలు తప్ప మిగిలిన వన్నిటిని చూర్ణించి వస్త్ర గాలితముచేసి యుంచుకొనవలెను.

చీనిచక్కెర 12 పలాలు    కాటికలకండ 12 పలాలు

ఈ రెంటిని 2 సేర్ల ఆవుపాలలో వేసి పాకము పట్టవలెను. 12 పలాల బాదంపప్పును నానవేసి పైతోలుతీసి, దానితో సార

పప్పు 4 పలాలు, ఆరూట్ పప్పు 4 పలాలు ఆవుపాలలో నూరి పై పాకములో కలుపవలెను. పాకము పక్వమైనపుడు చూర్ణమును పోసి కలుపుతూ కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, గోరోజనము పొడి చేసి వేసి, అన్నిటిని గరిటలో నేతిలో కరిగించివేసి, నేయి 16 పలాలు తేనె ఒక సేరు పోసి కలిపి భద్రపరచవలెను. గచ్చకాయప్రమాణము రెండుపూటలు పుచ్చుకొని ఆవుపాలు త్రాగవలెను. దీని సేవనవలన ధాతుపుష్టి, నరములకు పటుత్వము, శరీరకాంతి వృద్ధియగును.

ఏలాది లేహ్యము

| | | | |
|---|---|---|---|
| మిరియాలు | 1 తులం | పెన్నేరుగడ్డ | 1 తులం |
| జీలకర | 1 తులం | సీలవేరు | 1 తులం |
| గంటుభారంగి | 1 తులం | తాళీసపత్రి | 1 తులం |
| లవంగం | 1 తులం | అతివస | 1, తులం |
| మోడి | 1 తులం | పెద్దమానుచెక్క | 1 తులం |
| ఏలకులు | 1 తులం | చిత్రమూలం | 1 తులం |
| సన్నరాష్ట్రం | 1 తులం | తెల్లగడ్డలు | 1 తులం |
| అతిమధురం | 1 తులం | ఇంగువ | 1 తులం |
| సన్నపిప్పళ్ళు | 1 తులం | | |

ఈ వస్తువులను మేకపాలలో కాటుకవలె నూరి ఒకటింకాలు సేరు నేతిలో పోసి, దానితో తాటిబెల్లము 3 పలాలు, అల్లపు రసము 8 పలాలు పోసి పొయ్యిమీదబెట్టి లేహ్యపక్వముగ దింపుకొని పూటకు ఉసిరికాయంత రెండుపూటలు సేవించిన సూతక వాయువులు నివారణయగును. మొలకూర, మునగపిందె, మేక మాంసము, నేయి ఇవి హితములు.

దేవదారు లేహ్యము

| | | | |
|---|---|---|---|
| దేవదారు రసము | 1 సేరు | తేనె | 1 సేరు |
| ఉసిరిక రసము | 1 సేరు | పసుపుపూల రసము | 1 సేరు |
| మంచి నేయి | 1 సేరు | | |

చీనిచక్కెర ముక్కాలుపడి తగినంత నీటిలో పాకముబెట్టి పైరసములను చేర్చి లేహ్యపక్వముగ దింపుకొని ఒక తులము



చొప్పున 2 పూటలు సేవించిన మేహరోగములు, కుష్ఠురోగములు నయమగును.

సకల మేహములకు లేహ్యము

| | | | |
|---|---|---|---|
| శొంఠి | 15 పలాలు | ద్రాక్ష | 2 పలాలు |
| జాజికాయ | 2 పలాలు | అతిమధురం | 2 పలాలు |

వీనిని నలగగొట్టి నాలుగుపళ్ళ జలములో వేసి అష్టభాగము మిగులునటుల కషాయము కాచి యందులో చీనిచక్కెర పదిపలాలు చేర్చి ఉద్దిపప్పు, నీరుగొబ్బి ఆకురసము, గుంటగలగర రసము ఒక్కొక్కటి ముక్కాలుసేరు కషాయములో చేర్చి పాకము పట్టవలెను. పక్వసమయమున,

| | | | |
|---|---|---|---|
| త్రికటు | చందనచెక్క | పిప్పళ్ళు | |
| ఏలకులు | లవంగాలు | అశ్వగంధి | |
| ఖర్జూరపుకాయలు | నాగకేసరాలు | పిప్పివేళ్లు | |
| ఇప్పపూలు | జాపత్రి | లవంగపత్రి | వెలగవేళ్లు |

ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క పలము గ్రహించి ఖర్జూరపుకాయలు తప్ప మిగత వానిని చూర్ణించి వస్త్రగాలితముచేసి, ఖర్జూరపుకాయను సన్నగ తరిగి పై పాకమున వేసి కలియబెట్టి లేహ్యపాకమున దింపుకొని భద్రపరచి పూటకు గచ్చకాయప్రమాణము రెండుపూటలు సేవించిన సకల మేహములు నివారణయగును.

పరంగ్యాది లేహ్యము

ఆవుపాలలో శుద్ధిచేసిన పరంగిచెక్క 15 పలాలు

| | | | |
|---|---|---|---|
| చిత్రమూలంవేరుపట్ట | 4 ప. | సుగంధపాలవేళ్ళు | 4 ప. |
| పెన్నేరుగడ్డ | 4 ప. | నేలగొలిమిడి సమూలం | 4 ప. |

వీనిని చూర్ణించి వస్త్రగాలితము చేసికొనవలెను.

| | | | |
|---|---|---|---|
| శొంఠి | 1 ప. | అతిమధురం | 1 ప. |
| పిప్పళ్ళు | 1 ప. | చలవమిర్యాలు | 1 ప. |
| మిర్యాలు | 1 ప. | జాజికాయ | 1 ప. |
| ఉసిరికకాయ | 1 ప. | జాపత్రి | 1 ప. |

| | | | |
|---|---|---|---|
| తాడికాయలు | 1 ప | లవంగాలు | ప. |
| సన్నరాష్ట్రం | 1 ప | వాయువిళంగం | ప. |
| జాజిపత్రి | 1 ప | చెంగల్వకోష్టు | ప. |
| జటామాంసి | 1 ప | ఏలకులు | ప. |
| | | కురాసాని వాము | ప. |

వీనిని చూర్ణముచేసి వస్త్రగాలితము చేసికొని 15 పలాలు చీనిచక్కెర పాకముబట్టి యీ చూర్ణములను అందులో వేసి కలియ బెట్టుచు 15 పలాలు తేనె, 15 పలాలు నేయిపోసి లేహ్యపాకమున దింపుకొని పూటకు నెల్లికాయ ప్రమాణము రెండుపూటలు సేవించ వలెను. మేహవాతము, కాళ్ళుచేతులు పట్టుట, కవాయిరోగములు, గొంతు సంబంధములు తీరును. పథ్యము : కందిపప్పు, నంజాయి, కంద, ఆ త్తికాయ, మునగకాయ ఇట్టివి.

వాము లేహ్యము

వాము ½ వీశ పైపొట్టు తీసివేసి బాగా మర్దించి శుద్ధిచేసిన వాము చూర్ణించి వస్త్రగాలితముచేసి యుంచుకొని,

| | | | |
|---|---|---|---|
| లవంగము | 1 పలం | మిర్యాలు | 1 పలం |
| ఏలకులు | 1 పలం | పిప్పళ్ళు | 1 పలం |
| శొంఠి | 1 పలం | | |

ఈ అయిదు వస్తువులను వేయించి చూర్ణించి వస్త్రగాలితము చేసి పై చూర్ణముతో కలుపుకొని, కాటికలకండ 10 పలాలు తగు మాత్రము నీటితో పాకముబట్టి ఆ పాకమున చూర్ణమునుపోసి కలుపుచు తేనె 2 పలాలు, నేయి 3 పలాలువేసి లేహ్యపక్వముగ దింపుకొని పూటకు గచ్చకాయంత రెండు పూటలు సేవించవలెను, అజీర్ణములు, వాతము, మాంద్యము, అజీర్ణభేదులు వీనిని పోగొట్టి ఆకలిని కలిగించును. చిన్నలు పెద్దలు అందరు సేవింపవచ్చును.

చ్యవనప్రాశ్యావ లేహ్యము

| | | |
|---|---|---|
| అడ్డసరపువేళ్ళు | పిప్పళ్ళు | వృషభకము |
| మారేడువేళ్ళు | జీవంతి | ముయ్యాకుపొన్న |



| | | |
|---|---|---|
| తక్కాలివేళ్ళు | ద్రాక్ష | కోలపొన్న |
| దుందిలపువేళ్ళు | వాకుడు | అడవి పెసర |
| పెద్దముల్లువేళ్ళు | ములక | అడవి మినుము |
| కలిగొట్టువేళ్ళు | కర్కాటకశృంగి | ఋద్ధి |
| చిట్టాముట్టివేళ్ళు | నేల ఉసిరిక | తిప్పతీగ |
| పల్లేరుకాయలు | తుంగముస్తెలు | కరక్కాయ |
| అగరు | పాలగుమ్మడు | తెల్ల చందనము |
| పుష్కరమూలం | కామరగింజలు | ఏలక్కాయలు |
| మేదా | కచ్చూరాలు | |
| తెల్లగలిజేరు | జీవకము | |

ఈ వస్తువులను ఒక్కొక్క పలము చొప్పున గ్రహించి దంచి 9 పళ్ళ జలముపోసి, ఉసిరిక కాయలు 500లు తెచ్చి గుడ్డలో మూట గట్టి కషాయములో వేసి మధ్యాగ్నితో క్వధింతు కషాయము దింగులు వటులగా కాచి ఉసిరిక కాయలు బాగుగ ఉడికి చూచి, ఆ కషాయ మును వడబోసి యుంచుకొని, ఉసిరిక కాయలను గింజలు తీసివేసి ముతక గుడ్డలో వేసి మర్దించిన, మెదల పెంత్రతి పదార్థము దిగును. దానిని నువ్వులనూనె 12 పలములు, నేయి 12 పలములు వీనితో జలము పోవునంతవరకు వేయించవలెను, తర్వాత దానిని వేరుగా ఉంచుకొనవలెను. 50 పలముల పటిక బెల్లమును పాకముబట్టి పాకము వచ్చునపుడు మొదట ఉసిరిక పదార్థమును వేసి కలుపుచుండవలెను, కలిసిన పిదప దింపుకొని సాంగశీతలమైన పిదప తేనె 8 పలాలు వంశలోచనము 16 తు, పిప్పళ్ళు 8 తు, దాల్చినచెక్క 4 తు, ఆకు పత్రి 4 తు నాగకేసరాలు 4 తు చూర్ణములను వస్త్రగాలితముచేసి యుందున వేసి బాగుగా కలుపుకొనవలెను. కాలంతులమునుంచి అర్థ తులము వరకు రెండు పూటలు సేవింపవలెను. ఇది క్షయదగ్గులను, ఉబ్బసమును, చిక్కిపోవుటను నివారించి శరీరమునకు బలమును ధాతువృద్ధిని, శరీరకాంతిని కలిగించును.

లేహ్యప్రకరణము సమాప్తము

శ్రీరస్తు

## వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

## రసాయన ప్రకరణము

### గంధక రసాయనము

| | | | |
|---|---|---|---|
| శుద్ధిగంధకము | 1 భాగము | నాగకేసరాలు | 1 భాగము |
| పిప్పళ్ళు | 1 భాగము | లవంగములు | 1 భాగము |
| పిప్పలీమూలం | 1 భాగము | త్రికటుకములు | 3 భాగములు |
| వాయువిడంగం | 1 భాగము | త్రిఫలములు | 3 భాగములు |

వీటన్నిటిని చూర్ణించి వస్త్రగాలితముచేసి యందు 1 భాగము బెల్లము 1 భాగము గోఘృతము కలిపి ఖల్వమున నూరి యుంచుకొని పూటకు కాలుతులమునుండి అర్ధతులమువరకు రెండుపూటలు సేవించిన సర్వరోగములు మేహవ్రణములుమానును రక్తము పరిశుభ్రమగును, శరీరమునకు కాంతి నిచ్చును.

### పిప్పలి రసాయనము

| | | | |
|---|---|---|---|
| పిప్పళ్ళు | 16 పలాలు | చిత్రమూలం | 2 పలాలు |
| చీనా పంచదార | 8 ,, | లోహభస్మం | 2 ,, |
| మంచి తేనె | 8 ,, | భృంగరాజం | 2 ,, |
| వాయువిడంగాలు | 4 ,, | ఏలకులు | 2 ,, |
| శొంఠి | 4 ,, | లవంగాలు | 2 ,, |
| గంటుభారంగి | 4 ,, | దాల్చినచెక్క | 2 ,, |
| జిలకర్ర | 4 ,, | ఉసిరిక | 2 ,, |
| మిర్యాలు | 4 ,, | తాండ్ర | 2 ,, |
| చవ్యం | 8 ,, | కరక్కాయ | 2 ,, |
| సోడి | 2 ,, | జాజిఫలము | 2 ,, |



వీనిలో పిప్పళ్ళు, శొంఠి, మిర్యాలు బాణలిలో దోరవేయించి చూర్ణించి వస్త్రగాలితము చేసియు, జాజిఫలమును ఎండించి చూర్ణించియు పంచదార, భస్మము తప్ప ఇతర వస్తువులను దంచి చూర్ణించి వస్త్రగాలితముచేసియు, మొదట భస్మమును ఖల్వములో వేసి తేనె కలుపుతు నూరి తర్వాత పంచదారకలిపి నూరి పిదప మిగిలిన వస్తువులను వేసి తేనెతో నూరవలెను. పంచగ నగువరకు నూరవలెను, దానిని నేతిముంతలో పెట్టి ధాన్యపురము 15 రోజుల వరకు నుంచవలెను. తర్వాత తీసి సీసాలో భద్రపరచవలెను

పూటకు పరకతులమునుండి కాలుతులమువరకు రెండు పూటలు సేవించవలెను. అందువలన అగ్నిమాంద్యము, గ్రహణి, అజీర్ణము, అమ్లపైత్యము వాతపిత్తక్షయలు, మేహక్షయలు, పాండుక్షయలు నివారణయగును.

### మరొక విధము

| | | | |
|---|---|---|---|
| పిప్పళ్ళు | 5 పలాలు | ధనియాలు | 1 పలం |
| అడ్డసరపువేళ్లు | 2 ,, | సన్నరాష్ట్రం | 1 ,, |
| నాగుదోసవేళ్లు | 1 ,, | లవంగపట్ట | 1 ,, |
| దుష్టపువేళ్లు | 2 ,, | ఏలకులు | 1 ,, |
| చిత్రమూలం | 1 ,, | జాజిపత్రి | 1 ,, |
| శొంఠి | 1 ,, | జాజికాయ | 1 ,, |
| మిర్యాలు | 1 ,, | లవంగం | 1 ,, |
| తాళిసపత్రి | 1 ,, | అతిమధురం | 1 ,, |
| చెంగల్వకోష్టు | 1 ,, | జిలకర | 1 ,, |

ఈ వస్తువులలో వేయించవలసినవి వేయించియు, మిగిలినవి దంచబెట్టియు చూర్ణించి వస్త్రగాలితముచేసి యుంచుకొని, ఆవుపాలు 3 శేర్లు కళాయిపాత్రలోపోసి అందు 10 పలాలు చీనిచక్కెర చేర్చి పాకముపట్టి పాకము వచ్చినపుడు చూర్ణమును కలిపి గట్టిపడక తేలికగ నుండునపుడు నేయి 1 శేరు, తేనె రెండు శేర్లు కలిపి దించుకొనేది. గట్టిపడకుండ తేలికగ నుండినచో రసాయనమగును, పక్వము ముదిరిన గట్టిపడిపోవును.

పూటకు నెల్లికాయ ప్రమాణము రెండుపూటలు సేవించ వలెను. పైన చెప్పబడిన వ్యాధులు తీరుటయేగాక శరీరమునకు కాంతి బలమును కలిగించును.

పథ్యము — లేతవంకాయ, మునగకాయ, అత్తికాయ, కంది పప్పు, కొయ్యతోటకూర, పొన్నగంటికూర, మేకమాంసము, కుందేలుమాంసము, ఉర్రపిట్టలు, కౌజు, అరటిపువ్వు, పెద్దచిక్కుడు, ఆవుపాలు, బీరకాయ, పొట్లకాయలు, చింతపండు పనికిరాదు, మత్తుపదార్థములు పనికిరావు

మధుస్నుహీ రసాయనము

| | | |
|---|---|---|
| కరక్కాయ | ఏలకులు | ధనియాలు |
| తానికాయ | ఆకుపత్రి | జిలకర్ర |
| ఉసిరికకాయ | చెంగల్వకోష్టు | నల్లజిలకర |
| శొంఠి | చిత్రమూలం | కోరాడి |
| పిప్పళ్ళు | తెల్ల తెగడ | మాల్కంగినివిత్తులు |
| మిర్యాలు | నాగకేసరాలు | అడవి జిలకర |

| | | | |
|---|---|---|---|
| దాల్చినచెక్క | లవంగాలు | పెన్నేరుగడ్డ | జాపత్రి |
| గంటుభారంగి | జాజికాయ | వాయువిడంగాలు | చవ్యము |

ఒక్కొక్కటి ఒక్కొక్క తులము చూర్ణము.

| | | | |
|---|---|---|---|
| పంచదార | 12 పలములు | శుద్ధ గంధకం | 4 పలములు |
| నేయి | 12 పలములు | శుద్ధ గుగ్గిలము | 4 పలములు |
| తేనె | 18 పలములు | పిరంగిచెక్క చూర్ణము | 4 ప. |

ముందుగ పంచదారను పాకముబట్టి తేనెపాకమువచ్చినపుడు ఫిరంగిచెక్క చూర్ణముపోసి బాగుగా కలుపుకొని నెయ్యివేయవలెను కొంచెము ఉడికిన పిదప చూర్ణములను వేసి బాగుగా కలిపిన పిదప దింపి చల్లారినపిదప గంధకచూర్ణము గుగ్గిలము తేనె ఇవి కలిపి యుంచుకొనవలెను. పచ్చకర్పూరము కుంకుమపువ్వు కూడ కలుప వచ్చును. పూటకు అర్ధతులము చొప్పున రెండు పూటలు సేవించ వలెను.

గుణము : సకలవాతములు హరించును, చర్మవ్యాధులు, భగందరము, తిమ్మిర్లు, సవామేహము, వ్రణములు, గండమాల, కీళ్ళ



వాపులు నివారణయగును. శరీరకాంతి, బలము, శుక్రవృద్ధి, రక్త శుద్ధి ఇట్టివి కలుగును.

ప్రభాకర రసాయనము

ఇంగువ 1 వరహాయెత్తు    శొంఠి 1 వరహాయెత్తు

| | | | |
|---|---|---|---|
| శు॥ పాదరసం | ,, | మిర్యాలు | ,, |
| వాము | ,, | పిప్పళ్ళు | ,, |
| శు॥ గంధకం | ,, | ఆవాలు | ,, |
| శు॥ వెలిగారం | ,, | నల్లజిలకర | ,, |
| శు॥ మనోశిల | ,, | సైంధవలవణం | ,, |
| తాళకం | ,, | కరక్కాయ | ,, |
| నాభి | ,, | ఇంగ్లీకము | ,, |

శు॥ నేపాళవిత్తులు 16 వరహాలయెత్తు,

వేయించి చూర్ణించవలసిన వానిని, దొండించి చూర్ణించవలసిన వానిని చూర్ణించి వస్త్రగాళితము చేసి యుంచుకొనవలెను, నేపాళవిత్తులను ఖల్వమున వేసి నూరుచు ఇతర చూర్ణములను వేసి జాములు 8 నూరవలెను గొమ్ము డబ్బిలో జాగ్రతపరచవలెను, గురిగింజ ప్రమాణము శొంఠి కషాయము అనుపానముగ సేవించిన జ్వరములు మానును. కరక్కాయల కషాయమున సేవించిన దగ్గులుతీరును. నేతితో సేవించిన రక్తమూలము హరించును. ఆవు పాలతో సేవించిన మూలము నివారణయగును.

కడుపున గడ్డలు, మహోదరములు, సన్నిపాతజ్వరములు, చేపవలె కడుపునకలుగునట్టి బిళ్లలు, ఉబ్బసములు వీనికి అనుపానము అల్లపుస్వరసము, మత్తుగనున్నపుడు నిమ్మపండ్లరసము అనుపానము,

విషమెక్కిన వారికి అవగింజ ప్రమాణము మందును వేప నూనె అనుపానముతో కండ్లను కలికము వేయవలెను. కండ్లు వాచిన కలబంద గుజ్జుతో కాపడము యీయవలెను. దుర్మాంసం పెరిగిన వ్రణములకు, తొడలో కలుగునట్టి వ్రణములకు పడిశ గడ్డలు, యీ యౌషధమును ఉమ్మినీటిలో గుడ్డకు పట్టించి వత్తిచేసి పుండ్లలో యురికించిన వ్రణములు మానును.

### పరంగిచెక్క రసాయనము

| | | | |
|---|---|---|---|
| పరంగిచెక్క | 6 పలాలు | శొంఠి | కాలుపలం. |
| నల్లవుప్పివేరుపట్ట | 8 పలాలు | మిర్యాలు | ,, |
| పిప్పళ్ళు | కాలుపలం | వాము | ,, |
| తెల్లవుప్పివేరుపట్ట | కాలుపలం | నల్లజీలకర | ,, |

వాయువిడంగాలు ¼ పలం

ఇవి యన్నిటిని చూర్ణించి వస్త్రగాలితముచేసి 6 పలాల చక్కెరను వలసినంత నీటిలో పాకముబట్టి పక్వమైనపుడు చూర్ణములనువేసి కలియబెట్టుచు 10 పలాల తేన, 6 పలాల నేయి కలిపి గట్టిపడిన పక్వమున దింపి చల్లార్చి భద్రపరచవలెను.

పూటకు పొన్నకాయ ప్రమాణము రెండుపూటలు సేవించిన ఉష్ణవాతము, పోట్లు తీరును.

### చిత్రమూల రసాయనము

| | | | |
|---|---|---|---|
| చిత్రమూలపువేరు | 10 పలాలు | పొన్నవేరు | 10 ప. |
| దొండవేరు | 10 ,, | కరివేపాకు ఈనెలు | 10 ప. |
| తెల్లగలిజేరు వేరు | 10 ,, | మునగవేరుపట్ట | 10 ప. |
| కానుగవేరు | 10 ,, | అటికమామిడి వేరు | 10 ప. |
| రసమూలములు | 10 ,, | కలకమందు | 10 ప. |

24 శేర్ల నీళ్ళలో పై వస్తువులను నలగగొట్టి వేసి 16 వ భాగము కషాయము కాచి, యందులో 40 పలాలు తాటిబెల్లము వేసి పాకముబట్టి తేన అర్థశేరు కలిపి యందులో—

| | | | |
|---|---|---|---|
| త్రికటుకము | 2 పలాలు | ఇందుప్పు | 2 ప. |
| జీలకర | 2 ,, | వాము | 2 ప. |
| ఇంగువ | 2 ,, | పొట్టుతీసిన తెల్లగడ్డలు | 2 ప. |

ఇవి పొడిచేసి పై పాకములో కలిపి కలియబెట్టి పక్వమున దింపుకొని పూటకు ¼ తులము చొప్పున పుచ్చుకొనేది.

గుండెనొప్పులు, శోభలు, పాండు, అగ్ని మాంద్యము, ప్లీహ, వాంతులు, ఇవి తీరును.



### సహదేవి రసాయనము

| | | | |
|---|---|---|---|
| గోరిమిడిఆకు రసము | 1 వీశ | పిప్పళ్ళు | అర ప. |
| సన్నపల్లేరాకు రసము | 1 వీశ | అతిమధురం | అర ప. |
| కామంచిఆకు రసము | 1 వీశ | అశ్వగంధివేరు | అర ప. |
| ఆవుపాలు | 1 శేరు | కాశీవిత్తులు | అర ప. |
| చీనాచక్కెర | 4 పలాలు | తామరవిత్తుల పప్పు | అర ప. |
| నేయి | 4 పలాలు | యాలకులు | అర ప. |
| శ్రీగంధపుచెక్క పొడి | అర పలం | అమృతసంజీవి తీగె | అర ప. |
| మునగ విత్తులు | అర పలం | దోసవిత్తనాలు | అర ప. |
| తుంగముస్తెలు | అర పలం | | |

వీనిలో చూర్ణించవలసిన వానిని చూర్ణించి వస్త్రగాలితము చేసి యుంచుకొని, రసములన్నిటిని కళాయిపాత్రలో పోసి చక్కెర కలిపి పాకముబట్టి పక్వమైనపుడు నేయికలిపి దించుకొని భద్రపరచవలెను.

కాలు తులము మంతెన రెండుపూటలు సేవించవలెను. మూత్రకృచ్ఛ్రము, ఉష్ణభేదులు, అస్థిగత ఉష్ణము, రక్తకుసుమ జాడ్యములు, పురాణ జ్వరములు ఇవి తీరును.

కందిపప్పు, పెసలపప్పు, మినపప్పు, ఆవుపాలు, ఆవునేయి, ఆవుపెరుగు, గోధుమపిండి పదార్థములు, అరటిపూవు, మేకమాంసం, ఇవి హితకరములు, చింతపండు వర్జించేది.

### మేహాంతక రసాయనము

| | | | |
|---|---|---|---|
| శుద్ధిచేసిన పరంగిచెక్క | 15 పలాలు | భూచక్రగడ్డ | 5 ప. |
| నల్లసుగంధిపాల | 5 పలాలు | కన్నెకుమారిగడ్డ | 5 ప. |
| పెన్నేరుగడ్డ | 5 పలాలు | | |

వీటన్నిటిని చూర్ణించి వస్త్రగాలితముచేసి యుంచుకొని

| | | | |
|---|---|---|---|
| అతిమధురం | 1 పలం | గజపిప్పళ్లు | 1 పలం |
| అక్కలకర్ర | 1 పలం | త్రిఫలాలు (ఒక్కొకటి) | 1 పలం |
| సన్నరాష్ట్రి | 1 పలం | వట్టివేళ్ళు | 1 పలం |
| తక్కోలం | 1 పలం | ఎర్ర ఉల్లిగడ్డలు | 1 పలం |

| | | | |
|---|---|---|---|
| లవంగపట్ట | 1 పలం | జాపత్రి | 1 పలం |
| ఏలకులు | ,, | తాళిసపత్రి | ,, |
| లవంగం | ,, | గంటుభారంగి | ,, |
| నాగకేసరాలు | ,, | జాజికాయ | ,, |
| తామరగడ్డ | ,, | జటామాంసి | ,, |
| త్రికటుకం (ఒక్కొక్కటి) | ,, | శ్రీగంధపుచెక్క | ,, |
| వెలగవేళ్లు | ,, | చవ్యం | ,, |

వీనిని కూడ చూర్ణించి వస్త్రగాలితము చేసికొని పై చూర్ణముతో కలుపుకొనవలెను.

| | | |
|---|---|---|
| ద్రాక్ష | 5 పలాలు | బాదంపప్పు |
| గసగసాలు | 5 పలాలు | సారపప్పు |

వీనిని ఆవుపాలతో నూరి కల్కము చేసికొని,

| | | | |
|---|---|---|---|
| గోరోజనం | 2 వరహాలయెత్తు | అయస్సింధూరము | 2 వ. యె. |
| కుంకుమ పువ్వు | 2 ,, | అపరంజిబంగారు రేకులు | ,, |
| పచ్చకర్పూరం | 2 ,, | వెండిరేకులు | ,, |
| | | కాంతసింధూరము | |

ఒక కళాయి పాత్రలో రెండుపళ్ళు ఆవుపాలుపోసి, అందులో ఒకపడి పన్నీరు కలిపి ఒకవీశ చీనాకలకండ పాకముచేసి వేసి పాకము బట్టి పక్వమైనపుడు చూర్ణములను వేసి కలుపుతూ, ద్రాక్ష, ఖర్జూరపుకాయ, గసగసాలు, కుంకుమపువ్వు వీనిని నూరుకొని యందుతో కలిపి రసాయనపక్వమున, నేయి అరవీశ, తేనె ముక్కాలు వీశ కలుపుకొని భద్రపరచవలెను.

అర్థ తులమునుండి ఒక తులమువరకు రెండుపూటలు సేవించిన సకల మేహరోగములు, మేహజ్వరములు, అస్థిగత జ్వరములు, శిరోష్ణము గ్రహణి, విరేచనములు, మూత్రవణములు, గుల్మములు, బల్లలు, మాంసగత జ్వరములు, కష్టములు, మేహాతిసారములు, సకలము తీరును, మరియు దేహదార్ఢ్యమును, శరీర కాంతిని, పటుత్వమును కలిగించును.

రసాయన ప్రకరణము సమాప్తము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

## గుటిక ప్రకరణము

ముఖ్యగమనింపు:—గుటికలనగా మాత్రలగును. మాత్రలు చేయుటకు పొందిన మూలికలను చూర్ణముచేసిగాని, పచ్చిమూలికలను చేర్చవలసినచ్చినయెడల పద్ధతి ప్రకారము మెత్తగా నూరిగాని శుద్ధిచేయబడి లోహములు, రసములుగాని, దాని భస్మములుగాని కలిపి ఆ యా రోగములందు చెప్పబడిన విధమున ఆచరించుట ముఖ్యము.

భావన, మర్దనలు బాగుగ జరిగినచో గుటికలు చేయుటకు వీలు పడును. తయారుచేయబడిన ఔషధము మైనమువలెనైన పనికి సులభమగును. ఆ యా రోగములందు చెప్పబడిన ప్రమాణము మించకుండ తయారుచేసి నీడను ఎండించవలెను. బాగుగ ఎండక పోయినచో మాత్రలు బూజుపట్టును. కనుక ఎండించు విషయమున తగు జాగ్రత తీసికొనవలెను. ఆ యా రోగములందు చెప్పబడిన విధమున యొందించుట సమాప్తి పవలెను. వస్తువులను చూర్ణించి వస్త్రగాలితము చేయవలెను. వేయించవలసిన వస్తువులను వేయించుట ముఖ్యము.

అమృత సంజీవి గుటిక

| | | | |
|---|---|---|---|
| శుద్ధి చేసిన ఇంగిలీకం | 1 పలం | శుద్ధి చేసిన నాభి | 1 పలం |
| శుద్ధి చేసిన వీరం | ,, | శుద్ధ రససింధూరం | ,, |

వీనిని ఖల్వమున బెట్టి అల్లపురసముతో ఒకదినము మర్దించవలెను. తర్వాతను వావిలాకు రసముతో ఒకదినము, నల్లతులసి ఆకు రసముతో ఒకదినము మర్దించవలెను.

తేనెతో ఒకజాము మర్దనచేసి సీసాలో భద్రపరచవలెను. రోగి శరీరతత్వము ననుసరించి రోగతీవ్రతను బట్టి మిరపగింజలంత ఔషధమును తాటిబెల్లములోగాని, ద్రాక్షపండును, వలిచి లోపల నుంచిగాని యీయవలెను.

సన్నిపాతజ్వరములకు జామునకొకటి వంతున నాల్గు జాములు యిచ్చినచో సన్నిపాతము మానును. జ్వరాతిసారము, జ్వరశూలలు, మహోదరములు, ద్వంద్వజ్వరదోషములు, వాతపిత్తశ్లేష్మములు మూలమున కలిగిన జ్వరదోషములు నశించును

ఈ యౌషధమును తాటిబెల్లములో పొదిగి 10 పూటలు సేవించినచో కరిమేహము, మేహపుండ్లు, మేహగ్రంధులు, కీళ్ళ జాడ్యములు, పక్కశూలలు పటాపంచలగును

పథ్యము: మునగకాయ, చిక్కుడుకాయ, పొట్లకాయ, పొన్నగంటికూర, అత్తికాయ, కందిపప్పు, లేత అరటికాయ, బెండకాయ, గోధుమరవ, మేకపుప్పాంచును, వేయించిన వైమా కూర ఇట్టివి హితకరములు

అష్టాక్షరీ గుటిక

| | | | |
|---|---|---|---|
| నల్లమందు | 1 తులం | జాజికాయ | 1 తులం |
| శ్రీగంధం | 1 తులం | అతివస | 1 తులం |
| రక్తచందనం | 1 తులం | ఇంగువ | 1 తులం |
| పిప్పళ్ళు | 1 తులం | హింగుళము | 1 తులం |
| ఇంగిలీకము | 1 తులం | | |

పిప్పళ్ళను వేయించి చూర్ణించియు, ఇంగువను నేతిలో పొంగించి చూర్ణించియు, నల్లమందును నేతితో బాగా కలిపియు, ఇతర వస్తువులను చూర్ణించి విల్లెడిపట్టి యుంచుకొని, ముందట ఇంగిలీకమును నిమ్మపండ్లరసముతో మర్దించుచు మైనమువలెనైన పిదప నల్లమందును వేసి మర్దించి, ఇంగువ, తర్వాత జాజికాయ చూర్ణము క్రమముగ నొకటి తర్వాత నొకటిగ వేసి మర్దించి అన్నియు బాగుగ కలిసినపిదప శొంఠి కషాయమున నొకరోజును, దుదగొండివేర్ల కషాయమున నొక దినమును జీలకర్ర కషాయమున నొకదినమును తుంగముస్తల



కషాయమున నొకరోజును, ధనియాల కషాయమున నొకరోజును, వాము కషాయమున నొకరోజును, నిమ్మరసమున నొకరోజును క్రమముగ మర్దించవలెను. 8-వ రోజున మైనమువలె పక్వమునకు వచ్చును. పక్వమునకు రానియెడల మరొకసారి మర్దించవలెను. గురిగింజలంత మాత్రలు కట్టి గుటికలు చేయవలెను.

ఆమవాతరోగులకు పంచకోల కషాయముతోను, అతిసార విరేచనమునకు పెరుగు లేక తేనె వీనితోను, కడుపుబ్బరమునకు వాము, దాచినచెక్క, జీలకర్ర, శొంఠి వీని కల్కముతోను యీయవలెను.

అర్ధనారీశ్వర గుటిక

| | | | |
|---|---|---|---|
| పాదరసం | 1 పలం | నాభి | 1 పలం |
| వెలిగారం | 1 పలం | నెల్లికాయగంధకం | 1 పలం |

వీనిని ఖల్వములో వేసి వావిలాకురసములో 2 జాములు మర్దన చేసి మూసలోబెట్టి వసుకీలమట్టిచేసి ఒక భాండమున 4 శేర్లు ఉప్పు పోసి మధ్యన శీలమన్ను చేసిన మూసనుబెట్టి పైన ఉప్పుపోసి ఆభాండమునకు శీలమన్ను చేసి పొయ్యిమీదబెట్టి కమలాగ్నితో 4 జాములు వండవలెను చల్లారిన పిదప ఔషధమును తీసుకొని వావిలాకు రసముతో 4 జాములు మర్దన చేయవలెను. తర్వాత పొట్టికాకర ఆకు రసముతో 4 జాములు మర్దించి గురివింద ప్రమాణము మాత్రలు కట్టి పూటకు ఒకమాత్ర చొప్పున వావిలాకు రసముతో సేవించిన సర్వ జ్వరములు నివారణయగును.

బిల్వాది గుటిక

| | |
|---|---|
| మారేడువేర్లు | తులసిదళలు |
| కరక్కాయ | గానుగ విత్తులు |
| మిరియాలు | ఉసిరికపప్పు |
| పసుపు | మానిపసుపు |
| తానికాయ | శొంఠి |
| దేవదారు | గ్రంథితగరము |
| పిప్పళ్లు | |

# అర్ధనారీశ్వర గుటిక

| | | | |
|---|---|---|---|
| పాదరసం | 1 పలం | నాభి | 1 పలం |
| వెలిగారం | 1 పలం | నెల్లికాయగంధక | 1 పలం |

వీనిని ఖల్వములో వేసి వావిలాకురసములో 2 జాములు మర్దన చేసి మూసలో బెట్టి ఏడుశీలమట్టిచేసి ఒక భాండమున 4 శేర్లు ఉప్పు పోసి మధ్యన శిలమన్ను చేసిన మూసను బెట్టి పైన ఉప్పుపోసి ఆ భాండమునకు శీలమన్ను చేసి పొయ్యిమీదబెట్టి కమలాగ్నితో 4 జాములు వండవలెను చల్లారిన పిదప ఔషధమును తీసుకొని వావిలాకు రసముతో 4 జాములు మర్దన చేయవలెను. తర్వాత పొట్టికాకర ఆకు రసముతో 4 జాములు మర్దించి గురివింద ప్రమాణము మాత్రలు కట్టి పూటకు ఒకమాత్ర చొప్పున వావిలాకు రసముతో సేవించిన సర్వ జ్వరములు నివారణయగును.

అర్ధనారీశ్వర గుటిక.

(1) మాత్ర, వావిలి రసంతో మింగి ముక్కు
లో వావిలి రసం (నస్యం) వేయాలి. ఒక పక్క
జ్వరం తగ్గును. సాయంత్రం మాడు పైనే
2వ రోజు 1 మాత్ర ఇచ్చి 2వ ముక్కులో
నస్యం వేయాలి. మేకపాలు, సగ్గు
బియ్యంతో వాడాలి. 2వ పక్క జ్వరం
తగ్గును. ఇది అర్ధనారీశ్వరమని
పొగడదగిన మందు.

ఇవి ఒక్కొక్కటి తులమువంతున గ్రహించి చూర్ణించి మేక మూత్రముతో 8 దినములు మర్దించి గురిగింజలంత మాత్రలుకట్టి భద్రపరచవలెను. ఒక మాత్రనుండి 8 మాత్రలవరకు వాడ వచ్చును. సకల విషములను పోగొట్టి సుఖము నిచ్చును.

సర్ప విషము, లూత, తేలు, పిచ్చికుక్క, నక్క, ఎలుక, పందికొక్కు, విషములను నివారించును. విషముయొక్క బలమును బట్టి ఎక్కువసార్లు వాడవచ్చును. అంజనము, పానము, నస్యములు గను వాడవచ్చును.

ఏలాది గుటిక

| | | | |
|---|---|---|---|
| ఏలకులు | ¼ పలము | మామిడిపప్పు | ¼ పలం |
| జాజికాయ | ,, | అతివస | ,, |
| మిర్యాలు | ,, | వెలగబంక | ,, |
| శొంఠి | ,, | చింతవిత్తుల పెరడు | ,, |
| జీలకర | ,, | అభిని | ¼ వ. ఎ. |
| లవంగపట్ట | ,, | ధనియా | 1 వ. ఎ. |

వీనిని గ్రహించి జగడంబాకు రసముతో మర్దించి చిల్లివిత్తుల ప్రమాణము మాత్రలుచేసి ఎండించి భద్రపరచి జ్వరముతో కల్గు విరేచనములకు తేనెతో నియ్యవలెను. నేతితోగాని, ధనియాల కషాయములోగాని యిచ్చిన రక్తభేదులు కట్టును. ఆవుపాలతో యిచ్చిన గ్రహణీభేదులు కట్టును. శీతభేదికి ఆవు పెరుగులో నీయవలెను.

సంజీవి గుటిక

| | | | |
|---|---|---|---|
| శు॥ నాభి | 2 వరహాయెత్తు | పలుకుసాంబ్రాణి | 2 వ. ఎ. |
| తాళకం | ,, | గోరోజనం | ,, |
| పాదరసం | ,, | జాజికాయ | ,, |
| గంధకం | ,, | మిర్యాలు | ,, |



| | | | |
|---|---|---|---|
| వెలిగారం | 2 వరహాయెత్తు | పిప్పళ్లు | 2 వ. ఎ. |
| నెరిగిసం | ,, | శొంఠి | ,, |

శు॥ నేపాలవిత్తులు 8 వరహాయెత్తు

నేపాల విత్తులను ఖల్వములోవేసి కర్పూరవల్లి ఆకు రసముతో నాలుగు జాములు, అరటిమానిండిఆకు రసముతో నాలుగుజాములు, అడ్డసరపు ఆకు రసముతో నాలుగు జాములు, బొక్కెనాకు రసముతో నాలుగు జాములు, నల్లతులసి రసముతో నాలుగుజాములు, స్వర్ణ గలగర ఆకు రసముతో నాలుగు జాములు క్రమముగ నూరి పెసర గింజంత మాత్రలుకట్టి ఎండించి భద్రపరచవలెను. బిడ్డలకు కలుగునట్టి మాంద్యము, అల్లి మాంద్యమునకు తులసి ఆకు వావిలి రసం తీసి ఆ రసము అనుపానముతో ఒకమాత్ర యియ్యవలెను, మరియు బిడ్డలకు కలుగునట్టి జ్వరము, ఉబ్బసము, వాయువులు మున్నగునవి నివారణము యగును.

పథ్యము

కొయ్యతోటకూర, కందిపప్పు, వంకాయ, మునగకాయ, మునగకూర ఇట్టివి హితకరములు.

కాలరాక్షస గుటిక

శు॥ పాదరసము గంధకము అభ్రకభస్మము
కాంతము తామ్రభస్మము

వీటి సమభాగము గ్రహించి ఖల్వమున నుంచి తెల్లగలిజేరు రసములో నాలుగు జాములు, తిప్పతీగ కషాయముతో నాలుగు జాములు, చిత్రమూల కషాయముతో రెండు జాములు, త్రిఫలా కషాయములో 2 జాములు క్రమముగ మర్దించి ముద్దగచేసి తెల్లగలిజేరు ఆకు నూరి ముద్దకు కవచమిచ్చి స్వల్పముగ పుటంపెట్టి, ఖల్వమునుంచి చిత్రమూల కషాయముతో నాలుగు జాములు మర్దించి మాత్రలు కట్టి అనుపాన విశేషములతో వాడిన సన్నిపాత జ్వరములు, కాలజ్వరములు, దోషములు మొదలైనవి నివారించును.

### ధన్వంతరి గుటిక

| | | | |
|---|---|---|---|
| శొంఠి | 1 తులం | రుద్రాక్ష | 1 తులం |
| కరక్కాయ | 1 తులం | దేవదారు | 1 తులం |
| మంచి జిలకర | 1 తులం | పచ్చకర్పూరము | 1 తులం |
| నేలవేము | 1 తులం | పునుగు | 1 తులం |
| వాకుడు సమూలం | 1 తులం | చలవమిర్యాలు | 1 తులం |

వీనిని ఒక్కొక్క తులము గ్రహించి, పునుగుతప్ప మిగిలిన వానిని ప్రత్యేక ప్రత్యేకముగ మెత్తగా నూరి దానితో పునుగును కొద్దికొద్దిగా వేసి కలియ నూరుచు మంచి జిలకర కషాయముతో మర్దించి పెసరగింజంత మాత్రలుచేసి భద్రపరచవలెను.

ఇది శ్వాసకాసలను పోగొట్టును. హృదయమునకు బలము నిచ్చును.

### చందనాది గుటిక

| | | | |
|---|---|---|---|
| తుమ్మజిగురు | 3 ఔన్సులు | రూమిమస్తకి | 1 ఔన్సు |
| అతిమధురం | ,, | చందనతైలం | ,, |
| చలవమిర్యాలు | ,, | అరటిగడ్డలక్షారం | ,, |
| | | కోపేబా | ,, |

ముందట తుమ్మజిగురును చూర్ణించి కొంచెము పన్నీటితో నూరి, చందనతైలము, కోపేబా తప్ప మిగతవస్తువులను చూర్ణించి వస్త్రగాళితముచేసిన వానిని జిగురుతో కలిపి నూరి, పిదప తైలమును, కోపేబాను కలిపి నూరి శెనగలంత మాత్రలుకట్టి భద్రపరచవలెను

ఇది మూత్రసంబంధవ్యాధులను, పూయమేహమును, మూత్రనాళమందు కలుగు మంట వ్రణములను నివారించును,

గుటిక ప్రకరణము సమాప్తము

---

శ్రీరస్తు

## వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

## మాత్ర ప్రకరణము

### కస్తూరి మాత్రలు

| | | |
|---|---|---|
| కస్తూరి | సర్జక్షారం | చందనము |
| అతిమధురం | నేలవేము | నీలాంజనం |
| వస | లవంగం | సన్నరాష్ట్రం |
| కరక్కాయ | జిలకర | తానికాయ |
| చలవమిర్యాలు | ఉసిరికాయ | శొంఠి |
| ఏలక్కాయలు | నల్లజిలకర | దాల్చినచెక్క |
| పిప్పళ్ళు | ఆకుపత్రి | వాము |
| గైరికము | కర్పూరము | తుంగముస్తెలు |
| జాజికాయ | గంటుభారంగి | అక్కలకర్ర |
| పునుగు | మిర్యాలు | కురువేరు |
| శతపుష్పి | అయభస్మం | యవక్షారం |
| మడ్డి వెలిగార భస్మం | శు॥ మణిశిల | |
| శు॥ హింగుళం | సౌవర్చలవణం | |

వీనిని సమభాగము గ్రహించి ప్రత్యేక ప్రత్యేకముగ చూర్ణించి గుంటగలగరాకు రసముతో మర్దన చేయవలెను.

మొదట మణిశిల ఇంగిలీకము, నీలాంజనము, అయభస్మ సౌవర్చలవణము వీనిని ఖల్వమునబెట్టి గుంటగలగరాకు రసముతో ఒకదినము మర్దించవలెను. తర్వాత కస్తూరితప్ప మిగిలిన చూర్ణమునువేసి మర్దించుచు పక్వమునకు వచ్చిన పిదప కస్తూరి కలిపి మర్దించి చిన్న మాత్రలుచేసి నీడ నెండించి భద్రపరచవలెను.

సన్నిపాత జ్వరములు, విషమ జ్వరములు, చలులు, దగ్గు, పిల్లలకు గొంతులో కలుగు గురగుర కఫమువలన కలుగునట్టి రోగములు

పీనసిని పోపడచును. హృదయమునకు బలము నిచ్చును. జీర్ణశక్తిని కలిగించును.

కఫవాతాధిక్యముచే కలుగునట్టి జ్వరములకు కరింగ రాష్ట్రిము, మిర్యాలు, జిలకర వీని కషాయముల అనుపానముతో వ్యాధి బలమును బట్టి దినమునకు 2 నుండి నాలుగుసార్లు యీయ వచ్చును.

పిల్లల జ్వరములు, దగ్గులు, గొంతులో కలుగు గురగురలకు, నల్ల తమలపాకు రసముతో నీయవలెను.

మరొక విధము

| | | | |
|---|---|---|---|
| కస్తూరి | 2 వ. మె. | చలువమిర్యాలు | 1 వ. మె. |
| కుంకుమపువ్వు | 1 వ. మె. | ఏలకాయలు | 1 వ. మె. |
| గోరోజనము | 1 వ. మె. | జాజికాయ | 1 వ. మె. |
| శొంఠి | 1 వ. మె. | జాపత్రి | 1 వ. మె. |
| పచ్చకర్పూరము | 1 వ. మె. | మిర్యాలు | 1 వ. మె. |
| లవంగము | 1 వ. మె. | పిప్పళ్ళు | 1 వ. మె. |

కస్తూరితప్ప మిగిలిన వానిని మంచినీళ్ళుపోసి ఖల్వమున నూరవలెను. పక్వమైనపుడు కస్తూరి కలిపి నూరి పెసరగింజంత మాత్రలుచేసి నీడ నెండించి భద్రపరచవలెను.

దాహము, జలుబు, శిరోభారము ; వీనికి స్తన్యముతోను, తమలపాకులతోను యీయవచ్చును. తాంబూలముతో వాడిన నోటి దుర్వాసన, అజీర్ణము ఇట్టివి తీరును.

గోరోజన మాత్రలు

| | | |
|---|---|---|
| గోరోజనము | దుప్పికొమ్ము | నేలవేము |
| మల్లెవేళ్ళు | ఉసిరిక | రుద్రాక్షలు |
| ఎకులొద్ది | చందనము | మిర్యాలు |
| దింటెనవేళ్ళు | పిప్పళ్ళు | వస |
| శొంఠి | ఉత్తరేణివేరు | వెల్లుల్లి |
| పత్తిగింజలు | తొమ్మిపూలు | కానిరాయి |
| నల్లజిలకర్ర | పచ్చకర్పూరము | కరక్కాయ |
| పిలివేళ్ళు | జాజికాయ | తానికాయ |



| | | |
|---|---|---|
| మాచికాయ | గంటెనవేరు | భద్రముస్తలు |
| అంబరు | తుంగముస్తెలు | వట్టివేళ్ళు |
| మేకకొమ్ము | పునుగు | లేడికొమ్ము |
| నాగభస్మం | నల్లలేడికొమ్ము | స్వర్ణభస్మం |
| నీలాంజనం | ప్రవాళభస్మం | టంకణభస్మం |
| ఏనుగుదంతము | | |

ఈ వస్తువులు సమము, వస్తువులను అల్లపురసముతో నూరి పక్వదశలో భస్మములను ఒకటొకటి వేసి మర్దించి పెసరగింజంత మాత్రలు చేసి నీడ నెండించి భద్రపరచవలెను.

ఇది త్రిదోష జ్వరమును, కఫవాతాది రోగములను, న్యూమోనియా జ్వరమును హరించును. రక్తవేగమును మితపరచును.

పిల్లలకు గొంతులో గురగుర కలిగినపుడు, జ్వరము దగ్గు వీనియందు తులసియాకు స్వరసముతో గాని, తమలపాకు స్వరసముతో గాని యీయవలెను. సన్నిపాత జ్వరమునందు, దశమూల కషాయముతో నీయవలెను.

మరొక విధము

| | | | |
|---|---|---|---|
| గోరోజనము | ¼ పలం | కర్పూరం | ఒకటికి ఎనిమిది పలం |
| జాపత్రి | ఒకటికి ఎనిమిది పలం | పిప్పళ్లు | ,, |
| నల్లజిలకర్ర | ,, | లవంగం | ,, |
| జాజికాయ | ,, | కోష్టు | ,, |
| వాము | ,, | సుగంధిపాలవేళ్లు | ,, |
| అతిమధురం | ,, | మిర్యాలు | ,, |
| అక్కలకారం | ,, | | |

ఈ వస్తువులను కాచాకు రసముతో ఒకజాము నూరి పెసలు ప్రమాణము మాత్రలుచేసి యెండించి భద్రపరచవలెను. పైన చెప్పబడిన వ్యాధులు తీరును.

కుంకుమపువ్వు మాత్రలు

| | | | |
|---|---|---|---|
| కుంకుమపువ్వు | 1 పలం | గంధపుపొడి | అర పలం |
| శొంఠి | అర పలం | కరక్కాయ | అర పలం |

| | | | |
|---|---|---|---|
| పిప్పళ్ళు | అర పలం | తానికాయ | అర పలం |
| మిర్యాలు | అర పలం | ఉసిరికాయ | అర పలం |
| జాజికాయ | అర పలం | దేవదారు | అర పలం |
| లవంగము | అర పలం | కటుకరోహిణి | అర పలం |
| ఏలక్కాయ | అర పలం | గోరోజనం | అర పలం |

వీటన్నిటిని పండ్ల రసముతో 6 జాము, అల్లపు రసముతో 4 జాము, వాకుడుపండ్ల రసముతో 2 జాము నూరి పెసలంత మాత్రలు కట్టి నీడ నెండించి భద్రపరచవలెను, తేనె, స్తన్యము ఇవి అనుపానములు, శీతలము, దప్పి జ్వరము, ఇవి నివారణయగును

కోడాసుడి మాత్రలు

| | | | |
|---|---|---|---|
| శొంఠి | 1 తులం | కటుకరోహిణి | 1 తులం |
| మిర్యాలు | ,, | ఇందుప్పు | ,, |
| నెల్లికాయ | ,, | శు॥ వెలిగారము | ,, |
| నల్లజిలకర | ,, | శు॥ పత్రతాళకము | ,, |
| చిత్రమూలం | ,, | శు॥ నాభి | ,, |
| ఇంగిలీకం | ,, | హారతి కర్పూరము | ,, |
| నెల్లి గంధకం | ,, | శు॥ నేపాళపప్పు | ,, |
| మణిశిల | ,, | పాదరసము | ,, |
| పిప్పళ్ళు | ,, | చిట్టాముదం పప్పు | 5 తులం |
| కరక్కాయ | ,, | ఆముదపు పప్పు | 5 తులం |
| తానికాయ | ,, | | |

వీనిలో చూర్ణించవలసిన వాని చూర్ణించియు మిగత వస్తువులను ఖల్వమునందు వేటుకవలె మర్దించి క్రమముగ చూర్ణములను కలుపుచు నూరవలెను. నీలిఆకు రసముతో నాలుగు జాములు, గుంటగలగరాకు రసముతో ఆరు జాములు, నిమ్మపండ్ల రసముతో మూడు జాములు, నల్లతులసి ఆకు రసముతో ఒక జాము క్రమముగ మర్దించి మిరియము ప్రమాణము మాత్రలుచేసి యెండించి భద్రపరచవలెను.

గుల్మరోగులకు వాల్లిక అనుపానము, శోణిత వాతమునకు ఉచ్చులి ఆకురసము అనుపానము, రక్తభేదికి జాజికాయచూర్ణము అనుపానము



అత్యుష్ణమునకు చింతగింజరసం అనుపానము, శ్వాసకాసకు తగరాకు రసము అనుపానము, కడుపుబ్బరములకు ఆవునేయి అనుపానము, గ్రహణీభేదులకు ఆవునేయి అనుపానము, ప్రమేహముల నిర్గుండి రసము అనుపానము, మేహప్రమేహములకు ఆవుపాలు లేక మేక పాలు అనుపానము, ధాతువృద్ధికి దొండాకు రసము అనుపానము, కృశశరీరులకు తేనె అనుపానము, కంఠం రొమ్ము బొంగురుకు శొంఠి మిర్యాలు పిప్పళ్ళపొడి అనుపానము, ముఖవశీకరణకు పత్తిఆకు రసం తాంబూలము అనుపానము. శూల గుల్మరోగములకు మునగ రసముతో నెయిచేర్చి అనుపానము, మూలవాతములకు ముల్లంగిరసము అనుపానము, దీపనము కలుగుటకు వేపిళ్ళు అనుపానము, సన్నిపాతములకు ఉమ్మెత్తాకురసము అనుపానము, భోగమునకు సాంబ్రాణిఆకు రసము అనుపానము, వాతాధిక్యమున చక్కెర అనుపానము, అండవాతజ్వరములకు గచ్చాకురసము, అనుపానము, విరేచనములకు కట్టిగెడ్డలరసము అనుపానము, జ్వరమునకు శరీరనొప్పులకు గుంటగలగరాకు రసము అనుపానము, కలికము వేసిన శిరోభారము వదలును గ్రహణీభేదులకు బత్తె పెరుగు అనుపానము, వాతజ్వరములకు ధనియాలు లేక శొంఠి కషాయము అనుపానము శ్లేష్మజ్వరములకు త్రికటుకం అల్లపురసము అనుపానము పిత్తజ్వరమునకు శొంఠి కషాయము అనుపానము, నీరుడు రోగమునకు సుగంధిపాల కషాయము అనుపానము, చిత్తభ్రమకు పంచదార అనుపానము, దగ్గులకు త్రికటుక కషాయము అనుపానము, అతిదాహమునకు జిలకర అనుపానము, ఉష్ణమునకు చక్కెర జిలకర కషాయము అనుపానము, వాపులకు వస కషాయము అనుపానము, పురుగు విషములకు నిమ్మపండ్ల రసము అనుపానము, నువ్వులనూనెతో కలిపికలికం వేస్తే కండ్లపూలు మానును. మూలవ్యాధికి అనకములో అనపములో రాయవలెను.

మరియు త్రిఫలముల చూర్ణముతో కలిపి యీ మందును యిచ్చిన గొడ్రాండ్రు సంతానవంతులగుదురు.

ఈ అనుపాన విశేషములతో ఈ యౌషధమును సేవింపజేసిన ఆయా రోగములు తప్పక నయమగును. ప్రత్యక్ష నిదర్శనము.

## హింగుళాది మాత్రలు

(సకలవిధ జ్వరములకు)

| | | | |
|---|---|---|---|
| లోహభస్మం | 1 పలం | కరక్కాయ | 1 పలం |
| కర్పూర భస్మం | ,, | శంఖపాషాణము | ,, |
| శు॥ గంధకం | ,, | తాళకం | ,, |
| శు॥ పాదరసం | ,, | వసనాభి | ,, |
| కటుకరోహిణి | ,, | మిర్యాలు | ,, |
| వ్రేళిసారవిత్తులు | ,, | పిప్పళ్ళు | ,, |
| శు॥ నేపాళవిత్తులు | ,, | శొంఠి | ,, |
| వసుపు ఉమ్మెత్తవిత్తులు | ,, | తెల్ల గంటెనవేళ్ళు | ,, |
| | | తెల్ల తెగడవేళ్ళు | ,, |

ఈ వస్తువులను ఖల్వమునబెట్టి కమ్మేరాకు రసములో ఏడు దినములు మర్దించి మిరియమంత మాత్రలు చేసి నీడ నెండించి భద్రపరచవలెను. ఎట్టి జ్వరమైనను ఒకమాత్ర వేడినీరు అనుపానములో పుచ్చుకొనవలెను. విరేచనమైనపుడు వేడినీళ్ళు అన్నము పథ్యము. దినమునకు మూడుపూటలు సేవించవలెను.

## మహాహింగుళాది మాత్రలు (ప్రసిద్ధ యోగము)

| | | | |
|---|---|---|---|
| ఇంగ్లీకము | కాలు పలం | శు॥ నేపాళవిత్తులు | కాలు పలం |
| మిర్యాలు | ,, | తెల్ల తెగడవేళ్ళు | ,, |
| కరక్కాయ బెరడు | ,, | ముష్టి విత్తులు | ,, |
| వసనాభి | ,, | పాదరసం | ,, |
| సైంధవ లవణం | ,, | గంధకం | ,, |
| వెలిగారం | ,, | చిత్రమూలంవ్రేళ్ళు(పచ్చది) | ,, |
| పిప్పళ్లు | ,, | శొంఠి | ,, |

ఈనిని ఖల్వమునందుంచి బొంతజెముడు పాలతో మర్దించి మిర్యాల ప్రమాణము మాత్రలు కట్టి నీడ నెండించి భద్రపరచవలెను. ఎట్టి జ్వరమైనను పూటకు ఒకమాత్ర చొప్పున వేన్నీళ్ళ అనుపానముతో సేవించవలెను. శూలజ్వరములు, వాత జ్వరములు, సన్నిపాతజ్వరములు నివారణయగును.



## భూపతి మాత్రలు

| | | | |
|---|---|---|---|
| నాభి | 1 పలం | శొంఠి | 1 పలం |
| పాదరసం | ,, | పిప్పళ్ళు | ,, |
| నెల్లికాయగంధకం | ,, | మిర్యాలు | ,, |
| ఇంగువ | ,, | శు॥ నేపాళవిత్తులు | ,, |

వీనిని ఖల్వముగబెట్టి చిత్రమూల కషాయముతో ఏడుదినములు మర్దనచేసి మిర్యాలంత మాత్రలుకట్టి నీడ నెండించి భద్రపరచవలెను. అల్లపురసము అనుపానముతో ఒకమాత్ర చొప్పున మూడుపూటలు ఇచ్చిన సన్నిపాతజ్వరము మొదలు సామాన్య జ్వరములవరకు, నాలుకలో కలుగు ముండ్లు, గుల్మం, క్షయజ్వరము అన్నియు తీరును. రోగబలమెరిగి పథ్యం పెట్టవలెను.

## పున్నమణి మాత్రలు

(మేహవాతముల కపూర్వమైనది)

| | | | |
|---|---|---|---|
| కుంకుమపువ్వు | 5 వ. యె | మునగవేరు చెక్క | 2 వ. యె. |
| గోరోచనం | 4 ,, | కాంతసింధూరం | 2 ,, |
| పచ్చకర్పూరం | 3 ,, | వశరిద ఇంగిలీకం | 2 ,, |
| చలవమిర్యాలు | 2 ,, | రససింధూరం | 2 ,, |
| సుగంధపాలబెరడు | 2 ,, | కోపురసకర్పూరం | 2 ,, |
| తెల్ల తెగడవేరుపట్ట | 2 ,, | అక్కలకర్ర | 1 ,, |
| గాలిమిడివేరు | 2 ,, | మిర్యాలు | 1 ,, |
| చిత్రమూలవేరుపట్ట | 2 ,, | శొంఠి | 1 ,, |
| అతిమధురం | 2 ,, | సన్నపిప్పళ్లు | 1 ,, |
| నేలతాటిగడ్డ | 2 ,, | జంగల్పాకోష్టు | 1 ,, |

వీనిని ఖల్వమునందుంచి స్వర్ణగంగర రసములో 4 జాములు మర్దించి,

చిత్రమూల కాలు పలం, మిర్యాలు కాలు పలం, తెల్లకానిశ చెక్క కాలు పలం వలియగొట్టి కషాయము కాచి; ఆ కషాయముతో ఒక [illegible]ము నూరవలెను. తర్వాత కుంకుడుకాయప్రమాణం మాత్రలుచేసి నీడ నెండించి భద్రపరచవలెను.

మాత్ర ఒకటి పొడిచేసి పంచదార అనుపానముతో పుచ్చుకొనిన, మేహజ్వరములు, మేహధారములు మేహనొప్పులు, మేహపొడలు, ఇవి యివి యనక సమస్తమేహములు, మలబద్ధకము, ఇవన్నియును నివారణయగును.

### కర్పూర మాత్రలు
(తాంబూలముతో సేవించుట)

| | | | |
|---|---|---|---|
| జాజికాయ | వరహాయెత్తు | చలవమిర్యాలు | 1 వరహాయెత్తు |
| జాపత్రి | ,, | లవంగము | 8 ,, |
| తక్కోలము | ,, | కస్తూరి | అర వరహాయెత్తు |
| ఏలకులు | ,, | కుంకుమపువ్వు | అర వరహాయెత్తు |
| కోష్టు | ,, | పచ్చకర్పూరం | అర వరహాయెత్తు |
| చందనం | ,, | | |

వీనిని ఖల్వమునయందు కొబ్బరి నీళ్ళతో మర్దించి మిరియము ప్రమాణము మాత్రలు కట్టి యెండించి భద్రపరచవలెను. దీనిని ఒకమాత్ర చొప్పున తాంబూలముతో సేవించిన ముఖవశీకరత్వము శరీరకాంతి, నోటిదుర్వాసన పంటినొప్పి, అగ్నిమాంద్యము, అజీర్ణము శైత్యము ఇట్టివన్నియు తీరును, పథ్యము లేదు.

### అమృత సంజీవి మాత్రలు

| | | | |
|---|---|---|---|
| శు॥ లింగం | 1 వరహాయెత్తు | ఆముదపుపప్పు | 2 వరహాయెత్తు |
| శు॥ వెలిగారం | 1 వరహాయెత్తు | శు॥ నేపాళపుపప్పు | 4 వ. యె. |

వీనిని ఖల్వమునయందు పచ్చినీళ్ళతో నూరి గురువింద ప్రమాణము మాత్రకట్టి నీడ నెండించి భద్రపరచవలెను. చల్లని జలము అనుపానముతో ఒకమాత్ర యిచ్చిన సుఖభేదియగును. అధికముగ భేదియైన వేన్నీళ్ళు త్రాగిన కట్టును.

### కలరా నివారణ మాత్రలు

మిర్యాలు ఇంగువ నల్లమందు

ఇవి ఒక్కొక్కటి పాతికవీసములవంతు గ్రహించి మంచినీటితో ఖల్వమున బాగుగ నూరి 12 మాత్రలు కట్టి అర్థగంట కొకమాత్ర



చొప్పున నిచ్చిన భేది నిలచిపోవును. 7 వయస్సు మొదలు 24 వయస్సు గలవారలకు అర్ధమాత్ర చొప్పున నీయవలెను.

బిడ్డలకు కలుగునట్టి మాంద్యమునకు

| | | | | | |
|---|---|---|---|---|---|
| శొంఠి | 1 | వరహాయెత్తు | తాబేలుబెరడు | 1 | వ. యె. |
| పిప్పళ్ళు | 1 | ,, | కటుకరోహిణి | 1 | ,, |
| మిర్యాలు | 1 | ,, | వాయువిడంగ | 1 | ,, |
| వాము | 1 | ,, | ఇంగువ | 1 | ,, |
| సైంధవలవణం | 1 | ,, | శు॥ నేపాళవిత్తులు | 1 | ,, |

వీనిని కొత్తగానూరి గురిగింజప్రమాణము మాత్రలుకట్టి నీడ నెండించి భద్రపరచి అవిశాకును వాడ్చి పిండినరసము అనుపానముతో 1 లేక 1½ మాత్ర యిచ్చిన బిడ్డలకు కలుగునట్టి మాంద్యమంతయు తీరును.

### సింధూరవటి

రససింధూర 1 తు॥ టంకణం 1 తు॥ శు॥ గంధకం 1 తు॥ బూరుగబంక 1 తులం యీ వస్తువులు అల్లం, నిమ్మ నల్లవుమ్మెత్త ఆకులు వీటి రసములతో ఒక్కొక్కరోజు మర్దించి చిరికందిగింజ మోతాదులు పూటకొకటి చొప్పున వాడుచుండిన గంభీర చర్దులు, అరుచులు, ఓకరింతలు, అగ్నిమాంద్యములు, మొదలగు గర్భిణీ బాధలు నశించి సుఖప్రసవమునకు హేతువగును.

### స్తంభనాది గుటికలు

శు॥ ఇంగిలీకం 1 తు॥ గంధకం ½ తు॥ జాజికాయ, జాపత్రి అక్కలకర్ర, చందనంచూరు శొంఠి, పిప్పళ్ళు, లవంగాలు, యీ వస్తువులు ఒక్కొక్కటి 1 తు॥ నల్లమందు 9 తు॥ ఇవి అన్నియు గంజాయి ఆకు నీటితో బాగా మర్దించి 2 గురివింద గింజలంత మాత్రలు చేసి రాత్రి 1 మాత్ర వేసుకొని పాలు అన్నం భుజించిన వీర్యము స్తంభించును యీ మాత్రలు 5 దినములకు ఒకమాత్ర చొప్పునవాడేది మధురాహారములు తీసుకొనుట, శ్రీగంధ లేపనము, సుగంధ తాంబూలము మొదలగునవి వాడవలెను.

మాత్రల ప్రకరణము సంపూర్ణము

---

శ్రీ రస్తు

## వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

# ఘృతప్రకరణము

(ముఖ్యమైన సూచనలు)

ఔషధ ద్రవ్యముల గుణమును ఘృతమునకు కలిగించుట యీ ప్రకరణమున వివరింపబడినది. ఈ ఘృత ప్రక్రియలో ద్రవము కల్కము, ఘృతము ఇవి ముఖ్యములు.

### ద్రవము

ఆ యా యోగములందు వివరింపబడిన విధమున ద్రవముల యొక్క నిజరసమునుగాని, కషాయమునుగాని పాలు, గోమూత్రము మున్నగునవి ఘృత పరిమాణమునకు నాల్గు భాగములుండవలెను.

### కల్కము

ఆ యా యోగములందు చెప్పబడిన ద్రవ్యములను, పచ్చినివైన నీళ్ళు కలుపవలెను. ఎండువి అయినచో నీళ్ళుకలిపియు మెత్తగానూరి కలుపవలెను.

### ఘృతము

ఘృతమనగా గోఘృతము. కొన్ని ఔషధ యోగములందు మేకనెయి చెప్పబడియున్నది. ఔషధ యోగములందు యేది చెప్పియుండిన దానినే ఉపయోగించవలెను.



### పాకవిధానము

పాకమునకు ఉపయోగించు పాత్రలో ద్రవములను, కల్కమును ఘృతమును పోసి బాగుగ కలిపి మధ్యాగ్నితో పాకము బట్టవలెను. పాత్రలో సగము ఖాళీగానే యుండవలెను. అంతకు మించిన మంట యెక్కువయైనపుడు పొంగిపోవును. పొంగునపుడు కళాయి గరిటతో కలుపుచుండవలెను. పాకము అడుగు బట్టకుండునటుల జాగ్రత వహించవలెను.

### పాకపరీక్ష

ఘృతమును నిప్పుపై ఒకచుక్క వేసిన చిటపట శబ్దములేక భగ్గున మండవలెను.

కల్కమునుతీసి వేళ్ళతో నలిపిన అంటుకొనకుండ నుండవలెను. మరియు నిప్పుపై వేసిన భగ్గున మండవలెను.

పాకము పక్వమైనపుడు కల్కము అడుగునకు పోయి ఘృతము పైకి తేలును. అపుడు నన్నటి గుడ్డలో వడబోసి ఘృతమును గ్రహించవలెను.

### అశోకఘృతము

అశోకపట్ట కషాయము 16 పలములు
జీలకర్ర కషాయము 16 పలములు గుంటగలగర రసం 16 ప.
బియ్యపు కడుగు 16 పలములు మేకపాలు.

### కల్కద్రవ్యములు

| | | | |
|---|---|---|---|
| పాలవేళ్ళు | 2 తులం | అశోకపట్ట | 2 తులం |
| సారచెట్టుపట్ట | ,, | ద్రాక్ష | ,, |
| చిట్టీతపండ్లు | ,, | పిల్లిపీచరవేళ్ళు | ,, |
| మానిపసుపు | ,, | చిత్రివేళ్ళు | ,, |
| అతిమధురం | ,, | పటికబెల్లం | 32 తులం |

కల్కద్రవ్యములను పటికబెల్లము తప్ప బాగుగ నూరుకొనవలెను. అశోకపట్ట, జీలకర్ర 16 పలములు గ్రహించి దంచి 128 పలముల జలములో పోసి నాల్గవభాగము మిగులునటుల దింపుకొని వడియపోసి ఆ కషాయమున ఆవునేయి 16 పలములు, బియ్యపు కడుగు మేకపాలు, గుంటగలగరాకు రసము కల్కద్రవ్యములను పోసి బాగుగ కలిపి మధ్యాగ్నిచే వండవలెను. పటికబెల్లము పొడిచేసి కలుపవలెను. పక్వదశలో దింపుకొని ఘృతమును భద్రపరచవలెను.

ప్రయోగ విధానము

వంధ్యాదోషముగల స్త్రీలకు యీ ఘృతమును 20 చుక్కలు ఆవు పాలలోపోసి, సేవింపజేసి శతావరీ రసాయనము కాలు తులము భోజనానంతరమున పుచ్చుకొనజేసిన వంధ్యాదోషము నివర్తియగును.

మరియు స్త్రీలకు కలుగు సమస్త ప్రదరరోగములు నయమగును.

చందనాది ఘృతము

శ్రీగంధపుచెక్క 2 పలములు పంగగొట్టి 27 శేర్ల మంచినీళ్ళు పోసి అష్టభాగము మిగులునటుల కాచి వడబోసి యుంచుకొని :-

| | | | |
|---|---|---|---|
| చలవమిర్యాలు | కాలు పలము | లవంగపట్ట | కాలు పలము |
| శొంఠి | ,, | ఏలకులు | ,, |
| జాజికాయ | ,, | | |

వీనిని నూరి కషాయములో కలుపవలెను. మరియు

| | | | |
|---|---|---|---|
| పొన్నగంటియాకు రసం | కాలుపడి | బిల్వాకురసము | కాలుపడి |
| కాచాకు రసం | ,, | పైడితంగేడుపూలరసం | ,, |

వీనిని కూడ అందులో కలుపుకొని ఒకపడి ఆవునేయి చీనా కలకండ పది పలములు పొడిచేసి వేసి పాక్య క్రమేణ కాచి పాకమున దింపుకొని ఘృతమును గ్రహింపవలెను. పూటకు అర్థతులము చొప్పున 2 పూటలు ఆవుపాలలో పుచ్చుకొనిన మేహసంబంధ రోగములు, నాభివ్రణములు మానును. ఇచ్చాపథ్యము.



బ్రాహ్మీఘృతము

సరస్వతీ ఆకు (వల్లారి సమూలము బాగుగకడిగి దంచి తీసిన)

| | | | |
|---|---|---|---|
| నిజరసము | 64 పలములు | పిప్పళ్ళు | 1 తులం |
| ఆవునేయి | 16 ,, | వాయువిడంగము | ,, |
| మంచిపసుపు | 1 ,, | సైంధవలవణము | ,, |
| ఉసిరికపప్పు | 1 ,, | పటికబెల్లము | ,, |
| తెల్లతెగడ | 1 ,, | వస | ,, |
| సారతు కరక్కాయ | 1 ,, | | |

పటికబెల్లము, లవణము తప్ప యితర వస్తువులను నూరి కల్కము చేసికొని అన్నిటిని కలిపి మధ్యాగ్నిచే వండుచు బెల్లము, లవణము నూరి పోసి పక్వసమయమున దింపుకొని ఘృతమును గ్రహింపవలెను. ఒకతులమునుండి 2 తులములవరకు ఒక ఔన్సు ఆవు పాలలో వేసి 2 పూటలు సేవించిన జ్ఞాపకశక్తి కలుగును. కృశత్వము మానును. బుద్ధి వృద్ధియగును.

యోగరాజ ఘృతము

| | | | |
|---|---|---|---|
| ఆవునేయి | 4 పళ్ళు | సుగంధపాలవేరు | 2 పలాలు |
| ఆవుపాలు | 1 ప. | అతిమధురం | ,, |
| కొబ్బరినీళ్ళు | 4 ప. | ఏలకులు | ,, |
| ఖర్జూరపుపండ్లు | 5 పలాలు | చెంగల్వకోష్టు | ,, |
| ద్రాక్షపండ్లు | 8 ,, | జీలకర | ,, |
| దోసవిత్తులు | 3 ,, | లవంగాలు | ,, |
| నాగుదోసవేళ్ళు | 5 ,, | నేలతాటిగడ్డ | ,, |
| చిర్రికూర | 3 ,, | అమృతవల్లిగడ్డ | ,, |
| చంపకపుష్పం | 5 ప. తు. | పొన్నగంటి | ,, |

ఈ ద్రవ్యములను నూరి 8 పళ్ళ నీళ్ళలో పోసి అష్టభాగము కషాయము దింపుకొని వడియపోసి పాలు నేయి కలిపి ఘృతపాకమున దింపుకొని టీ స్పూన్ ప్రమాణముగ రెండుపూటలు సేవించిన మేహరోగము లన్నియు మాని, శరీరమునకు క్రొత్త తేజస్సు నిచ్చును.

### కల్యాణ ఘృతము

| | |
|---|---|
| వేరుపుచ్చ సమూలం | దేవదారు |
| మానిపసుపు | ఏలక్కాయ |
| నాగకేసరాలు | ప్రశ్నిపర్ణి |
| తానికాయ | చంగల్వకోష్టు |
| నల్లసుగంధిపాల | మంజిష్ఠ |
| వాకుడు | కూతుకుబుడమ |
| తాళీసపత్రి | శాలిపర్ణి |
| తెల్లసుగంధిపాల | నేపాళపువేళ్ళు |
| కరక్కాయ | రక్తచందనం |
| ఉసిరికెపప్పు | పద్మకము |
| ప్రేంఖణము | దానిమ్మ |
| మల్లెపూలు | గంధితగరం |
| వాయువిళంగం | మంచిపసుపు |
| నల్లకలవ | రేణుకలు |

ఒక్కొక్కటి ఒక్కొక్క తులము చొప్పున గ్రహించి చక్కగ నలగగొట్టి 40 సొన్నుల జలముపోసినూరి వడియబోసి కలుపవలెను. సారము పూర్తిగ వచ్చునటుల చూడవలెను. ఇందులో ఆవునేయి 16 పలములుపోసి మధ్యాగ్ని చేత వండవలెను. పాకమునకు వచ్చిన తోడనే దింపుకొని ఘృతమును భద్రపరచవలెను.

పూటకు 1 తులమునుండి 2 తులముల వరకు, జ్వరమును పోగొట్టును విషమును హరించును, అపస్మారము, మూర్ఛ వంధ్యా రోగము వీనిని పోగొట్టును, కాసములను ఖండించును, ఆకలిని కలిగించును, బలవర్ధకము

శరీరము కృశించుచు దగ్గుకలవారికి ఒక సొన్ను కాచిన మేక పాలలో 20 చుక్కలు ఘృతమునుబోసి పుచ్చుకొనిన కృశత్వము మాని పుష్టి నిచ్చును.



వయస్సువచ్చిన బాలికలు, శరీరపుష్టిని పొందక కృశించుచున్న వారలకు, వారి జీర్ణశక్తినిబట్టి పరక తులము మొదలు నాలుతులముల వరకు అశ్వగంధి ఘృతముతో యీ కల్యాణ ఘృతము పరక తులము చొప్పున కలిపి దాటి కలకండతో సేవించిన శరీరపుష్టి కలిగి పక్వమును బొందుదురు.

గర్భిణిస్త్రీలు బలహీనముగ నుండిన, ఉదయం పరక తులము ఘృతము పటిక బెల్లం కలిపి సేవించిన బలవంతులగుదురు. గర్భస్థ శిశువు బలమునుజెంది సుఖప్రసవ మేర్పడును. ప్రతిదాను మండలము (40 దినములు) సేవింపవలెను.

### కామగ ఘృతము

(మేహ కారకములకు, వ్రణములకు)

| | | | |
|---|---|---|---|
| కామగపాలు | కాలు పడి | సు। నేపాళవిత్తులు | 1 వ. ఎ. |
| కొబ్బరిపాలు | ,, | కోపు రసకర్పూరము | కాలు వ. ఎ |
| ఆవుపాలు | ,, | ఆవునేయి | కాలు పడి, |

నేపాళవిత్తులను, రసకర్పూరమును మెత్తగనూరి పై పాలలో కలిపి నేయిపోసి పొయ్యి కెక్కించి పాకపదమున దింపుకొని ఒక తులమునుండి రెండు తులములవరకు ఘృతమును సేవింపవలెను.

ఈ యౌషధ సేవనవలన మేహవ్రణములు, మేహకారకము, వాతములు, నోటిపూత, నాళివ్రణము, సెగ-చుఱుకు, తెలుపు, పసుపురోగములు కొరుకు బాధ్యము, మున్నగునవి తీరును.

పథ్యము :— చింతపండు మానవలెను. వేయించిన కంది పప్పు, వంకాయ పిందెలు, వేన్నీళ్ళ అన్నం మునగకాయ ఆవు పాలు, తియ్యతోటకూర ఇవి హితకరములు.

### సుకుమార ఘృతము

| | | | | | |
|---|---|---|---|---|---|
| తెల్లగలిజేరు | 400 | తులములు | పునుగాల | 40 | తులములు |
| మయ్యాకుపొన్న | 4 | ,, | పెన్నకుగడ్డలు | 40 | ,, |
| కోలపొన్న | 4 | ,, | ఆముదపువేళ్లు | 40 | ,, |

| | | | |
|---|---|---|---|
| వాకుడు | 4 తులములు | పిల్లిపీచర | 40 తులములు |
| ములక | ,, | కుశగడ్డి | ,, |
| పల్లేరు | ,, | దర్భ | ,, |
| మారేడు | ,, | రెల్లు | ,, |
| పెగ్గుమ్మడు | ,, | కాశగడ్డి | ,, |
| తక్కిలి | ,, | చెరుకువేరు | ,, |
| కలిగొట్టు | ,, | కిక్కసగడ్డి | ,, |
| దుందిలము | ,, | | |

ఈ ద్రవ్యములను దంచి 32 పడుల నీళ్లుపోసి ఒకటికి ఎనిమిదవ భాగముగ కషాయముకాచి దింపుకొని వడియబోసి అందులో చిట్టాముదము 16 పలములు, 32 పలముల ఆవునేయి, ఆవుపాలు 32 పలములు, పాతబెల్లము 8 పలములువేసి,

| | |
|---|---|
| పిప్పళ్ళు | శొంఠి |
| అతిమధురం | ద్రాక్ష |
| వాము | మోడి |

సైంధవలవణము వీనిని ఒక్కొక్కటి 2 తులములు గ్రహించి మెత్తగ నూరి కల్కముచేసి పైదానితో కలిపి పాకము బట్టి ఘృత పాకమున దింపుకొని ఘృతమును గ్రహించి భద్రపరచవలెను.

పూటకు అర్ధతులమునుండి రెండుతులములవరకు ఒక ఔన్సు కాచిన ఆవుపాలలో జఠరాగ్నినిబట్టి యీయవలెను.

ఇది గుల్మరోగములు, అర్శోరోగము, యోనిరోగము, మేహ రోగములు, శోఫ, మలబద్ధము వీనిని పోగొట్టును. మంచిబలమును ఆకలిని, కలిగించి దృఢత్వము నిచ్చును. ఇది టానిక్కువంటిది.

ఘృత ప్రకరణము సమాప్తము

———

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

## తైల ప్రకరణము

ముఖ్య సూచన :—సర్వసాధారణముగ తైలమనగా నువ్వుల నూనె యనియే యర్థము. కాని ఆముదము, కొబ్బరినూనె మున్నగు నూనె లన్నిటికిని తైలమనియే వాడుచున్నారు.

ఔషధ ద్రవ్యములచే కలిపి పక్వముచేసి ఆయాద్రవ్యగుణము లను తైలమున కబ్బునట్లు చేయుటయె యీ యోగవిధానము.

ఘృతమునకు వలెనె తైల పాకమునకును ద్రవము, తైలము, కల్కము ఇవి ముఖ్యములు.

### ద్రవము

ఆయా యోగములందు చెప్పబడిన ఔషధులయొక్క నిజ రసము లేక కషాయము, పాలు, ఉదకము, గోమూత్రము ఇవి తైల మునకు నాలుగు భాగము లెక్కువగ నుండవలెను.

### తైలములు

ఆయా యోగములందు చెప్పబడిన తైలమునే (తిలతైలము, ఆముదము, కొబ్బరినూనె) వాడవలెను.

### కల్కము

కల్కము తైలపు ప్రమాణమునకు నాల్గవవంతు నుండ వలెను. పచ్చిద్రవ్యమైన మూలికయందు మన్ను, గడ్డి ఇవేవియు లేకుండ శుభ్రపరచి రసము తీయవలెను.

### పాకపాత్ర

తైలము, కల్కము, ద్రవము ఇవన్నియు కలిసి పాత్రమునకు సగమువరకే యుండవలెను. పాత్రమూతి వెడల్పుగ నుండవలెను.

### అగ్ని

తైల పాకమునకు ఎక్కువగ మంటవేయకూడదు మొదట దీపాగ్నిగ నుండవలెను. తర్వాతను మధ్యాగ్నిగ నుండవచ్చును, గాఢాగ్ని పనికిరాదు. నెమ్మదిగ కాగుచుండిన ద్రవ్యగుణము తైలమున కబ్బును మంట అధికమైన తైలము పొంగిపోవును.

### పాకము

తైలపాకము తయారు చేయునపుడు తైలముతో కలిసిన నీరంతయు ఆవిరిగ వెడలిపోవును. తైలముతో కలిసిన జలము తగ్గిపోవు కొలదియు పాకస్థితిని పొందును. పాకము సిద్ధమైనపుడు తైల వాసన వచ్చును, క్రమముగ నీటికి కల్కము, తైలము మింగులును, అప్పుడు కల్కము గట్టిపడును. అట్టి సమయమున తైలమును గాని కల్కమునుగాని కొద్ది ప్రమాణము తీసి నిప్పుపై వేసిన చిటపట అనక భగ్గున మండును. అపుడు తైలమును దింపుకొనవలెను. ఇది మధ్యపాకమగును. కల్కము మాడకుండ గట్టిగ వేగువరకు నుంచిన ఖర పాకమగును. కల్కము మాడిన దగ్ధపాకమగును. తైలమును మధ్యపాకమునకే తయారు చేయవలెను. కఫహర తైలములను ఖర పాకమున దింపుకొనవలెను. మాడిన పాకము పనికిరాదు.

తైలము తయారైన ఒక వారము తర్వాత దానిని వాడవలెను.

### కళింగాది తైలము

(గుల్మరోగములకు)

| | | | |
|---|---|---|---|
| వేటిపుచ్చకాయల రసం | 8 శేర్లు | చలవమిర్యాలు | 1 పలం |
| గోమూత్రం | 8 శేర్లు | యవక్షారం | 1 పలం |
| మేకమూత్రం | 1½ శేర్లు | వనిటిపువ్వు | 1 పలం |



| | | | |
|---|---|---|---|
| వంటాముదము | 2 వీశెలు | ఏలకులు | 1 పలం |
| వాకుడువేరు | 1 పలం | కురాసానివామ | ,, |
| గజపిప్పళ్ళు | ,, | కరక్కాయ | ,, |
| కల్లుప్పు | ,, | త్రికటుకం | ,, |
| వెలిగారం | ,, | గాజుప్పు | ,, |
| వాయువిళంగాలు | ,, | సవాక్షారం | ,, |
| నేలదిరిశనపు వేళ్ళు | ,, | అప్లాకారం | ,, |
| ఉండుప్పు | ,, | ఒలిచిన తెల్లగడ్డలు | ,, |
| వాకిలాకు రసం | 1 శేరు | తెల్లగలిజేరువేరు | ,, |
| పచ్చివసపు రసం | 1 శేరు | అల్లపురసము | ,, |

కల్క ద్రవ్యముల మెత్తగ నూరుకొని రసముతో ఆముదము కల్కము కలిపి పొయ్యినెక్కించి చిన్న మంటతో పాకమగునటుల చూడవలెను. ఈ యౌషధమును పది దినములు సేవించిన మహో దరము మాంబల్లలు, వాతములు, ప్లీహ, శూలలు, గర్భవాత ములు అన్నియు నివారణయగును.

1 తులమునుండి 8 తులముల వరకు శరీర బలమునుబట్టి సేవింపవలెను.

### అపబార తైలము

| | | | |
|---|---|---|---|
| మునగచెక్క | 1 తులం | చెంగల్వకోష్టు | 1 తు. |
| శొంఠి | ,, | (ఇవి కల్కద్రవ్యములు) | |
| ఆవాలు | ,, | తెల్లగుగ్గిలము | 1 తు. |
| దేవదారుచెక్క | ,, | చింతాకు రసము | 16 తు. |
| వుల్లిపాయ | ,, | నువ్వులనూనె | 16 తు. |
| వస | ,, | పెరుగుమీద తేరిననీరు | 16 తు. |

కల్కద్రవ్యములను మెత్తగ నూరుకొనవలెను. గుగ్గిలమును మెత్తగ పొడి చేసుకొనవలెను. రసములు నూనె కల్కము కలిపి మధ్యాగ్నిచేత వండవలెను. పక్వమైనపుడు దింపుకొని వడియబోసి భద్రపరచవలెను.

వాతపు నొప్పులు, తిమ్మిర్లు, ఆమవాతము పోట్లు వీనిని పోగొట్టును. నొప్పిగలచోట తైలమును రాచి మర్దించి కాపువేయవలెను. వాత రక్తమునకును పైననే రాయవలెను.

### మేహాంతక తైలము

| | | | |
|---|---|---|---|
| గొండాకు రసం | ¼ శేరు | వేనుగుపల్లేరాకు రసం | ¼ శేరు |
| గుంటగలగరాకు రసం | ,, | తిప్పతీగ రసం | ,, |
| పల్లేరాకు రసం | ,, | రావిచెక్క రసం | ,, |
| చెప్పతట్టాకు రసం | ,, | చిట్టాముదం | ¼ వీశ |
| నువ్వులనూనె | ¼ వీశ | | |

పై రసములు నూనెలు కుండలోపోసి మధ్యాగ్నిచే వండవలెను.

### కల్క ద్రవ్యములు

| | | | |
|---|---|---|---|
| జాజికాయ | కరకంటు | కురాసానివాము | జాపత్రి |
| చంపకపుష్పం | మాచికాయ | నాగకేసరాలు | |

వీటిని ¼ పలము వంతున గ్రహించి ఆవుపాలతో నూరి కల్కముజేసి యందులో కలిపి పాకము వచ్చినపుడు చీనాకలకండ 2 పలములు పొడిచేసి వేసి ఔషధమును భద్రపరచవలెను. టీస్పూను మందును పూటకు పుచ్చుకొనవలెను.

మేహవ్రణములు, లింగపుట్ట, యోనిపుట్ట, శూలలు, రక్తకుసుమ రోగములు ప్రమేహము ఇవి నివారణయగును

### భృంగామలక తైలం

| | | | |
|---|---|---|---|
| గుంటగలగరాకు రసము | 16 పలములు | నువ్వులనూనె | 16 ప. |
| ఉసిరికెకాయ రసము | 16 పలములు | ఆవుపాలు | 64 ప. |
| అతిమధురకల్కం | 4 పలములు | | |

పై వస్తువులను కళాయిపాత్రలో పోసి మధ్యాగ్నిచేత వండి తైలము పక్వమైనపుడు దింపి వడబోసి దాచవలెను.

ఈ తైలమును అభ్యంగనమునకు వాడుచు వచ్చిన, నేత్రబంధరోగములు, వాతపిత్తరోగములు, శిరోరోగములు నివారణయగును,



నేత్రరోగములకు అరికాళ్ళకు పట్టవలెను. జ్ఞాపకశక్తికి అరికాళ్ళకు శిరస్సునకు మర్దన చేయవలెను. ప్రతిదినము తలకు రాచుకొనుచు దిన శిరోజములు నల్లనై పెరుగును. పార్శ్వ నొప్పికి నాలుగు చుక్కలు నస్యము చేయవలెను.

### గంధక తైలము

| | | | |
|---|---|---|---|
| గంధకం | 6 పలములు | పసుపు | 1 పలము. |
| మిర్యాలు | 3 పలములు | కొబ్బరినూనె | 8 పలము. |

గంధకమును మెత్తగనూరి, పసుపును, మిర్యాలను కల్కముజేసి కొబ్బరినూనె కలిపి సన్నకాగ మంటజేసి పక్వమైనపుడు ఖరపాకమున దింపుకొనవలెను.

ఇది గజ్జి, కురుపు, క్రిమి, చర్మరోగములు వీనికి పైపూతగ ఉపయోగింపవలెను కంటికి నోటికి తగలకూడదు.

### కరప్పాణి తైలము

(చిన్నబిడ్డలకు కాళ్ళయందు కలుగు కాపుతో కూడిన కరప్పాణి పుండ్లకు)

| | | | |
|---|---|---|---|
| చిట్టాముదము | 12 పలములు | బొక్కెనాకు రసము | 12 పలములు |
| సారాకు రసము | 3 పలములు | బిల్వాకు రసము | 1 ఔను |
| వెంగ ఆకురసము | 1 ఔను | ఆటికమామిడిరసము | 1 ఔ. |
| గంగిరాకు రసము | 2 ఔను | నల్లవుప్పిఆకురసము | 1 ఔ. |
| | | గలిగిరావికాయరసము | 1 ఔ. |

### కల్క ద్రవ్యము

| | | | |
|---|---|---|---|
| పెద్దమాని చెక్క | 2 పలములు | సుగంధపాలవేళ్లు | 2 పలములు |
| కన్నెకుమారి చెక్క | 2 ,, | తమలపాకుతొడిమలు | 1 ప. |
| అడవిచిక్కుడు | 2 ,, | కుప్పింటాకు చిగుళ్ళు | 1 ప. |
| మారేడివేళ్ళు | 2 ,, | తుమ్మ ఆకులు | 1 ప. |
| బొంతజెముడు చిగుళ్లు | 1 ,, | లవంగము | ¼ పలం. |
| కుప్పింటివేళ్ళు | 1 ,, | చెంగల్వకోష్టు | ,, |
| వీలకులు | ½ ,, | జాజిపత్రి | ,, |

| | | | |
|---|---|---|---|
| నల్లజీలకర | అర పలం | భారంగి | అర పలం |
| కాటిబెల్లం | కాలు పలం | అక్కలకర్ర | ,, |
| జాపత్రి | 1 వ. ఎ. | అతిమధురం | ,, |
| ఖురాసానివాము | 1 వ. ఎ. | తెల్లగడ్డలు | ,, |
| జాజికాయ | 1 వ. ఎ. | | |

ఈ వస్తువులను కల్కముచేసి పై రసముతో కలిపి వంటచేసి పాకమున దింపుకొనవలెను. కరప్పాణిగల పిల్లలకు నాలుకయందు రాస్తు వచ్చిన మాంద్యము, కరప్పాణి, గజ్జి, తీట, వాయురోగములు మానును.

గర్భవతులు సక్రమముగ అర్ధమాస క్రమమును సేవించిన గర్భస్థ బిడ్డకు వాతరోగము లంటవు, మాంద్యము, కరప్పాణి దరిచేరవు.

పెద్దవారుకూడ సేవింపవచ్చును. వాతరోగములు, మలబద్ధకము, గుల్మరోగములు, పొడలు, కుష్ఠు ఇవి తీరును.

హింగు త్రిగుణ తైలము

| | |
|---|---|
| ఇంగువ కల్కము 1 తులం | ఉల్లిపాయలరసం 20 తులం |
| సైంధవలవణము 8 తులం | నీళ్ళు 36 తులం ఆముదము 9తు |

అన్నిటిని కలిపి విధిప్రకారము కాచి పక్వమునదింపి భద్రపరచవలెను. కల్కమును ఆముదము కలిపి నూరిన లేహ్యమువలె నగును.

ఇది 1 తులమునుండి 4 తులములవరకు వాడవచ్చును.

వేడి మేకపాలలో 4 తులముల తైలమును వేసి త్రాగిన వాతశూలలు నయమగును.

వాము, వాయు విడంగము కషాయముతో వేసి త్రాగిన, క్రిమి రోగము, అగ్నిమాంద్యము గుణమగును. వాతపు నొప్పులకు పైన రాయవలెను. అండవృద్ధిని, నొప్పినిగూడ పోనడచును.

అశ్వగంధాది తైలము

| | | | |
|---|---|---|---|
| చిట్టాముట్టివేరు | 6 పలములు | పుడకకర్ర | 6 పలములు |
| పెన్నేరుగడ్డ | 6 పలములు. | | |



పై వస్తువులను దంచి 16 పానుల నీళ్ళలోనికి మంద్యాగ్నిచేత కాచి కాలువంతు కషాయము దింపుకొని యుంచు,

నువ్వులనూనె 16 పలములు పెరుగుమీగడ తేరిన నీరు 2 పల్లు

| | | | |
|---|---|---|---|
| సన్నరాష్ట్రం | చందనం | వట్టివేళ్ళు | సుగంధిపాల |
| కచ్చూరాలు | మంజిష్ట | అతిమధురం | మానిపసుపు |
| దేవదారుచెక్క | రేణుకలు | తుంగముస్తెలు | |
| చంగల్వకోష్ఠు | లంగరుచెక్క | పసుపు | |
| కలువదుంపలు | సదాప | నాగరకేసరములు | |

ఇవన్నియు ఒక్కొక్కతులము వంతున గ్రహించి దంచినీటితో నూరి కల్కముచేసి కషాయములో కలిపి మిగిలిన వస్తువులను కూడ కలుపుకొని మంద్యాగ్నితో తైలపాక విధిగా కాచి తైలమును దింపుకొని భద్రపరచవలెను.

పూటకు కాలుతులము వంతున ఆవుపాలలో సేవింపవలెను. వాతములను, పిత్తములను ఖండించును. శరీరమునకు బలము కలుగును. పుండు ఉబ్బులములు కూడ గుణమగును.

కృశించినవారికి పానాభ్యంగనములకు దీని నుపయోగించిన, బలము ఉత్సాహము, పుష్టినిచ్చును. నరములకు పటుత్వము లేని వారికి అభ్యంగనము చేయించి వేనీళ్ళలో స్నానము చేయించవలెను.

చందనాది తైలము

| | | |
|---|---|---|
| మంచి గంధపు చెక్క | ధాతకిపుష్పు | రక్తచందనం |
| ఎర్రగన్నేరువేళ్ళు | దాలిన చెక్క | కృష్ణాగరుచెక్క |
| పచ్చకర్పూరం | జటామాంసి | పద్మకాష్ఠం |
| భద్రముస్తెలు | వట్టివేళ్ళు | కుంకుమపువ్వు |
| రేణుకలు | కూతురుబుడము | ఆకుపత్రి |
| ప్రేంఖణపుష్పు | నాగకేసరాలు | లవంగము |
| సరళదేవదారుజిగురు | చలవమిరియము | జాపత్రి |
| మైసాక్షిగుగ్గిలం | పెద్దయేలకులు | జాజికాయ |
| సర్జరసము | చిన్నయేలకులు | నల్లచందనం |
| దేవదారు | నందివర్ధనపూలు | |

ఇవన్నియు ఒక్కొక్కటి ¼ తులము వంతున గ్రహించి తగినంత నీటితో కల్కముగనూరి పాత్రలోపోసి 16 పలములు నువ్వుల నూనె పోసి 32 పలములు నీళ్లుపోసి తైలపాకవిధిగ పాకము పట్టవలెను. ఇది పై పూతకుపయోగింపతగినది శరీరమునకు కాంతినిచ్చును, బలమును కలిగించును, శరీరదుర్గంధము, శరీరతాపము, దురద వీనిని పోగొట్టును.

### క్షార తైలము

| | | |
|---|---|---|
| ఎండిన ముల్లంగి | తుంగముస్తలు | భుజపత్రి |
| దుంపలక్షారము | వెల్లుల్లి | మోడి |
| శొంఠిక్షారము | ఇంగువ | సర్జక్షారం |
| వస | చెంగల్వకోష్టు | యవక్షారం |
| సోపు | గజపిప్పి | మానిపసుపు |
| బిడాలవణం | సైంధవలవణం | సౌవర్చలవణం |
| రసాంజనం | మునగచెక్క | |

ఒక్కొక్క పలము చొప్పున గ్రహించి కల్కముచేసి 64 పలముల తరువాణి, 64 పలములు మాదీఫలరసము, 64 పలములు అరటిగడ్డల రసము, 16 పలముల నూనె, వీటన్నిటిని కలిపి పొయ్యిపై నెక్కించి వండి పాకము అయిన పిదప దింపుకొనేది.

చెముడుకు రెండు చెవులలోను, రెండు దినముల కొక పర్యాయము నాలుగుబొట్లు వేసి కాసేపు ఉంచి వంచివేయవలెను. చెవిపోట్లకు చెవినిండా తైలముపోసి 5 నిమిషములుంచి వంచివేయవలెను. చీము కారునపుడు తైలమును వెచ్చబెట్టి నాలుగు చుక్కలు వేయవలెను. ముక్కులో వ్రణములకు, పుల్లకు దూదిచుట్టి తైలములో తడిపి రాయవలెను.

తైల ప్రకరణము సమాప్తము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు
# పులిప్పాణివైద్యము
## కషాయ ప్రకరణము

ముఖ్య విషయములు — ఆయా రోగములందు చెప్పబడిన కషాయములు వస్తువులను నలగగొట్టి క్రమప్రకారము జలము చేర్చి వండి దింపుకొనవలెను. కషాయములు సామాన్యముగ నిలువయుంచకూడదు. శుద్ధమైన జలమును మాత్రమే వాడవలెను.

కషాయము వండుటకు మృణ్భాండములే శ్రేష్ఠమైనవి, విధిప్రకారము జలము ఇంకిపోవును.

కషాయములు లోనికి సేవించుటకును, వ్రణములను పరిశుభ్రముగ కడుగుటకును ఉపయోగపడునవి. కషాయములు ఎప్పటికప్పుడు తయారుచేసుకొనుట మంచిది. జ్వరాదులకు కషాయములు అతి త్వరగ పనిచేయును. పురాణ జ్వరములకు కషాయములే యిప్పటికిని గ్రామ ప్రాంతములలో విరివిగ వాడబడుచున్నది.

### సకల జ్వరములకు కషాయము

| | | | |
|---|---|---|---|
| సుగంధపాలవేరు | 1 పలం | వట్టివేరు | 1 పలం |
| త్రికటుకం (శొంఠి | | తుంగముస్తలు | 1 పలం |
| పిప్పళ్ళు, మిరియము) | | పర్పాటకం | 1 పలం |
| ఒక్కొక్కటి | 1 పలం | ధనియాలు | 1 పలం |

ఈ పై వస్తువులను చూర్ణముచేసి దానిని 5 భాగములుగ విభాగించి ఒక భాగము కుండలోపోసి రెండు శేరులు నీళ్ళుపోసి పావుశేరు కషాయముగ కాగిన తర్వాత 8 ఔన్సుల కషాయములో వరహాయెత్తు తేనె కలిపి త్రాగిన సకల జ్వరములు నివారణయగును.

### పథ్యము

కందిపప్పు, మునగకాయ, అత్తికాయ, మెంతికూర, వంకాయ, ఉస్తివంకాయలు, పొన్నగంటికూర, అల్లము, ఇవి హితకరములు.

పైత్యకరములగు ఉసిరిక పచ్చడియును, కరక్కాయ పచ్చడియును, అల్లం పచ్చడి, పులిదింతాకు ఇవి చేర్చుకొనవచ్చు, చింతపండు పనికిరాదు వేడినీళ్ళతప్ప చన్నీళ్ళు పనికిరాదు

జ్వరము నిల్చిన 6 వ నాడు 8 పలాలు వావిలినారి ఉడకనిచ్చి తలకు రాచుకొని స్నానము చేయవలయును.

### మరొక పద్ధతి

| | | | |
|---|---|---|---|
| శొనగవేరు | 1 పలం | సుగంధపాల | 1 పలం |
| మునగవేరు | ,, | అడ్డసరపు ఆకు | ,, |
| ముండ్లముష్టి | ,, | దురదగొండివేరు | ,, |
| వాకుడు | ,, | చేదుపొట్ల | ,, |

వీటన్నిటిని నలియగొట్టి ఐదుభాగములుచేసి ఒకభాగము గ్రహించి కుండలోపోసి రెండు శేర్ల నీళ్ళుపోసి పావుశేరుగ కషాయముకాచి, పిదప

| | | | |
|---|---|---|---|
| శొంఠి | 1 పలం | సన్నరాష్ట్రం | 1 పలం |
| లవంగచెక్క | ,, | పిప్పళ్ళు | ,, |
| అతిమధురం | ,, | మిర్యాలు | ,, |

వీనిని వెచ్చజేసి చూర్ణము చేసుకొని, యీ చూర్ణమును, వరహాయెత్తు తీసుకొని కషాయములో కలిపి సేవింపవలెను ప్రతిదినం కషాయము తయారు చేసుకొనవలెను. పథ్యము పైన చెప్పినటులే.

### సకల విష జ్వరములకు కషాయము

| | | | |
|---|---|---|---|
| తిప్పతీగ | 1 పలం | అడ్డసరపువేళ్ళు | 1 పలం |
| ముండ్లముష్టి | ,, | తుంగముస్తెలు | ,, |
| చేరాముష్టివేరు | ,, | మిర్యాలు | ,, |
| చేదుపొట్ల | ,, | పిప్పళ్లు | ,, |
| వాకుడు | ,, | శొంఠి | ,, |
| పర్పాటకం | ,, | చవ్య | ,, |
| మోడి | ,, | ధనియాలు | ,, |



వీటన్నిటిని చూర్ణముచేసి పైన చెప్పిన విధముగ కషాయము కాచి పుచ్చుకొనవలెను.

### సురసాది కషాయము

[వ్రణములను శుభ్రపరచుటకు]

| | | | |
|---|---|---|---|
| తులసియాకు | 1 పలం | తుమ్మి | 1 పలం |
| కామంచిగడ్డ | ,, | గగ్గర | ,, |
| కాయఫలముచెక్క | ,, | వాయువిడంగం | ,, |
| నల్లతులసి | ,, | చాతరాశి | ,, |
| కలివెంద | ,, | కామంచి | ,, |
| నేలవేము | ,, | జటామాంసి | ,, |
| విషముష్టి | ,, | గంటుభారంగి | ,, |
| కుటజము | ,, | ఎలుక చెవియాకు | ,, |
| గురుగింజలు | ,, | | |

ఈ పైన వస్తువులను నలగగొట్టి 6 భాగములు చేసి 1 భాగమున 2 శేర్ల నీళ్ళుపోసి పావుశేరు కషాయము కాచి వ్రణములను శుభ్రపరచుటకు ఉపయోగింపవలెను

క్రిములతో గూడిన వ్రణములను శుభ్రపరచుటకిది చాల శ్రేష్ఠమైనది.

### పాత జ్వరములకు—పురాణ జ్వరములకు కషాయము

| | | | |
|---|---|---|---|
| త్రికటులు | | చవ్యము | 1 పలం |
| (ఒక్కొక్కటి ఒక్కొ | | లవంగ చెక్క | ,, |
| క్క పలము) | | తామరతూండ్లు | ,, |
| త్రిఫలములు (కర | | చెంగలివేరు | ,, |
| క్కాయ, తానికాయ, | | పర్పాటక | ,, |
| ఉసిరికాయ | | కటుకరోహిణి | ,, |
| ఒక్కొక్కటి | | దేవదారుచెక్క | ,, |
| ఒక్కొక్క పలము) | | మోడి | ,, |
| శ్రీగంధపుచెక్క | 1 పలం | అతిమధురం | ,, |
| ఖర్జూరపుకాయలు | 1 పలం | ద్రాక్ష | ,, |

| | | | |
|---|---|---|---|
| గంటుభారంగి | 1 పలం | చెంగల్వకోష్టు | 1 పలం |
| లవంగాలు | ,, | కరకంటు | ,, |
| విష్ణుక్రాంతం | ,, | నేలవేము | ,, |
| మంగవేరు | ,, | కలికివేరు | ,, |
| కలబందవరుగు | ,, | సుగంధపాల వేరు | ,, |
| నీరుగొబ్బి వేరు | ,, | పిండిదొండవేరు | ,, |
| తుంగముస్తెలు | ,, | సన్నరాష్ట్రిం | ,, |
| ధనియాలు | ,, | చిత్రమూలం | ,, |
| నూగుదోసాకు | ,, | వెలిగారం | ,, |
| అక్కలకర్ర | ,, | చిట్టాముట్టివేరు | ,, |
| ఉరాముట్టివేరు | ,, | అడ్డసరపువేరు | ,, |
| ఎర్రమునక్కాయ వేరు | ,, | సన్నపల్లేరువేరు | ,, |
| మారేడు వేరు | ,, | పెన్నేరుగడ్డ | ,, |
| వట్టివేరు | ,, | గుంటగలగర వేరు | ,, |
| ఇప్పపూలు | ,, | | |

వీటన్నిటిని చూర్ణించి పది భాగములు చేసి ఒక భాగము కుండలో పోసి 2 శేర్ల నీళ్ళు కలిపి పావు శేరు మిగులునటుల కషాయము కాచి పూటకు మూడు ఔన్సుల కషాయములో ఒక వరహా యెత్తు పిప్పళ్ళ చూర్ణం, ఒక వరహా యెత్తు తేనె కలిపి దినమునకు రెండుపూటలు త్రాగిన, చలిజ్వరము, వాతజ్వరము, పైత్యజ్వరము, కొండ ప్రాంతములలో నివసించువారికి వచ్చునట్టి జ్వరములు, పురాణ జ్వరములు, పాండుజ్వరములు, ద్వంద్వజ్వరాలు, అస్థిగతజ్వరాలు, మాంసగతజ్వరాలు, రక్తగతజ్వరాలు, కఫజ్వరాలు, పశుజ్వరాలు, సకల జ్వరములు నివారణయగును.

ఇందుకు పథ్యము

కందిపప్పు, వంకాయ, మునగకాయ, కొయ్యతోటకూర, మిర్యాలచారు ఇవి హితకరములు. చింతపండు స్వల్పముగ చేర్చుకోవచ్చును. అన్నము హితముకానిచో బార్లీ, రవగంజి యూరాయవలెను. అన్నము పునఃపాకము చేసి యూరాయవలెను.



వాతజ్వర కషాయము

| | | | |
|---|---|---|---|
| వావిలి వేరు | 1 పలం | కాచాకు ఇగురాసెలు | 1 పలం |
| అడ్డసరపు వేరు | 1 పలం | నెల్లిఆకు ఇగురాసెలు | 1 పలం |
| సన్నపల్లేరు వేరు | 1 పలం | వేపాకు ఇగురాసెలు | 1 పలం |
| ముండ్లముష్టి వేరు | 1 పలం | తెలగలింగ చెట్టు ఆకు | |
| త్రికటుకలు ఒక్కొక్కటి | | ఇగురాసెలు | 1 పలం |
| ఒక్కొక్క పలం | | వాకుడు | 1 పలం |
| తుంగముస్తెలు | 1 పలం | పర్పాటకము | 1 పలం |

వీనిని నలియగొట్టి పైన చెప్పిన చొప్పున కషాయము కాచి పైన చెప్పిన చూర్ణము తేనె కలిపి పుచ్చుకోనేది.

వాత పిత్త శ్లేష్మ జ్వరాలకు కషాయము

| | | | |
|---|---|---|---|
| శొంఠి | ¼ తులం | పర్పాటకం | ¼ తులం |
| పిప్పళ్ళు | ,, | మిర్యాలు | ,, |
| సన్నరాష్ట్రిం | ,, | మోడి | ,, |
| చవ్యం | ,, | చెంగల్వకోష్టు | ,, |
| వాయువిడంగం | ,, | గంటుభారంగి | ,, |
| ధనియాలు | ,, | చేదుపొట్ల | ,, |
| విష్ణుక్రాంతం | ,, | నేలవేము | ,, |

ఈ వస్తువులను నలగగొట్టి నాలుగు భాగములుచేసి ఒక భాగం కషాయముపెట్టి ఉదయం సాయంకాలములందు పుచ్చుకోనేది.

సన్నపిప్పళ్ళు వెచ్చచేసి చూర్ణించి తులం యెత్తు చూర్ణము, తులంయెత్తు తేనె కషాయములో కలిపి పుచ్చుకొనిన త్రిదోషజ్వరములు హరించును. పథ్యము ముందు చెప్పినటులే

అర్కాది కషాయము

[వ్రణశోధనమునకు]

| | | | |
|---|---|---|---|
| జిల్లేడు వేళ్ళు | అర పలము | నెమలిఅడుగుచెట్టు వేళ్ళు | అర పలం |
| తెల్లజిల్లేడు వేళ్ళు | ,, | ఉత్తరేణి వేళ్ళు | ,, |
| నాగదాలి | ,, | కాకిదొండ వేరు | ,, |

| | | | |
|---|---|---|---|
| చన్నచర్లగడ్డ | అర పలం | తానికాయ | అర పలం |
| గంటుభారంగి | ,, | ములక | ,, |
| కలింగరాష్ట్రం | ,, | గారచెట్టు | ,, |
| తెలువుణిచెట్టువేళ్ళు | ,, | గినియ | ,, |

ఈ ద్రవ్యములను కషాయముజేసి వ్రణములను శుభ్రపరచవలెను ఇందువలన కఫవ్రణములు, విషక్రిమి వ్రణములు హరించును.

### త్రిఫలా కషాయము
(వ్రణ శోధనమునకు)

కరక్కాయ   తానికాయ   ఉసిరికాయ

దీనిని సమభాగముగ గ్రహించి కచ్చగాదంచి యుంచుకొని అవసరమువచ్చినప్పుడు కషాయముకాచి వ్రణములను కడుగవలెను. ఇటుల చేయుటవలన వ్రణములు శీఘ్రముగ మానుట కుపయుక్తమగును.

### జీర్ణగత జ్వరములకు

తిప్పతీగ, మిరియాలు, దురదగొండివేళ్ళు వేసి కషాయము కాచి యిస్తే శీతాదులతో జ్వరము రాదు.

నేలవేము, చేదుపొట్ల, చేదుబీర, నిమబొద్ది, తిప్పతీగ, మిరియాలు, శొంఠి, సమభాగాలు కషాయము కాచి జ్వరములు మీద వాడదగును.

### కామెర్లకు

త్రిఫలాలు, తిప్పతీగ, అడ్డసరము, కటుకరోహిణి, నేలవేము, వేపచక్క కషాయము కాచి శిలాజిత్తు, మండూరము, హేమాక్షికం, లోహభస్మం యివి సింధూరములుగా యున్నవి గ్రహించి వాడిన సమస్త కామెర్లు శీఘ్రం పోవును.

### కామెర్లకు పత్యము

పెసరపప్పు, పొట్లకాయ, బూడిదగుమ్మడికాయ లేత అరటికాయ, పొన్నగంటి, ఉసిరిక పచ్చడి, మజ్జిగ, ఆవుపాలు హితకరము

కషాయ ప్రకరణము సమాప్తము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు
# పులిప్పాణి వైద్యము
## కట్టుల ప్రకరణము

### అమరశిలగంధకకట్టు

ఒక పలము వేడియుప్పును ఖల్వమునబెట్టి కోడిగుడ్డు తెల్ల రసముతో బాగుగ మర్దించి ఒక పలం గంధకమునకు పైపూత బెట్టి యెండించి తల వెంట్రుకలతో నాగంధకమును మరుగు పడు నటులచుట్టి, ఒక చిన్నకుండలో సున్నం సబ్బు ఒకసేరు, సీమ సున్నము ఒక సేరు యీరెంటిని పలకగొట్టి రెండుపళ్ళు నీళ్ళుపోసి కలిపి అందులో అరపడి వుప్పుపోసి గంధకమును ఉప్పుపైన వుంచి దానిపై అరపడి వుప్పునుపోసి పై కుండకు మినపపిండి కవచముచేసి 30 పిడకలతో పుటము బెట్టగ గంధకకట్టు అగును.

### ఇంగిలీకకట్టు

పళ్ళెండలింగము 1 పలము, జీడివిత్తులు 15 పలములు పగుల గొట్టి ఒక చట్టిలో సగంవేసి దానిపై ఇంగిలీకము పెట్టి మిగిలిన సగం దానిపైన పోసి ఇంగిలీకము కనిపించకుండగ చేసి పొయ్యిపై పెట్టి వేయించేటప్పుడు దీపముచూపిన మంట బయలుదేరును. మంట నిలచినపుడు ఇంగిలీకము కట్టును. ఈ కట్టును తేనెలో రాచి బిడ్డల కీయవచ్చును. పథ్యము :- చింతపండు పనికిరాదు దీనిని ఖల్వమున పొడిచేసి బియ్యపుగింజ ప్రమాణము తేనెతో యిచ్చిన జ్వరములు నివారణ యగును.

ఇంగిలీకము 5 వరహాలయెత్తు 1 జాము చురుకుయిచ్చి, నిమ్మ రసమున ఒకజాము చురుకుయిచ్చి కాచాకురసమున 1 జాము చురుకు యిచ్చిన ఇంగిలీకము కట్టును దీనిని సన్నిపాత జ్వరము, తలనొప్పికి చనుపాలలోను, శిరలకు, గజబాహు తేనెలోను వాడి యీయవలెను. చింతపండు తగ్గించుట మంచిది.

## రసకర్పూర కట్టు

నాలుగు వరహాలయెత్తు రసకర్పూరమునకు పాలసంద్రకాయను బాగుగ మర్దించి తీసిన రసమున 2 జాములు చుఱుకుయిచ్చి తర్వాత మావుడోసాకు రసం సి. డి. 2 జాములు చుఱుకు యివ్వగా కట్టును.

## తాళక కట్టు

పది వరహాలయెత్తు తాళకమునకు సన్నకుప్పి దండారసము, గుంటగలికేసు రసం ఒక్కొక్క రసము ఒకపడి వంతున చుఱుకు యిచ్చి ఆరనిచ్చి దానిని 18 పిడకలలో వేడిఉప్పు చిట్లవేసి నిమ్మ పండ్ల రసముతో నూరి మూడుసార్లు పుటమువేసిన ఉప్పు 14 వరహాలయెత్తు సీస్ప్రపోసినూరి కవచముచేసి, దానిపైన ఒక వేలి ప్రమాణము రాళ్ళసున్నం కవచముచేసి కుండపెట్టి ఐదు వస్త్రబంధనము చేసి 16 అడవి పిడకలతో పుటమువేసిన తాళకము కరిగి కట్టును.

## మరొక విధము

అర్ధపలము తాళకమును ఒక ప్రమిదలో మోదుగ పత్తులు మెత్తగ పొడిచేసి యుంచి దాని మధ్యను తాళకమును వుంచి పైన ప్రమిదను బోర్లించి సందు లేకను ఇంకమున్న గుడ్డకు చరిమి దానిని ప్రమిదకుచుట్టి ఎండించి ఒకటిన్నర పిడకతో ఇరవై ఒకసారి పుటం పెట్టిన తాళకం గడ్డకట్టును.

## లింగ కట్టు

నేలతంగేడు ఆకును దంచి చిన్నపిల్లల మూత్రము కలిపి రసంపిండి ఒక పింగాణి పాత్రలోపోసి దానిలో మైలుతుత్తము పెద్ద ముక్కను మునిగేటట్లు నానవేసి ఏడుదినములు యెండించిన ఆ రసమంతయు తుత్తములో యింకిపోవును పిదప కమ్మరాకు రసమున ఏడుదినములు ఎండబెట్టవలెను. ఆ మైలుతుత్తమునకు ఆవువెన్న దళముగ పట్టించి ఏడుదినములు యెండించిన నది సున్నమగును, బ్రహ్మదండుపువ్వు మధ్యనుండు పరము తీసి సున్నముతో కలిపి పలిపిస్ల రసమువచ్చును. ఈ రసమున ఒకపలం లింగమును మూడు జాములు చుఱుకు యిచ్చిన లింగము కట్టును వ్యాధులకు సేవనలో వాడ యుయ్యవలెను.



## తెల్ల పాషాణము కట్టు

| | | | |
|---|---|---|---|
| పల్లసీసము | 1 పలము | నాటుసబ్బు | 1 పలము |
| మంచిపుప్పి | ,, | రసం | ,, |
| తాళకం | ,, | | |

పై సరకులన్నిటిని తెల్లజిల్లేడు పాలు లేక జెముడుపాలు పోసి నూరి మూడుభాగములుగ భాగించి పాషాణము గడ్డ 1 పలం, నూరినముద్ద ఒక భాగమును పాషాణమునకు కవచముచేసి ఆరనిచ్చి మూడు పిడకలతో పుటం పెట్టవలెను, ఇటుల మూడు పుటములు పెట్టిన పాషాణము కట్టును.

## నవాచార కట్టు

నవాచారం 10 పలాలు

అభిని, మిర్యాలు, పూరము ఈ మూడు 1 తులం

వీనిని కస్పింటాకు రసముతో నూరి నవాచారమునకు కవచమిచ్చి 5 పలముల లెక్క నవాచార కవచమునకు కవచమిచ్చి మంచిఉప్పు 5 పలములు, పిల్లుప్పు 5 పలములు వీటిని పొడిచేసి కుండలో సగము పోసి నవాచారమును పెట్టి పైన పైన మిగిలిన ఉప్పువేసి దానిపై సన్న యిసుక పోసి కమలాగ్నిగా 4 జాములు వండిన దంతమువలె నవాచారము కట్టును.

## వీరము కట్టు

వీరము 1 పలం సాంబ్రాణి 1 వ. యె. నెల్లికాయగంధకం 1 వ. యె.

ఈ రెంటిని పొడిచేసి గరిటలోవేసి నిప్పుపైపెట్టి కరిగివచ్చునపుడు వీరము నందులోవేసి పొర్లించి తీసికొనవలెను.

## పూరము కట్టు

చీనాపూరం 1 పలం తెచ్చి చనుపాలలో 3/4 దినములు నానవేసి యెండించి ఒక చట్టిలో తులసిరసం పోసి దానిలో పూరమును పెట్టి సన్నమంటతో తులసిరసము ఇంకువరకు కాచిన కట్టును.

కట్టుల ప్రకరణము సంపూర్ణము

---

శ్రీ రస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

## భస్మప్రకరణము

### కొన్ని ముఖ్య సూచనలు

లోహములు, రసములు ఉపరసములు, మణులు వీనిని పుటములు వేసి, లేక వంటచేసి ఇట్టి మారణక్రియవలననేగాక మార్పుక్రియచేత గూడ రూపమును మార్చి దానిని భస్మము, లేక సింధూరము చేయవలెను. భస్మము తెల్లగను, సింధూరము ఎఱ్ఱగను నుండును.

లోహములను భస్మముగనో, సింధూరముగనో చేయవలసి వచ్చినపుడు దానిని విధిప్రకారము శుద్ధము చేయవలెను. శుద్ధి చేయబడని లోహాదులను భస్మము చేసినచో నది భస్మము కాక పోవచ్చును. భస్మరూపముననైనను, దానిని వాడుటవలన రోగములు నివారణ కాకపోవుటయే గాక క్రొత్త రోగములు పుట్టుటకు కారణభూతములగును.

సింధూరములలో రససింధూరము, పూర్ణచంద్రోదయసింధూరము, షడ్గుణసింధూరము మకరధ్వజసింధూరము ఇవి తప్ప మిగిలిన సింధూరములు అతిసూక్ష్మముగను, నీటిమీద తేలునవిగ నుండును.

విధిప్రకారము శుద్ధిచేయబడిన లోహాదులను వేయించిగాని, పొడిచేసిగాని సన్నరేకులుగ చేసిగాని ఆ యా రోగములందు వివరింపబడిన విధమున ద్రవముతో నూరి బిళ్ళలుచేసి యెండించిగాని, పొడిచేసిగాని విధిప్రకారము పుటము పెట్టవలెను, లేక వంటచేయవలెను.

ఔషధములలో వాడబడు భస్మములు యే యే విధముగ తయారుచేయబడవలెనో ఆ యా రోగములందు చెప్పబడిన విధి ప్రకారము తయారుచేసి ఔషధములలో కలుపవలెను.



పుటము వేయబడిన లోహములు ఖల్వమున నెంతబాగుగ నూరిన నంత సూక్ష్మముగను, త్వరగను, తక్కువ పుటములలో భస్మమైనటుల కనబడినను నిర్ణయప్రకారము అన్ని పుటములు వేయవలెను. నాగము, అన్నభేది, సత్తు, వంగము ఇవి భస్మములుగ చేయవలసి వచ్చినపుడు వేడిని యెక్కువ కలిగించరాదు. ఎక్కువ పిడకలు వాడక ఆవేడికి అవి కరిగి మరల గడ్డకట్టును. కనక వేడి నిచ్చుటలో జాగ్రతగానవలెను.

### పిడకలు

పుటములు వేయుటకు పిడకలు అవసరము. పిడకలు మూడురకములు లభ్యమగుచున్నవి. అడవి పిడకలు, అమ్ముడు పిడకలు, ముద్ద పిడకలు ఇందు అడవి పిడకలు (గొడ్లు కడివేసినపుడు అవిఅట్లైయెండి పిడకవలెనగును.) చాల శ్రేష్టమైనవి. ముద్దపిడకలు మధ్యమము, అమ్ముడు పిడుకలు మన్ను అవి ఎక్కువగ కలిసియుండును. ఆపిడకల వలన వలసినంత వేడి కలుగజాలదు, కనుక ఎక్కువగ వాడవలెను.

### గుంట

పుటమునకు పిడక లెంత యవసరమో గుంటకూడ అంత అవసరమే. గుంట కట్టినేలయందు ఆ యా రోగములందు చెప్పబడిన కొలతప్రకార ముండవలెను. వంకరలు పనికిరావు. పుటము వేయు స్థలము ప్రత్యేకముగ నుండవలెను. గుంట అడుగు భాగము విశాలముగను పైకి రాను రాను తక్కువగను నుండవలెను. గుంటలోన ఇటుక రాళ్ళతో అంచుకట్టిన మంచిది. అట్టి గుంట ఎల్లప్పుడు పనికివచ్చును.

### శీలు చేయు విధము

సమకొలతలుగల రెండు మూకుళ్ళను గ్రహించి ఒక దానిలో ఔషధమునుంచి పైన మరొక మూకుడును బోర్లించి కొత్తని మన్నుతో గుడ్డకుబూసి ఆ గుడ్డను మూకుళ్ళ సంధికి చుట్టును చుట్టవలెను. మూడుసార్లు చేయవలెను. పిదప బాగుగ నెండించిన తర్వాతనే పుటము వేయ పూనుకొనవలెను.

### పుటము వేయు విధము

పుటమునకు సిద్ధపరచబడిన గుంటలో చెత్తచెదారము లేకుండ నుండవలెను. గుంట సగమువరకు పిడకలను క్రమముగ పేర్చవలెను.

దానిపై శీలుచేసిన మూకుడునుంచి పిడకలను గుంటనిండుగ పేర్చి పైన గోపురమువలె పేర్చవలెను. ఆ తర్వాతను నిప్పు అంటించవలెను. అంతయు కాలి చల్లారిన పిదప మూకుడును తీసి మున్ను మట్టు లేకుండచేసి ఔషధమును గ్రహించవలెను.

భస్మలక్షణములు

ఒక చిటికెడు భస్మమును నీటిపై వేసినచో నది నీటిలో పలికిపోక తేలియుండవలెను. అప్పటికిగాని అది భస్మము కానేరదని తెలుసుకొనవలెను. లోహభస్మములను యీ విధముగనే పరీక్షించవలెను.

మరియు భస్మమును చేతిలోకి తీసికొనిన నది చేతిలోని గీరలలో నంటుకొనవలెను.

భస్మమును నీటిపై వేసి యీ భస్మముపై వడ్లగింజను గాని ఉలవగింజనుగాని వేసినచో నది మునుగకుండ నుండవలెను

భస్మముల కుండవలసిన దావశ్యకము, బలుపు ఇవి అనుభవము పిదపే గ్రహించవలెను,

సింధూరములను పాకము చేయునపుడు ఆ యా యోగము అందు చెప్పబడిన కాలపరిమితికంటె, త్వరగాను ఆలస్యముగను ఎప్పుడు పక్వమైన నప్పుడు తీసి భద్రపరచవలెను. ఆ కాలపరిమితి ప్రకారము ఉంచకూడదు ఈ యౌషధములను తయారుచేయువారు ఒకటి రెండుసార్లు అనుభవజ్ఞులను దగ్గర ఉంచుకొనవలెను.

అయభస్మము

ఒకపలము అయమును పొడిచేసి దానిని ఖల్వములో నుంచి నిమ్మపండ్ల రసమున ఒకదినము మర్దనచేసి బిళ్ళచేసి యెండించి ప్రమిదలో నుంచి పైన ప్రమిదను బోర్లించి శీలమన్నుచేసి ముప్పది పిడకలలో పుటము వేయవలెను తర్వాత దానిని ఖల్వమునకుంచి నేరేడు పట్టరసముతో మర్దించేది, మర్దించునపుడు 8 వరహాలయెత్తు వెలిగారము వేసి కుప్పింటాకు రసముతో నూర్దించి బిళ్ళలుచేసి యెండించి ముందువలె 25 పిడకలలో పుటము వేయవలెను. భస్మమగును.

దీనిని అర్ధ గురిగింజ ప్రమాణము నేతిలో రంగరించి సేవించిన మేహసంబంధ రోగములు తీరును. మరియు పాండురోగములు తీరును ఇచ్ఛాపథ్యము,



మరొకవిధము

ఇనుపరేకును బాగుగ కడిగి తీసికొని కుందేలు రక్తమున బోర్లించి కాచిన శుద్ధి 3 సార్లు అటులచేయవలెను. లేక నూనెరాది ఎర్రనగువరకు కాచిన శుద్ధి, 6 మారులు అటులచేయవలెను.

ఆ లోహమునకు సమము ఇంగిలీకము కలిపి నిమ్మరసముతో నూరి ఒక పుటమును, త్రిఫల కషాయముతో నూరి 20 సార్లు గజపుటము వేసిన భస్మమగును,

ఆకలిని కలిగించును, రక్తమును శుద్ధిపరచును, వృద్ధి పరచును. వాతమును ఖండించును,

అభ్రకభస్మము

శ్రేష్ఠమైన అభ్రకము వజ్రాభ్రకము. ఇది బరువుగను నిప్పులో కాల్చిన మెట్టమాత్రము చెందకుండును. అట్టి యభ్రకము మొదట నీ విధమున శుద్ధి చేసికొనవలెను. అభ్రకమును ఇనుప బాణలిలోవేసి కొలిమిపై నుంచి అభ్రకము ఎఱ్ఱనగువరకు నుంచి తర్వాతను గోమూత్రములో ముంచవలెను. ఇటుల ఏడుసార్లు చేయవలెను.

పై ప్రకారము శుద్ధి చేయబడిన అభ్రకమును 2 భాగములు తెంగము సైలు 1 భాగము, నీళ్ళు మూడుభాగములు వీనిని ఏకము చేసి, ఒక పాత్రలో మూడుదినములు నానబెట్టి తర్వాతను రోటిలో వేసి కుబ్బవలెను. నీరు అభ్రకము తెంగము సైలు అన్ని కలిసిపోవు వరకు కుబ్బవలెను. పిదప కొత్తగుడ్డలో వేసి సగము వడ్లుపోసి మూటగట్టి క్రింద నొక పాత్రనుంచి దానిలోకి మూటను పిసికి వడ పోయవలెను లేకున్న అభ్రకమును దంచి పొడిచేసి కాంజికములో కలిపి వడబోయవచ్చును. ఇటుల చేసిన అభ్రకము నీరు దిగును. నీరు పైకి తేలి, అభ్రకము అడుగున నిలచిపోవును. అప్పుడు నీటిని తీసి అభ్రకమును గ్రహించవలెను.

ధాన్యాభ్రకమును గలిజేరు రసముతో నూరి పుటము వేయవలెను. ఇటుల 6సార్లు ఆ రసముతోను, అడ్డసరరసముతో ఏడుసార్లు చిరికూర రసముతో ఏడుసార్లు పుటము వేసిన భస్మమగును.

గలిజేరు రసముతో పుటము వేయునపుడు అభ్రకముతో పదునారవ వంతు వెలిగారమును చేర్చుకొనవలెను. మరియు కసివింద స్వరసముతో పదిసారులు పుటము పెట్టిన భస్మము కాగలదు.

### శతపుటవిధానము

శుద్ధిచేసిన వజ్రాభ్రకమును ధాన్యాభ్రకముచేసి

| | | |
|---|---|---|
| కుక్కపొగాకు | బ్రహ్మదండి | పల్లేరుసమూలం |
| గుంటగలగర | పెన్నేరు | ఉసిరికె రసము |
| కటుకరోహిణి | వావిలాకు | చిత్రమూలకషాయం |
| పాలగుమ్మడు | గంజాయి ఆకు | బూడిదగుమ్మడు |
| కలబందరసం | పిల్లిపీచర | చిర్రికూర |
| వాకుడు | అడ్డసరము | తులసికూర |
| తంగము స్తైలు | తామరగడ్డలు | కోడశదం |
| తెల్లమద్ది | సరస్వతియాకు | దిరిశెనపుచెక్క |
| బూరుగచెక్క | కసివిందాకు | తిప్పతీగ |
| త్రిఫల కషాయం | జిల్లేడు పాలు | మర్రియూడలు |
| మంజిష్ట | కుశువేరు | ద్రాక్ష |

పైన కనబరచినవాని స్వరసముతో ఒక్కొక్క దానితోను మూడు పర్యాయములు నూరి పుటము వేయవలెను. పైనవస్తువులు అన్నియు లభింపనప్పుడు లభించిన వానితోనే పుటము వేయవలెను. ఇటుల చేసిన స్వచ్ఛమైన సింధూరమగును. సింధూరముగాని, భస్మముగాని తయారైన తర్వాత అందులో తళుకు లుండరాదు. పుటములు పూర్తి అయిన అట్టిదానికి గుణమధిక మగును

దీనిని ¼ తులమునుండి అర్ధతులము వరకు అనుపాన విశేషములతో వాడవలెను. ప్రమేహమును పోగొట్టును. రక్తవృద్ధిని కలిగించును. హృదయమునకు బలము నిచ్చును.

పాండువు, నీరసము, అతిమూత్రములయందు అభ్రకసింధూరము 1 తు॥ స్వర్ణమాక్షిక భస్మం అర తు॥ కర్పూరశిలాజిత్తు భస్మం అర తు॥ తిప్పసత్తు 1 తులము వీనిని కలిపినూరి పూటకు 10 గురిగింజలు ప్రమాణము, తేనె, లేక వెన్న కలిపి యీయవలెను.



బహుమూత్ర వ్యాధికి తంగేడుచెక్క 1 తు॥ మేడిచెక్క 1 తు॥ మర్రియూడలు 1 తు॥ యీ మూడింటితో కాచబడిన కషాయము 1 ఔన్సు 5 గ్రయినుల సింధూరము కలిపి పుచ్చుకొనవలెను.

రాచపుండు, మేహములకు సింధూరము 1 తు॥ కాంతభస్మము 1 తు॥ శంఖభస్మం 1 తు॥ రససింధూరము 1 తు॥ సాలామిశ్రి చూర్ణం 1 తు॥ గోమూత్ర శిలాజిత్తు 1 తు॥ వీటిని యేకముచేసి తేనెలో నూరి గురిగింజ ప్రమాణము మాత్రకట్టి దినమునకు 3 మొదలు 6 మాత్రలవరకు వాడవలెను.

పురాణ జ్వరములలో సింధూరము ¼ తులం రససింధూరము అర తు॥ పిప్పళ్ళ చూర్ణం అర తు॥ గుంటగలగరాకు రసమునసూరి గుంజా ప్రమాణం మాత్రలుకట్టి యుపయోగింపవలెను.

### మరొకవిధము

కృష్ణాభ్రకము రేకులుగా ఒలిచి పుల్లనీళ్లలో 40 దినములు నానవేసి పిదప రోటిలోవేసి చూర్ణముగ దంచుకొని ఆవిశాకు రసమున రెండు దినములు, తెల్లగలిజేరు వేళ్ళరసమున రెండు దినములు మర్దించి బిళ్ళచేసి మూకుడులోపెట్టి మొండించి మూకుడు మూసి శీలచేసి మొండనిచ్చి గజపుటము వేయవలెను.

### కాంతభస్మము

కాంతపు బిళ్ళలను చూర్ణముచేసి నిమ్మపండ్ల రసము, కలి, పులుపెక్కిన చల్ల వీనిలో భావనచేసి మొండించిన శుద్ధియగును.

కాంతలోహము 5 పలములు, ఇంగిలీకము 5 పలములు యీ రెంటిని చనుబాలలోనైనా, గోమూత్రములోనైనా నూరి బిళ్లలు చేసి మొండించి పుటము వేయవలెను. ఈవిధముగా పది పుటములు వేయవలెను. పిదప ఒకటికి అరనై ఇంగిలీకము కలుపుచు త్రిఫలా కషాయముతోనూరి 10 పుటములు, కలియుతోనూరి 10 పుటములు, నిమ్మపండ్ల రసమునూరి పది పుటములువేసిన భస్మమగును.

ఒక గురిగింజ నుండి 2 వరకు తేనె, వెన్నల అనుపానము, పాండు క్షయ వీనిని హరించును. బలమును కలిగించును, రక్తమును వృద్ధి చేయును.

జటామాంసి, మానిపసుపు, తెల్లగలిజేరు, త్రికటుకములు కేవల్ చిన్న ఒక్కొక్కటి ఒక్కొక్క తులము గ్రహించి మూడు ఆశాకులు నీళ్ళుపోసి కషాయముగాచి ఒకటికి ఎనిమిదవ భాగముదించి 3 పూటలు 2 గురిగింజల ప్రమాణము భస్మము కషాయముతో సేవించిన శోఫలు హరించును.

పిప్పళ్లు, లవంగాలు, ఏలకులు, శీమ తవాక్షీరి తిప్పసత్తు తులం చొప్పున గ్రహించి చూర్ణించి కాంతభస్మం 1 తులం చూర్ణముతో కలియనూరి 6 గురిగింజల చూర్ణమును కాటికలకండ చూర్ణముతో కలిపి సేవించిన క్షయ హరించును.

భస్మము 1 గురిగింజ, తాలిసాదిచూర్ణం 6 గురిగింజలు రెంటిని కలిపి రోజు రెండుసార్లు సేవించిన కామెర్లు, పాండు హరించును.

నాగభస్మము

శుద్ధిచేసిన నాగమును పలచని రేకులుగాచేసి నవ్వీరం, శంఖపాషాణం, పూరం వీనిని ఉమ్మెత్తాకు రసముతో మర్దించి రేకులకు కవచమిచ్చి ప్రమిదలో నుంచి సీలుచేసి గజపుటం వేయవలెను.

మరియు తాళకమును అరదొండాకు రసముతో మర్దించి ఒక పలం నాగమునకు లేపనముచేసి ఎండించి ప్రమిదలో నుంచి సీలుచేసి 50 పిడకలతో పుటంవేసిన భస్మమగును.

మరియు నాగమునకు పదునొకండుమార్లు కరిగించి, ఇప్పమానెలోపోసిన శుద్ధియగును. దానిని బిళ్ళగాచేసి నన్నేరు వేళ్ళ పట్ట మెత్తగానూరి కవచమిచ్చి ఎండించి ప్రమిదలో నుంచి సీలు చేసి ఎండించి 30 పిడకలతో పుటమువేసిన భస్మమగును. ఈ భస్మము అన్ని పనుల కుపయోగింపవచ్చును.

కాలు తులమునుండి అర్ధతులము వరకు నేయి తేనె అనుపానములతో సేవించిన పసిమి రోగములు మూలరోగములు నాడి వ్రణములు మున్నగునవి నయమగును.

మరొక విధము

(శుద్ధిచేయుటలో మరొక పద్ధతి)

సీసము (ఒక పలమునకు పదిపలముల వావిలియాకు రసమును) కరిగించి రసమునపోసి ఇటుల మూడుసార్లువేసిన శుద్ధియగును.



కరిగించి పోయునప్పుడు జాగ్రత వహింపవలెను. ఎటులన భూమిలో గుంటచేసి దానియందు ద్రవమునుంచుపట్టి పాత్రను పెట్టి ద్రవముపోసి దానికి సరిగ మధ్య రంధ్రముగల విసకురాతిని పెట్టి దూరమునుండి కరిగించిన లోహమును విసకురాతి పడకుండ పొడుగుపాటి కర్ర గల గరిటతో పోయవలెను.

ఇటుల శుద్ధిచేయబడిన సీసమును ఇనుపబాణలిలో వేసి కరిగించి చింతబెరడు కాల్చిన బూడిదను బాణలిలో కొద్దికొద్దిగ వేయుచు గరిటతో రాచుచుండిన సీసము భస్మమగును.

ఆ భస్మమునకు సమము మణిశిలనుచేర్చి నిమ్మపండురసముతో నూరిన బిళ్ళలుచేసి ఎండించి ప్రమిదలోనుంచి సీలుచేసి ఎండించి గజపుటము వేయవలెను. పుటమువేసిన యీభస్మమునకు 30 వ వంతు మణిశిలనుచేర్చి నిమ్మపండ్ల రసము నీ పైవిధమున జేసి పుటము వేయవలెను. ఇటుల పది పుటములువేసిన శుభ్రమైన భస్మమగును.

3 గురిగింజలయెత్తు నుండి 4 గురిగింజలయెత్తు వరకు తేనె నేయి అనుపానముతో సేవించవలెను. క్షయ, కామెర్లు, ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము వీనిని పోగొట్టును.

క్షయకు : అశ్వగంధాది చూర్ణముతో కలిపి యిచ్చేది.

కాసీసభస్మము

కాసీసమును నిమ్మపండ్ల రసముతో ఒకరోజు నాననిచ్చిన శుద్ధియగును.

ఐదు పలముల శుద్ధిచేసిన కాసీసమును నిమ్మపండ్ల రసమున నూరి బిళ్ళలుచేసి ఎండించి 30 పిడకలతో పుటము వేయవలెను. అది సింధూరము కానియెడల మరల నిమ్మపండ్ల రసముతో నూరి పుటము వేయవలెను. ఎక్కువ వేడిమైనను చెడిపోవును.

జ్వరమునకును వాడవచ్చును. నాగభస్మమునకు గల గుణమే దీనికిని గలదు.

త్రికటుచూర్ణము 1 తు॥ కాసీసభస్మం 1 తు॥ వీనిని గుంటగలగరాకు రసమునసూరి శనగల ప్రమాణము మాత్రలు చేసి పూట కొక్క

మాత్ర చొప్పున సేవించిన అజీర్ణము మున్నగునవి హరించి ఆకలిని కలిగించును.

మరియు త్రికటుచూర్ణము, కాసీసభస్మం, యవక్షారం, సర్జక్షారము, చిత్రమూలం సమభాగములు గ్రహించి ఏకముచేసి కాలు తులము కాకిలకండ అనుపానముతో సేవించిన యకృత్ప్లీహోదరములు నివారణయగును.

వంగభస్మము

వంగము (తగరము) ఒక పలము ఇప్పనూనెలో నానబెట్టి కరిగించి ఆరనిచ్చి బిళ్ళలుచేసి ఒక బాణలిలో ఉప్పుపోసి దానిపై మర్రిఆకులుంచి ఆకులపై వంగపు బిళ్ళలుంచి పైన మర్రిఆకులను కప్పి దానిపై ఉప్పువేసి మూతబెట్టి శీలమన్ను చేసి యెండించి పొయ్యిమీద బెట్టి వాతాగ్నిగ 8 జాములు మంటవేసిన భస్మమగును. దీనిని ఇతర ఔషధములతో వాడుకొనవచ్చును.

మరొక విధము

శుద్ధి క్రమము—శుద్ధి వంగమును ఇనుపగరిటెలో కరిగించి వావిలాకు రసములో మంచి పసుపుకలిపి కుండలో సగమువరకు పోసి దానిని భూమిలో పాతిపెట్టి పైన విసురురాతిని సందు సరిగ నుంచి వంగము సందుగుండ పోయవలెను. ద్రవము వంగముకంటె పదింత లెక్కువ ఉండవలెను ద్రవము చాలనిచో వంగము పెట్టి పై కెగిరి హాని కలిగించును. ఇటుల ఏడుసార్లు చేసిన శుద్ధియగును.

ఇటుల శుద్ధిచేసిన వంగమును ఇనుప బాణలిలోవేసి కరగబెట్టి అందులో చింతబెరడు చూర్ణము, రావిబెరడు చూర్ణము, ఉత్తరేణి చూర్ణము, తంగేడు చూర్ణము ప్రతిది వంగమునకు నాల్గవపాలు గ్రహించి బాణలిలో కొంచెము కొంచెముగ వేయుచు ఇనుప గరిటెతో రాచుచుండిన ఒక జాములో పొడియగును. దానిని గ్రహించి వంగమునకు సమతూకము తాళక చూర్ణమును కలిపి నిమ్మపండ్ల రసముతో నూరి ప్రమిదలోనుంచి సీలుచేసి 50 పిడకలతో పుటము వేయవలెను. ఇటుల తాళకము కలిపి పది పుటములువేసిన భస్మమగును.



ప్రమాణము 2 గురిగింజల నుండి 4 గురిగింజల వరకు తేనె, నేయి అనుపానముతో సేవించవలెను.

ప్రమేహము, పాండురోగము, పీనసము పూయ మేహము వీనిని పోగొట్టును. ఉదరమును, పేగులను శుభ్రపరచును. బలమును కలిగించును, మూత్రమును ధారాళముగ వెడలచేయును.

త్రివంగభస్మము

శుద్ధిచేసిన నల్లసీసము, శుద్ధిచేసిన తగరము, శుద్ధిచేసిన నాగము ప్రతిది ఒక్కొక్క పలము గ్రహించి మూటిని చేర్చి కరిగించవలెను. కరుగునప్పుడు కొద్దిగ బంగిఆకు వేసి కలియబెట్టుచుండవలెను. మూడుజాములు గంజాయి ఆకు వేస్తు కలుపుతుండవలెను. బంగారు వర్ణముతో భస్మమగును

ఇది సంకరరోగములను నివారించును, ప్రమాణము అనుపానము వంగభస్మము వలెనే,

తామ్రభస్మము

శుద్ధి క్రమము : సైంధవలవణమును నిమ్మరసమున నూరి తామ్రమునకు పట్టించి యెండబెట్టి గాఢాగ్నియందు కాల్చి కల్లిలో వేసిన శుద్ధియగును. ఇటుల 8 సార్లు చేయవలెను,

ఇటుల శుద్ధిచేసిన తామ్రమును పలచని పత్రములుగ చేసి దానికి రసగంధక కజ్జలిని నిమ్మపండ్ల రసమున నూరి పట్టించి యెండించి ప్రమిదలో నుంచి సీలుచేసి గజపుటము వేయవలెను. ఇటులనే పది పుటములు వేసిన భస్మమగును

ఒక గురిగింజ ప్రమాణము సేవించవలెను శోఫ, పాండు, కామెర్ల, శ్వాసకాసలు, గుల్మము, శూలరోగములు ఇవి నివారణయగును మంచి ఆకలిని కలిగించును దగ్గులకు భస్మమును: త్రికటు చూర్ణముతో కలిసి వేడినీళ్ళ అనుపానముతో సేవించవలెను.

మరియొక విధము

తామ్రమును చింతాకువలె రేకులుగ సలగగొట్టి పోగాకు సమూలం దంచి రసంతీసి రేకులను నిప్పున కాల్చి యారసమున నుంచి

కొత్తవలెను. అనుకేర్ల పొగాకు రసమును ఒక మట్టిపాత్రలో పోసి ఒకపలం తామ్రరేకులను పాత్రలోవేసి రసము ఇగురునంతవరకు కాచి దించుకొనవలెను. తర్వాత దానిమీదనెర్రపట్ట తెలగా కాలునంత కాయవలెను మారి దాని మధ్యను తామ్రమునుంచి మూసి ప్రమిదలో నుంచి శీలుచేసి యేడు పిడకలతో పుటంవేసిన భస్మమగును.

రజత భస్మము

శుద్ధి విధానము మంచి వెండిని పల్చని రేకులుగ చేయించి నిప్పులో బాగా కాల్చి తైలము తక్రము గోమూత్రము వీని యందు ప్రత్యేకముగ యేడేసిమార్లు ముంచిన శుద్ధియగును.

శుద్ధిచేయబడిన ఆ వెండి రేకులకు మూడవ వంతు తాళకమును నిమ్మరసమున నూరి పట్టించి యెండించి ప్రమిదలోనుంచి శీలుచేసి 100 పిడకలతో పుటము వేయవలెను. ఇటుల తాళకమును తేర్చుచు పదకొండు పుటములువేసిన భస్మమగును.

మరియొక విధము

వెండిని పలచగ రేకులుగ కొట్టి పొగడపూల రసములో ఆ రేకులను కొలిమిలో కాచి యీ రసమున ముంచవలెను. ఇటుల 21 మారులు చేయవలెను.

తర్వాత హేమమాక్షికమును, ఇంగిలీకమును కలిపి నిమ్మరసమున మర్దించి యీ వెండిరేకులను పూసి యెండించి ప్రమిదలో నుంచి సీలుచేసి 4పిడకలతో పుటము వేయవలెను. ఇటుల 25 ~~మారులు~~ పుటము వేయవలెను. అప్పటికి భస్మమగును.

ఇంకొక విధము

శుద్ధమైన వెండి రేకులను మూకుటిలోవేసి రేకులకు మూడవ వంతు స్వర్ణమాక్షికము, ఇంగిలీకము చూర్ణించి రేకులకు క్రిందను మీదను పోసి మూకుడు మూసి శీలుచేసి 100 పిడకలతో పుటము వేయవలెను. ఇటుల 6 పుటములు వేసిన భస్మమగును.

2 గురిగింజ ప్రమాణము నేయి తేనె అనుపానము.

ఇది కామెర్లు, కఫము, కాసము, పాండు, శోఫలు, గుల్మోదరములు వీనిని పోగొట్టును, మరియు బలమును కలిగించును మంచి



ఆకలిని కలిగించును, సంపర్కశక్తి నిచ్చును, మరియు శుక్లనష్టమునకీ క్రింది విధముగ సేవింపవలెను.

రజతభస్మము, స్వర్ణవంగము, వమగపల్లేరు, తవాక్షీరి, పిప్పలి చూర్ణము, జాజికాయ, పచ్చకర్పూరము వీనిని సమభాగములు గ్రహించి కలియనూరి పూటకు 5 గురిగింజల నుండి 10 గురిగింజల వరకు పటికబెల్లము కాలు తులము కలిపి పుచ్చుకొని మంచి నీళ్లు త్రాగవలెను.

స్వర్ణ భస్మము

మంచి బంగారపు రేకులను కాల్చి నువ్వులనూనె, పులిమజ్జిగ, ఉలవకట్టు, ఆవుపంచితం వీనిలో ప్రత్యేక ప్రత్యేకముగ ఏడుమార్లు వేసిన శుద్ధియగును. మరియు సైంధవలవణమును నిమ్మకాయ రసములో నూరి రేకులకు పూసి ఏడుతడవలు కాల్చినను శుద్ధియగును. లేక కావిరాతిని నిమ్మపండ్లరసముతో నూరి బంగారపు రేకులకు పట్టించి కాల్చవలెను. ఇటుల ఏడుమార్లు చేయవలెను. (ఇందులో ఏదైనను చేయవచ్చును)

ఎఱ్ఱగావుండే ముండ్లతోటకూర నూరి పట్లముచేసి బంగారు రేకులనందునుంచి పైగ మూసి యెండనిచ్చి చిన్నకుండలో నుంచి శీలమన్ను చేసి గజపుటము పెట్టిన భస్మమగును. ఇటుల పదిమారులు చేయవలెను

మరియొక విధము

బంగారు రేకులను గ్రహించి దానికి నాల్గవభాగము రసభస్మమును నిమ్మపండ్లరసముతో నూరి రేకులకు పట్టించి యెండించి మూకిటిలో నుంచి శీలమన్నుచేసి యెండనిచ్చి గజపుటము వేయవలెను. మూకిటిలో రేకులపైనను క్రిందను గంధకము పొడిచేసి వేయుట మంచిది. ఇటుల రసభస్మమును బంగారును కలిపి నిమ్మరసముతో నూరి 8 గజపుటములు వేసిన భస్మమగును

భస్మమును అర్ధ గురిగింజ నుండి 1 గురిగింజవరకు తేనెతో తీసికొనవలెను

ఈ భస్మము రాజయక్ష్మను, విషవికారములను పోగొట్టును,

క్షయకు భస్మము ఒకటి॥ పదహారు తు॥ పిప్పళ్ళచూర్ణము అర తు॥ లవంగాల చూర్ణము 1 తు॥ తిప్పసత్తు 1 తు॥ శీమరబాహీర 1 తులం వీని నన్నిటిని కలిపి పూటకు 12 గురిగింజలయెత్తు మేక పాలతో పుచ్చుకొనవలెను.

ఇంద్రియ పుష్టికి: స్వర్ణభస్మం ఒక గ్రెయిను, కస్తూరి అర గ్రె. జాజికాయ చూర్ణము 2 గురిగింజలయెత్తు, జాపత్రి 2 గు॥ కు॥ ఏలక్కాయలు 2 గు॥ సఫేదాముస్లి 4 గు॥ సీటకోనిల విత్తులు 2 గు॥ లవంగాల చూర్ణము 2 గు॥ పిప్పళ్ళ చూర్ణము 2 గు॥ కుంకుమ పువ్వు అర గు॥ వీటన్నిటిని కలిపి రెండు మోతాదులు చేసి దినమునకు రెండుపూటలు సేవించవలెను.

### పగడభస్మము

పగడములను పలుకులుగచేసి పుల్లటి పెరుగులో ఒక దినము నానవేసి మరుదినము కడిగి యెండించిన శుద్ధి. లేక నిమ్మరసములో 1 దినము నానవేసి యెండించినను శుద్ధియగును.

శుద్ధిచేసిన పగడ చూర్ణమును జిల్లేడుపాలలో మూడు దినములు నానబెట్టి యెండించి గజపుటమువేసిన భస్మమగును. మరల నిమ్మపండ్ల రసముతో నూరి నాలుగు పుటములు వేయవలెను.

లేక ఒక కుండలో బాకుడుసున్నాలందుంచి సగముపోసి దానిపై పగడపు తునకలుబెట్టి పైన పలుగగొట్టిన బాకుడు వేసి కుండను మూసి శీలమన్నుచేసి యెండించి మూడు పుటంవేసిన భస్మమగును.

ఒక గురిగింజనుండి రెండున్నర గురిగింజ వరకు నేతిలోగాని, తేనెలోగాని సేవించిన కఫమును పోగొట్టును. కాస, శ్వాసము, క్షయ, రక్తపిత్తము ప్రదరములు, శూలలు వీనినికూడ పోగొట్టును.

ప్రయోగములు నాకుడు చూర్ణముతో పుచ్చుకొనిన మేహ సంబంధముగ నేర్పడిన దగ్గులు మానును.

తాళిసపత్రి చూర్ణముతో పుచ్చుకొనిన ఉష్ణము హరించును. ఖండాది చూర్ణముతో సేవించిన వాంతులు, కడుపులో మంటలు పైత్యవికారములు మానును.

క్షయకు సితోపలాది చూర్ణముతో కలిపియిచ్చిన మానును.



తమలపాకు రసముతో సేవించిన కఫమును ఖండించును.

తులసియాకు స్వరసముతో సేవింప జేసిన పిల్లలకు కలుగు గొంతు గొరగొరలు మానును.

### శృంగి భస్మము

దుప్పికొమ్మును చిన్నచిన్న ముక్కలుగ జేసి మూకుళ్ళలో వేసి గజపుటము వేయవలెను. తర్వాత దానిని కలబంద రసముతో నూరి బిళ్ళలుచేసి బాగా యెండబెట్టి తిరిగి గజపుటము వేయవలెను. ఇటుల చేసిన భస్మమగును. ముక్కలుండిన నూరి వస్త్రగాళితము చేసి భద్రపరచవలెను.

### ఇంకొక విధము

లేక దుప్పికొమ్మును చిన్నచిన్న ముక్కలుచేసి అపామార్గ మూలికను నూరి కవచముచేసి యెండబెట్టి మూరెడు గుంటతీసి పుటము వేయవలెను. భస్మమగును.

### మరియొక విధము

పుటపు గుంటలో సగము పిడకలు పరచిన తర్వాత ముదిరిన జిల్లేడాకులను పరచి దుప్పికొమ్ము ముక్కలను ఆకుకు ఒక్కటి చొప్పున నుంచి అందుపై ఆకులను మూసి అపైన పిడక లొక వరసబెట్టి తిరిగి ఆకులు పరచి ముక్కలనుబెట్టి యిటులనే వరుసగా చేయుచు గజపుటము వేయవలెను. చల్లారిన తర్వాత పిడకలను జాగ్రతగ తీయుచు దుప్పికొమ్ము ముక్కలను తీయవలెను. అవి తెల్లబడి యుండును. మరల కలబంద రసముతో నూరి పుటము వేసిన భస్మమగును.

ఒకటిన్నర గురిగింజ యెత్తునుండి 4 గురుగింజల వరకు తేనెలో పుచ్చుకొనవలెను. వాయువులు, రొమ్మునొప్పి, కడుపు నొప్పి హరించును. చక్కెర అనుపానముతో పుచ్చుకొనిన పిత్త సంబంధ వాయువులు, శరీరమున కలుగు నొప్పులు తీరును. మరియు వెన్నతో పుచ్చుకొనిన పూయమేహము నివారణమగును. వాతమును కలిగించునట్టి వస్తువులను వర్జింపవలెను.

### లవణ భస్మము

| | | | |
|---|---|---|---|
| ఇందుప్పు | 1 పలం | పటిగారం | 1 పలం |
| పిట్లుప్పు | 1 పలం | కల్లుప్పు | 1 పలం |
| వెలిగారం | 1 పలం | | |

ఈ అయిదింటిని నిమ్మపండ్ల రసముతో నాలుగు జాములు మర్దించి బిళ్ళలుచేసి యెండబెట్టి మూకుడులో నుంచి శీలుచేసి పుటము పెట్టవలెను. పిదప దానిని కుంపిటాకు రసముతో ఖల్వమున రెండు జాములు నూరి బిళ్ళచేసి యెండించి 5 పిడకలతో పుటము వేయవలెను.

పిదపను ముల్లంగిరసముతో రెండు జాములు నూరి బిళ్ళలు చేసి యెండించి ప్రమిదలో నుంచి శీలుచేసి 10 పిడకలతో పుటము వేయవలెను. అపుడు భస్మమగును.

8 గురిగింజల యెత్తు భస్మమును తేనెలో పుచ్చుకొనిన గర్భస్థ వాతములు హరించును.

కలిగాచి చూర్ణముతో కలిపి పుచ్చుకొనిన సూతక వాతములు, శూలలు, సెగగట్లు, శరీరపు నొప్పులు, పోట్లు ఇట్టివి మటుమాయమగును.

### తాళక భస్మము

తాళకమున రెండు విధములు గలవు. పత్రతాళకము, పిండ తాళకమని. ఇందులో పత్రతాళకము ఔషధమునకు శ్రేష్టమైనది. ఇది బంగారువన్నె కలిగియుండును.

ఈ పత్రతాళకమును పలచగచేసి బూడిదగుమ్మడి రసముతో డోలాయంత్రమున నొకరోజు వండిన శుద్ధియగును.

మరియు ఒకపలం తాళకమును పలచగచేసి పెద్ద ప్రమిదలో నుంచి వేపాకు రసముపోసి 8 జాములు వండిన శుద్ధియగును.

శుద్ధిచేసిన తాళకమును నిమ్మపండ్ల రసముతో నూరి బిళ్ళలు చేసి యెండబెట్టి ప్రమిదలో నుంచి శీలుచేసి పుటం వేయవలెను తర్వాతను వేపాకు నూరి కవచమిచ్చి 6 పిడకలతో పుటము వేసిన భస్మమగును.



### మరియొక విధము

శుద్ధిచేసిన తాళకమును కాకరాకు రసమున నూరి బిళ్ళలు చేసి ఎండించి కుండలో బిళ్ళలనుంచి క్రింద మీద మోదుగక్షారము పోసి రెండు దినములు కమలాగ్నిగ వండిన భస్మమగును.

అర్థ గురిగింజనుండి 2½ గురిగింజ ప్రమాణం తేనె నెయి అనుపానముతో సేవించిన కుష్ఠ, శ్వాసకాసము, జ్వరము ఇవి హరించును.

తానుగవేరు చెక్కచూర్ణం 1 తులం ముదిరిన వేపవేరు చెక్కచూర్ణం 1 తు॥ కర్పూరశిలాజిత్తు భస్మము 1 తు॥ వాయువిడంగాచూర్ణం 1 తు॥ తాళకభస్మం 1 తు॥ వీటన్నిటిని కలిపి నూరి పూటకు అర తులం చూర్ణం సమం పంచదార కలిపి పుచ్చుకొనిన కుష్ఠము నయమగును.

తిప్పసత్తు 1 తులం ముదిరిన వేపవేరు చెక్కచూర్ణం 1 తులం తాళకభస్మం అర తులం కలిపి నూరి అర తులం చొప్పున తేనెతో పుచ్చుకొనిన సకల విషములకు పరిహారమగును.

కుంపటిలో నిప్పుపోసి అభ్రకపు రేకు నుంచి ఆ రేకుపై శుద్ధిచేసిన తాళకము నుంచి పైన మరొక రేకు మూసి నిప్పుచేసిన తాళకము కరుగును. అంతయు కరిగినపిదప దింపుకొనవలెను. తాళకము సింధూరవర్ణము కలిగియుండును దానిని పొడిచేసి యుంచుకొని అర్థ గురిగింజ నుండి 1½ గు॥ యె॥ కర్పూరాది చూర్ణముతోగాని, తాళీసాది చూర్ణముతోగాని పుచ్చుకొనిన కాసము తగ్గును. కఫమును వెంటనే కరిగించును.

చాలామంది వైద్యులు ఈ పద్ధతిని వాడుచున్నారు.

### కర్పూర శిలాజిత్తు భస్మము

కర్పూరశిలాజిత్తు ముక్కలుగ పగులగొట్టి సున్నపు తేట నీరులో ఒకరాత్రి నానవేసిన శుద్ధియగును.

శుద్ధిమైన శిలాజిత్తును కుండలో నుంచి అందు నాలుగు భాగము లధికముగ కలబందరసము పోసి శీలుచేసి 100 పిడకలతో

పుటము వేసిన భస్మమగును. మరల కలబంద రసముతో నూరి బిళ్ళలుచేసి యెండించి పుటము వేయవలెను. అపుడు శుద్ధ భస్మమగును.

2 గురిగింజ నుండి 4 గురిగింజ ప్రమాణము తేనె, నేతులతో సేవించవచ్చును.

మూత్రకృచ్ఛ్రమును పోగొట్టును, ఉష్ణమును శమింపజేయును.

నేల ఉసిరిక రసముతోగాని, కలబందరసముతోగాని సేవించిన గనేరియా నయమగును.

వెన్నతోగాని, నేతితోగాని పంచదార కలిపి సేవించిన మూత్రము చురుకు, మంట ఇట్టివి శమించును.

ఆమలగంధక భస్మము

నెల్లికాయ గంధకమును చిన్న పెంగబిడ్డల మూత్రములో నానవేసి మొదట శుద్ధి చేయవలెను. తర్వాత బూడిదగుమ్మడి రసములో నానవేసి శుద్ధి చేయవలెను. మూడవసారిగ చెంకురసములో శుద్ధి చేయవలెను.

శుద్ధిచేయు విధము ఒక కుండలో చిన్నబిడ్డ మూత్రము పోసి దానికి గుడ్డను వాతిగాకట్టి ఆ గుడ్డపైన గంధకము నుంచి పైన మరొక కుండను బోర్లించి సందులేకుండ మూసి శీలమన్ను చేసి యెండించి గుంటతీసి యిందాకొండను పెట్టి 40 పిడకలతో (పెద్దవి చిన్నవైన 60) పుటము వేయవలెను. గంధకము కాలి మణులవలె కుండలోకి దిగును. దానిని కడిగి తీసికొనవలెను.

ఇటుల శుద్ధిచేసిన గంధకమును ఖల్వమున ఒక పలం గంధకం వేసి నల్లకోడియొక్క గ్రుడ్లలోని తెల్లసొనతో చేయి తగలకుండ మూడుదినములు మర్దించి యెండించిన భస్మమగును.

ఈ భస్మమును అర గురిగింజ యెత్తు తేనెతో సేవించిన మేహ సంబంధమైన సకల రోగములు మానును.

విరియాల చూర్ణముతో కలిపి సేవించిన అండము దిగుట, యెక్కుట, పోటు ఉబ్బు మానును.

ఫరంగిచెక్క చూర్ణముతో పుచ్చుకొనిన మేహ వ్రణములు మానును.

[illegible] గంధక భస్మం, తెల్లజిల్లేడు పాలలో కలిపి 1 ప. [illegible]
[illegible] 3 4 జాములు [illegible] [illegible]
[illegible]

[illegible]



జీలకర చూర్ణముతో పుచ్చుకొనిన పైత్య రోగములు హరించును.

మరియు పై వస్తువుల లేహ్యముతో పుచ్చుకొనిన వీర్యవృద్ధి కలుగును.

ముత్యభస్మము

ఇందులో ఆణిముత్యము, సోగముత్యములని రెండువిధములు.

మంచి ముత్యములను గుడ్డలో మూటగట్టి అవిశాకు స్వరసములో దోలాయంత్రమున మూడు గంటలు స్వేదనముచేసిన శుద్ధియగును.

ఆ ముత్యములను చూర్ణించి ములకొండ్ల రసముతోగాని, ఆవుపాలతోగాని భావనచేసి బిళ్ళలు కట్టి ఎండించి ప్రమిదలోనుంచి ప్రమిదమూసి సీలుచేసి మూడు [illegible] లఘుపుటము వేసిన భస్మమగును.

అర్థ గురిగింజ యెత్తునుండి ఒకటిన్నర గురిగింజ యెత్తువరకు తేనె, నెయ్యి వీనితో సేవించిన క్షయరోగము, శ్వాసకాసము వీటిని హరించును. ఇది టానిక్కువంటిది. నేత్రములకు చలువను కలిగించును. శరీరమునకు బలమునిచ్చును.

సఫేదాముశ్లి 1 గురిగింజ యెత్తు సాలామిశ్రి 1 గు.యె. పిప్పలి చూర్ణం 2 గు యె వీనిని కలిపి కాటికలకండతో భస్మమును చేర్చి సేవించిన శుక్లనష్టము నివారణయగును.

ముత్యభస్మము అర గు యె. వంగభస్మము 1 గు యె. మకర ధ్వజసింధూరము అర గు.యె. స్వర్ణభస్మము ¼ గు.యె. కేసరిపాక 2 గు యె. శిలాజిత్తు 2 గు యె [illegible] బెలిగార భస్మము అర గు.యె. వీటన్నిటిని కలిపి నూరి దినమునకు రెండుపూట్ల ఉదయం సాయం కాలం అందు తేనెతో సేవించిన క్షయరోగము నివారణయగును.

కవ్వీర భస్మము

ఒక పలము కవ్వీరమును ఖల్వమున నుంచి అడవి ఆముదపు చెట్టు పాలతో నాలుగు జాములు మర్దించి, కమ్మరాకు రసముతో రెండుజాములు మర్దించి బిళ్ళచేసి బాగా యెండించి మూకుడులో నుంచి సీలుచేసి రెండు పిడకలతో పుటము వేయవలెను. భస్మమగును.

పట్టి స్వభావముగలది. కడిగినప్పుడు కరిగిన భాగము నీళ్ళతో కలిసి పోవును. ఇటులనే శుద్ధిచేయవచ్చును. తగినంత నిమ్మరసము పోసి గవ్వలనందువేసి ఎండలో పెట్టిన రసము ఇంకిపోవును. అప్పుడు శుద్ధి యగును,

శుద్ధము చేయబడిన గవ్వముక్కలను నిమ్మపండ్లరసములో నూరి బిళ్ళలుచేసి ఎండించి గజపుటము వేయవలెను, రసము ఎక్కువైన బిళ్ళలుచేయుట కష్టమగును, పలుకులను తీసివేయవలెను, వానిని నిమ్మరసముతో నూరి పుటము వేయవలెను,

ఒక గురిగింజ నుండి ఒకటిన్నర గురిగింజ వరకు వాడవచ్చును,

కడుపుశూల, గుల్మోదరములను హరించును, చెవిపోటు, చెవిదిమ్ము, చీముదూరు 1 గురిగింజయెత్తు భస్మమును చెవిలోపోసి పది చుక్కలు నిమ్మరసము పోసిన పొంగును, పొంగగనే తుడిచివేయవలెను,

భాస్కరలవణములో సేవించిన కడుపు సంకటములు తీరును,

స్వర్ణమాక్షిక భస్మము

ఈ మాక్షికమును ముక్కలుచేసి ఇనుపబాణలిలో ఎర్రబడువరకు కాల్చి త్రిఫలాకషాయమునను, నిమ్మపండ్ల రసములలో వేసి శుభ్రపరచిన శుద్ధియగును,

గంధకమును తగుమాత్రము స్వీకరించి దానిమ్మపండ్ల రసములో నూరి యందు శుద్ధిచేసిన మాక్షికమును కలిపి నూరి బిళ్ళలుచేసి యెండించి మూకుళ్ళలో పెట్టి శీలుచేసి 6 వరాహపుటములు వేసిన భస్మమగును,

ఈ భస్మమును బాణలిలోవేసి ఎర్రగ నగువరకుకాల్చి ఆముదము, సైంధవలవణము, ఆవునేయి, దానిమ్మరసము వీనితో ప్రత్యేక ప్రత్యేకముగ వేయించిన స్థిరమగును,

ఇది 1 గురిగింజ నుండి 2½ వరకు తేనెతో సేవించిన పాండు కామిలా, నోటిపూత క్షయము వీనిని హరించి బలములుకలిగించును

భస్మ ప్రకరణము సమాప్తము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

## రసౌషధ ప్రకరణము

లోహములు, పాదరసము, రసోపరసములు చేర్చి తయారు చేయబడు ఔషధములకు రసౌషధములని పేరు, శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము కలిపి నూరిన దానిని, కజ్జలియని పేరు,

భస్మములతో మూలికా ద్రవ్యములను చేర్చవలసి వచ్చినప్పుడు మూలికలను శుద్ధముచేసి యెండించి చూర్ణముచేసి వస్త్రగాలితమైన వానిని కలిపి నూరవలెను,

మరియు పచ్చిమూలికలను చేర్చవలసిన యెడల వానిని కల్కముగ నూరి కలుపుకొనవలెను,

ఎండు మూలికలలో వేయించవలసిన వస్తువులను వేయించి చూర్ణించి వస్త్రగాలితముచేసి కలుపుకొనవలెను,

నేపాళవిత్తులు కలుపవలసినచో శుద్ధిచేసినూరి కలుపవలెను,

నాభి, ఉమ్మెత్తవిత్తులు కలుపవలసిన యోగములలో నిమ్మపండ్ల రసములో మెత్తగనూరి పిదప కలుపవలెను,

తాళకము మణిశిల కలుపవలసినచోట ద్రవ్యములను శుద్ధిచేసి కలుపవలెను,

ఇంగువను చేర్చవలసినచో చిన్నముక్కలుగచేసి నేతితో వేయించి కలిపి నూరుకొనవలెను, గుగ్గిలము చేర్చవలసినప్పుడు శుద్ధిచేసి తేనె, నేయి వీనితో నూరి కలుపుకొనవలెను,

ఔషధములను తయారుచేయునపుడు ఆ యా వాటిని సమముగ తూచి వేసికొనవలెను.

ఔషధములలో కలుపుటకు తీయబడు రసము పండ్ల చర్మము తగులని విధమున రసము తీసికొనవలెను. చర్మము తగిలిన రసము చేదెక్కును. నిమ్మ, నారింజ వీని రసములను చర్మరసము రాకుండ తీసికొనవలెను.

ఆయా రోగములందు చెప్పబడిన విధమున నూరుటకు చాల ముఖ్యము, దీనికే మర్దనయని యందురు

భావన యనగా నానబెట్టుట, నూరుట, ఎండలోగాని, నీడను గాని, ఔషధ వస్తువులు మునుగునటుల రసమును పోసి యుంచుట.

రోగములో చెప్పబడిన ప్రకారము భావన మర్దన అయిన తర్వాత ఔషధము చేతి కంటుకొనుచుని చేతికి నేయి రాసుకొని మాత్రలు చేయుటకు పూనుకొనవలెను, మాత్రలు చేయుటకు వాని వాని ప్రమాణమునకు దగినటుల అచ్చులు చేసికొనిన మాత్రలు తేలికగ చేసికొనవచ్చును

అల్లపురసములు చేర్పవలసినప్పుడు అల్లమును దంచి రసము తీసి, అడుగున చేరునట్టి సున్నమును వదలి రసమును వడియబోసి కలుపుకొనవలెను.

ఆనందభైరవ రసము

| | | | |
|---|---|---|---|
| తు॥ పాదరసం | 1 పలం | జాజికాయ | 1 పలం |
| తు॥ నాభి | 1 పలం | పిప్పళ్ళచూర్ణం | 2 పలం |
| తు॥ గంధకం | 1 పలం | | |

ఈ పై వస్తువులను ఖల్వములో నుంచి కర్పూరాకుల రసముతో రెండుజాములు మర్దించి తర్వాత అల్లపురసముతో ఒకజాము మర్దించి గురిగింజ ప్రమాణము మాత్రలుచేసి నీడ నెండించి భద్రపరచవలెను.

అల్లపు స్వరసముతో ఒకమాత్ర సేవించిన వాతజ్వరం, పైత్య జ్వరం, శీతజ్వరం, జ్వరాతిసారములు, అజీర్ణభేదులు, పైత్యమువలన గొంతులో కలుగునట్టి గొరగొరలు కఫలు, కడుపు రొమ్ము నొప్పులు ఇట్టివి నివారణయగును.



శిరోక విధము

| | | | |
|---|---|---|---|
| తు॥ ఇంగిలీకం | 1 పలం | శొంఠి | 1 పలం |
| తు॥ నాభి | ,, | సన్న పిప్పళ్ళు | ,, |
| తు॥ వెలిగారం | ,, | మిర్యాలు | ,, |

వీనిని ఖల్వమున నుంచి నిమ్మరసముతో 4 జాములు మర్దించి మిర్యాలంత మాత్రలు చేసి నీడ నెండించి భద్రపరచవలెను.

మిర్యాల కషాయముతో ఒక మాత్ర పుచ్చుకొనిన జలుబు, జ్వరములు, మందజ్వరములు, వాయువులు హరించును, అవంగ మొగ్గలు మూడు మాత్రలను ఒకటిగా కలిపి తమలపాకులోచుట్టి నోటవేసుకొని నమిలి మ్రింగిన కంఠమున కలుగు గొరగొరలు, నొప్పులు శైత్యము నివారించును.

సన్నరాష్ట్రిం, మిర్యాలు, అక్కలకర్ర వీనిని సమం గ్రహించి నలియగొట్టి కషాయముబెట్టి 1 మాత్ర చాది కషాయములో సేవించిన శిరోభారము మానును.

ఈ మాత్ర చనుబాలతో చాది కంటికి కలికము వేసికొనిన శిరోభారము, మైకము, నేత్రరోగము, జ్వరదోషములు నివారణ యగును.

ఆనందభైరవి

| | | | |
|---|---|---|---|
| తు॥ పకొంద ఇంగిలీకము | 1 తులం | మిర్యాల చూర్ణము | 1 తు |
| తు॥ నాభి | ,, | మడ్డి వెలిగార భస్మము | 1 తు |
| తు॥ త్రికటుచూర్ణము | ,, | పిప్పళ్ళచూర్ణము | 1 తు |

మొదట ఇంగిలీకమును నిమ్మపండ్ల రసముతో నూరిన తర్వాతను నాభినివేసి కలియనూరి పిదప ఇతర వస్తువులను ఒకటొకటే వేసి నూరవలెను. నిమ్మరసముతో భావనచేయవలెను. ఎంత ఎక్కువ కాలము మర్దించిన నంతగుణకారి.

1 నుండి $1\frac{1}{2}$ గురిగింజ ప్రమాణము పుచ్చుకొనిన సకల జ్వరములు హరించును. అతిసారము కఫపిత్త వికారములు పోఁడచును,

దోష జ్వరములకు అల్లపు స్వరసముతో సేవించవలెను.

విరేచనములకు కొడిశపాలవిత్తులు, దాల్చినచెక్క జిలకర వీని కల్కము దీని పొంగించి దానిలో మందుకలిపి యీయవలెను.

జ్వరములో కలుగునట్టి శరీరనొప్పులకు ధనియాలు, వీర్యాలు, పర్పాటకము, దాల్చినచెక్క, తిప్పతీగ వీని కషాయములో మందును కలిపి సేవించిన తప్పక నయమగును.

### కర్పూర రసము

హింగుళం, కర్పూరం, తుంగదుంపలు, జాజికాయ, కొడిశపాలు యివి సమభాగాలు చన్నీటితో బాగా మర్దించి చిరికంది గింజంత మాత్రలు వాడిన క్రూరాతి జ్వరాతి సారాతిసార గ్రహణులకు చక్కగా పనిచేయును.

### తారకేశ్వర రసము

అభ్రకం, వంగం, లోహం రససింధూరము కాంతం, యివి సమాంశాలు తేన మేడిపండ్ల కషాయం పిట్లతో మర్దించి గురిగింజంత మాత్రలుచేసి యుక్తానుపానములతో వాడుచుండిన బహుమూత్ర వ్యాధులకు బాగుగా పనిచేయును.

### అపరసుందరిరసం

రసం, గంధకం, నాభి, లోహం త్రికటుకలు, త్రిఫలాలు, చాతుర్జాతకములు, రేణుకలు, నేలచప్పిడిచెట్టు, వాయువిడంగాలు, తుంగదుంపలు యివి సమభాగాలు చూర్ణించి చూర్ణమునకు రెండు వంతులు పాతబెల్లం కలిపి మర్దించి శనగగింజంత మోతాదులు వాడిన అపస్మారములు, సన్నిపాతములు, కాస శ్వాసలు, వాత వ్యాధులు, పైత్యభ్రమలు హరించును.

### వంగేశ్వరరసం

అభ్రకం, కాంతం, వంగం, తంగేడుపువ్వు ఇవి సమాంశాలు చూర్ణించి ఆ చూర్ణమును కలబంద రసంతో 6 దినాలు ద్రాక్ష కషాయంలో 4 దినములు లెస్సగా మర్దించి గురిగింజంత వాడుచుండిన వింశతిమేహములు, స్త్రీల ప్రదరములు, అశ్మరులు, హరించును.



### రఘుసూర్యావర్తి

హేమమాక్షిక భస్మము అభ్రకం, టంకణం, తిప్పసత్తు, కాకిదొండగింజలలోని పప్పు, నైడిపత్తి గింజలలోని పప్పు, ముత్యముల భస్మం, యివి సమాంశాలు అల్లం, నిమ్మద్రాక్ష, రసముతో లెస్సగా మర్దించి గురిగింజ ప్రమాణం మాత్రలు వాడుచుండిన హిక్కలు, కాసలు, శ్వాసలు, ఛర్దులు, ఆమ పైత్యవికారములు, పైత్య వికారములు అరోచకములు నివారించును.

### రజతభూపతిరసము

| | | | |
|---|---|---|---|
| సరిగపాండిపొడి | 2 పలములు | ఉప్పుకట్టు | 1 పలం |
| శు॥ పాదరసం | 1 పలం | శు॥ గంధకం | ½ పలం |
| శు॥ కాంతం | 1 వ. ము. | శు॥ తాళకం | ,, |
| శు॥ శంఖం | ½ పలం | శు॥ పల్లసీసపిండూరం | ,, |

వీనిని ఒక టోకటిగ వేసి తుంగ పిచ్చుకతో 4 జాములు మర్దించి బిళ్ళలుచేసి దొండబెట్టి ప్రమిదలో నుంచి సీలుచేసి 10 పిడకలతో పుటంవేసి తీసికొని పిదప ఖల్వములో నుంచి చనుబాలతో నూరవలెను. అపుడు కస్తూరి 1 వ. ము, కుంకుమపువ్వు 1 వ. ము, గోరోజనము 1 వ. ము. వేసి మర్దించవలెను. పిదప కుప్పెలుచేసి ఎండించవలెను, ఎండిన తర్వాతను సాంబ్రాణి ధూపము వేయవలెను, కాలు గురిగింజయెత్తు తేనెలో చాది పుచ్చుకొంటె సూతవాతము, క్షుద్రవాయువులు, ఆనందవాయువులు, జ్వరగడ్డలు, మేహవాతము హరించును, చనుబాలతో యిచ్చిన సన్నిపాతము హరించును.

### చండమార్తాండరసము

| | | | |
|---|---|---|---|
| ఉప్పుకట్టు | కాలు పలం | శు॥ గంధకం | కాలు పలం |
| శు॥ శంఖపాషాణము | ,, | తాళకభస్మం | ,, |
| తారి భస్మం | ,, | వ్యాదాకుకెంగ | ,, |
| కాంత సింధూరము | ,, | రసభస్మం | ,, |

వీనిని ఖల్వములో కలియనూరి కాసికుప్పె కెక్కించి వాలుకాయంత్రమున నాలుగు జాములువండి చల్లార్చి కుప్పెలోని ఔషధమును బాగుగా మెత్తుకొని భద్రపరచవలెను. నియ్యాపు గింజలో

రసము మూడువంతు తేనెతో కలిపి సేవించిన విషజ్వరములు, సన్ని పాతము, వంతు జ్వరములు పోవును. చనుబాలు, త్రికటు కషాయములు కూడా ఇందుకు అనుపానములు

### లోకనాథరసము

| | | | |
|---|---|---|---|
| గవ్వభస్మం | 1 తులం | శుద్ధ రసము ఒకటికి ఎనిమిది తు॥ | |
| మండూరభస్మం | 1 తులం | శుద్ధ గంధకం | ¼ తులం |
| లోహభస్మం | 1 తులం | | |

ముందు రసము, గంధకము కజ్జలిచేసి యందు గవ్వ భస్మము, మండూర భస్మము, లోహభస్మము వీనిని వేసి తెల్ల గల్జేరు కషాయము, పల్లేరు స్వరసము, అడ్డసర కషాయము, సంబ రేణు స్వరసము, చిత్రమూల స్వరసము వీనితో ప్రత్యేక ప్రత్యేక ముగ మూడేసి దినములు మర్దన భావనలుచేసి శనగ ప్రమాణము మాత్రలుచేసి యెండించి మూకిటిలో పోసి శీలమన్ను చేసి 30 పిడ కలతో పుటము వేయవలెను. చల్లారినపిదప తీసికొని నూరి యందుకు సమము మిర్యాల చూర్ణము కలిపి కస్తూరాకురసము, అల్లపురసము, గుంటగలగరాకు రసము, వావిలాకు రసము, తోడ తరము స్వరసము, మునగచెక్క స్వరసము, త్రిఫలా కషాయము వీనితో ప్రత్యేక ప్రత్యేకముగ ఒక్కొక్కరోజు భావనచేసి గురి గింజలంత మాత్రలు కట్టవలెను.

పూటకు 1 నుండి 3 మాత్రల వరకు పుచ్చుకొనిన పాండు, కఫ, క్షయము, శ్వాసకాసలు, అస్థిగత జ్వరము, అగ్నిమాంద్యము నివారణ యగును.

క్షయకు తాళీసాది చూర్ణముతో కలిపి కాచిన మేక పాలతో సేవించవలెను.

పాండు శోఫలకు పునర్నవాష్టకముతో పుచ్చుకొనవలెను.

దీని సేవనవలన శరీరమునకు బలము కలుగును ఆకలిని కలి గించును.

### పూర్ణచంద్రోదయము

| | |
|---|---|
| శుద్ధిచేసిన బంగారు రేకు | 1 పలం |
| అష్టసంస్కారము చేసిన పాదరసము | 8 పలాలు |



| | |
|---|---|
| అష్టశుద్ధులుచేసిన గంధకము | 16 పలాలు |

మొదట పాదరసములో బంగారు రేకువేసి 3 దినములు మర్దన చేయవలెను. బంగారు పాదరసములో కలిసిపోవును. ఎన్నిరోజులు మర్దించిన నంతగుణకారి. బంగారు కలిసిపోయిన తర్వాత గంధ కము కలిసి కజ్జలి చేయవలెను. ఇటుల మూడు దినములు మర్దనచేయ వలెను. తర్వాత కలబంద, పమిడిపత్తిపూల రసములో మూడేసి రోజులు మర్దించి యెండించవలెను.

పిదప సీమగాజు కుప్పెకు సగమువరకు యీ చూర్ణముచేసి పోసి మూడు శీసాలుచేసి ఎండించి మూడురోజులు కమల గాఢా గ్నులచే వండవలెను. సాంగశీతలమైన దింపుకొని శీలలను తడిసి నమ్మళికగ తీసి కుప్పెను పగులగొట్టి లోనిద్రవ్యమును తీసికొనవలెను. కుప్పె పెంకులు పడకుండ జాగ్రత వహించవలెను. బంగారు అడుగు నను సింధూరము పైనను తేలియుండును. గంధకపిష్టము నల్లగ తేలియుండును. దానిని వర్జించవలెను. సింధూరమును బంగారమును కలిపి నూరుకొనవలెను.

అనుపానము : ఒకతులము సింధూరమునకు పచ్చకర్పూరము ఒకటికి ఎనిమిది తు॥, జాజికాయ ¼ తు, లవంగాలు ¼ తు, పిప్పళ్లు ¼ తు కస్తూరి 1-16 తులం వీనిని కలిపి వీటితో నూరి గురిగింజ మాత్రలు చేసి యెండించి భద్రపరచుకొనవలెను.

సింధూరము ¼ నుండి 1 గురిగింజవరకు, అనుపాన వస్తువులు కలిసినచో 2 నుండి 4 గురిగింజల మొత్తువరకు సేవించవచ్చును.

ఇది సర్వవిషములను హరించును. సకలవిధ జ్వరములు, ప్రమేహము, క్షయ మున్నగువానినిగూడ పోగొట్టును.

మరియు శరీరమునకు బలమును, ఇంద్రియ పటుత్వమును కలి గించును.

కట్టువిందు విషములకు సింధూరము 1 గురిగింజమొత్తు, తిప్ప సత్తు 2 గురిగింజలమొత్తు కలిపి నూరి తేనెతో సేవింపవలెను.

సర్వ జ్వరములకు త్రికటుచూర్ణము ¼ గురిగింజలమొత్తు, సింధూరము 1 గు. మొ. కలిపి నూరి తేనెతో సేవింపవలెను.

మేడిచెక్క కషాయముతో సింధూరము కలిపి సేవించిన ప్రమేహములు నయమగును,

జలవర్ధకమునకు దినము 2 గురిగింజల మెత్తు తమలపాకుతో సేవించవలెను.

సింధూరము ¼ గు. మె. దురదగొండివిత్తులు లవంగాలు, ఏలక్కాయలు, జాజికాయ, సపెనామిరి, జాపత్రి ఒక్కొక్కటి 2 గు. మె. చూర్ణము కలిపి 2 కొన్నులు కాచిన ఆవుపాలలో వేసి పంచదార ¼ తులము కలిపి త్రాగిన వీర్యపటుత్వము కలుగును

రసభూపతి రసము

| | | | |
|---|---|---|---|
| శు॥ పాదరసము | 1 తులం | లోహభస్మము | 1 తులం |
| శు॥ గంధకము | 1 తులం | తామ్రభస్మము | 1 తులం |
| శు॥ నాభి | 1 తులం | | |

మొదట పాదరసమున గంధకమును కలిపి నూరి కజ్జలి చేయవలెను. తర్వాతను తక్కిన వస్తువులను వేసి బాగా కలియనూరి [illegible] రసముతో 3 రోజులు మర్దించి ఎండించి గాజు కుప్పెకు 7 శీలలు చేసి సమభాగము కజ్జలిని వేసి 12 జాములు సూక్ష్మాగ్నిచే వంటచేయవలెను. చల్లారిన తర్వాతను దీని ఔషధమును గ్రహించి అల్లపురసముతో నూరి కుప్పెలుచేసి నీడనెండించి యుంచుకొనవలెను.

1 గు. మె. నుండి 8 గు. మె. వరకు సేవించిన పాండుశోఫ శ్వాసకాస కఫరోగములను హరించును

త్రికటుచూర్ణముతో కలిపి పుచ్చుకొనిన ఆకలిని కలిగించును.

కలింగరాష్ట్రీము, అడ్డసరము వీని కల్కముతోను లేక కషాయముతో సేవించిన శ్వాసకాసరోగములు మాయునుగును.

చిదానందభైరవము

| | | | |
|---|---|---|---|
| శు॥ ఇంగిలీకము | 1 పలం | శొంఠిచూర్ణం | 1 పలం |
| శు॥ నాభి | 1 పలం | పిప్పళ్ళచూర్ణం | 1 పలం |
| శు॥ వెలిగారం | 1 పలం | మిర్యాలచూర్ణం | 1 పలం |
| శు॥ నేపాళవిత్తులు | 1 పలం | | |



వీనిని నిమ్మపండ్ల రసముతో 4 జాములు మర్దించి గురిగింజ ప్రమాణము మాత్రలుచేసి పూటకొకమాత్ర చొప్పున అల్లపుస్వరసముతో సేవించిన 13 విధములైన సన్నిపాతములు మానును,

సన్నిపాతభైరవము

| | | | |
|---|---|---|---|
| శు॥ పాదరసం | 1 పలం | కరక్కాయ | 1 పలం |
| శు॥ నాభి | 1 పలం | తానికాయ | 1 పలం |
| శు॥ గంధకం | 1 పలం | ఉసిరిక కాయ | 1 పలం |
| శు॥ తాళకం | 1 పలం | శొంఠి | 1 పలం |
| వెలిగారం | 1 పలం | పిప్పళ్ళు | 1 పలం |
| శు॥ ఇంగిలీకం | 4 పలములు | మిర్యాలు | 1 పలం |
| శు॥ నేపాళవిత్తులు | 1 పలం | | |

వీనిని ఖల్వములో నుంచి కచ్చూరాకు రసముతో 4 జాములు మర్దించి, అల్లపురసముతో 4 జాములు మర్దించి మిరియములంత మాత్రలుకట్టి నీడ నెండించి భద్రపరచవలెను. పూటకొక మాత్ర విధమున తులసిఆకు రసముతో సేవించిన జ్వరములు మానును, చనుబాలతో సేవించిన విషజ్వరములు మానును. తేనెతో సేవించిన శైత్యజ్వరములు మానును. మిర్యాల కషాయముతో సేవించిన వాతజ్వరములు, వాయువులు హరించును అల్లపుస్వరసముతో పుచ్చుకొనిన శైత్యవాతములు, వాంతులు, కడుపున కలుగు మంటలు, శూలలు గుల్మరోగములు, మాంద్యములు నివారణయగును,

సన్నిపాతము దోషము సంభవించినపుడు యీమాత్ర పెసలగింజ ప్రమాణం నీళ్ళతోగాని, తేనెతోగాని, చనుబాలతోగాని, తమలపాకు రసమునందుగాని చాది కంటికి కలికముచేసిన దోషములు హరించును.

బాలసూర్యోదయ రసము

| | | | |
|---|---|---|---|
| శు॥ పాదరసము | 1 తులం | లోహభస్మం | 2 తులం |
| శు॥ గంధకము | 3 తులం | నేతిలో పొంగించిన ఇంగువ | అరతులం |
| శు॥ నాభి | 3 తులం | కృష్ణాభ్రక సింధూరము | 5 తులం |
| తామ్రభస్మం | 2 తులం | మిర్యాలచూర్ణం | 16¼ తులం |

ప్రథమమున రసగంధకములను కజ్జలిచేసి దానిలో కృష్ణాభ్రక సింధూరము లోహభస్మము తామ్రభస్మము కలిపి నూరి తర్వాత క్రమముగ నాభి ఇతర వస్తువులను వేసి నూరవలెను. ఆపిదప మేడి చెక్క కషాయముతో 3 దినములు లవంగకషాయముతో 3 దినములు, అరచెక్క కషాయముతో 3 దినములు నూరి యుంచుకొనవలెను.

పూటకు రెండున్నర గురిగింజయెత్తు నుండి 5 గు. యె. వరకు సేవించిన స్త్రీలకు కలుగునట్టి ప్రదరములు, ప్రమేహములు, పాండు సంబంధ రోగములు, వీనిని పోగొట్టి ఆకలిని కలిగించును. మూత్రమును ధారాళముగ వెడలజేయును.

స్త్రీలకు కలుగు సమస్త ప్రదరములకు ఋతుశూల, ఋతుబద్ధములకు అశ్వగంధాది చూర్ణముతో సేవింపవలెను.

ధనియాలు, మిర్యాలు, శొంఠి, కషాయముతో సేవించిన జ్వరములు మానును.

త్రికటు చూర్ణము 8 తు॥ కాసీససింధూరము 1 తు॥ స్వర్ణమాక్షిక సింధూరం 1 తు॥ బాలసూర్యోదయము అర తులం కలిపి నూరి గురిగింజలంత మాత్రలు కట్టి పూట కొకటి సేవించిన కామిలా పాండు కడుపులోని సంకటములు తీరును.

మృత్యుంజయ రసము

| | | | |
|---|---|---|---|
| శు॥ వత్సనాభి | 1 తులం | మిర్యాలచూర్ణం | 1 తులం |
| మడ్డివెలిగారభస్మం | 1 తులం | మోడిచూర్ణం | 1 తులం |
| శు॥ గంధకం | 1 తులం | పిప్పళ్ళ చూర్ణం | 1 తులం |
| శు॥ ఇంగిలీకం | 12 తులం | | |

మొదట ఇంగిలీకము నిమ్మపండ్లరసముతో ఒకరోజు నూరి ఎండించి పిదప పదితులములు నీళ్ళుపోసి ఇంగిలీకము బాగా కలియునట్లు నూరిన మెరుగగును. అందుపై గంధకమును వేసి బాగా నూరవలెను. క్రమముగ నాభి, వెలిగారభస్మము చూర్ణములుకలిపి నూరి గురిగింజలంత మాత్రలుచేసి నీడ నెండించి భద్రపరచవలెను.

1 నుండి రెండు మాత్రలు సేవించిన ఆకలిని కలిగించును ఉదరమును శుద్ధిచేయును, బలము నిచ్చును.



ఉష్ణాధిక్యముచే కలుగునట్టి జ్వరములకు తులసిఆకు రసము అనుపానము, అమజ్వరములకు అల్లస్వరసము తేనె అనుపానము.

పడిశముతోకూడిన జ్వరమునకు వాముమిర్యాలు కాలు తు॥ పటిక బెల్లం అర తు॥ కషాయముతోడి 2 మాత్రలు సేవించవలెను.

పైత్యజ్వరములకు పరంగి కషాయము అనుపానము.

ఎండవేడిమిచేగాని ప్రయాణ బడలికచేగాని బద్ధక మేర్పడినపుడు పూటకు 3 మాత్రలు నీళ్ళతో అరగదీసి పంచదార కలిపి పుచ్చుకొనవలెను.

ఈ మృత్యుంజయ రసము యీ వ్యాధులకే కాక జ్వరము తగ్గిన తర్వాత కూడా శరీరము బలహీనముగ నుండినచో సేవించవచ్చును.

పంచామృత పర్పటీ రసము

| | | | |
|---|---|---|---|
| శు॥ గంధకం | 8 తులం | అభ్రకభస్మం | 1 తులం |
| శు॥ పాదరసం | 4 తులం | తామ్రభస్మం | అర తులం |
| లోహభస్మం | 2 తులం | | |

ముందు రస, గంధకములను కజ్జలిచేసి పిదప భస్మములను వరుసగ వేసి మర్దించి ఇనుపగరిట లేక ఇనుప బాండీలోగాని వేసి కరిగించి అంటియాకుపై పోయవలెను. అది నల్లగ బిళ్ళగ నగును. ఇట్లగుటనే పర్పటి యందురు. మరల దానిని నూరి భద్రపరచవలెను.

1 గురిగింజనుండి 2 వరకు తేనె నెయి అనుపానముతో పుచ్చుకొనవలెను.

ఇది క్షయము, అతిసారము, గ్రహణ్యాతిసారము వీనిని హరించును. మరియు నిది రసాయనము వంటిది బలమును వీర్యవృద్ధిని కలిగించును.

కాలాగ్ని రుద్ర భైరవం

| | | |
|---|---|---|
| పాదరసభస్మము | వైక్రాంత భస్మము | సరిగవెండి భస్మము |
| తామ్రభస్మము | లోహభస్మము | స్వర్ణభస్మము |
| ముత్యభస్మము | కాంత సింధూరము | |

ఇవి సమతూకము గ్రహించి అల్లపురసముతో 3 దినములు మర్దించవలెను. గుంటగలగరాకు రసములో 3 దినములు, చిత్రమూలరసముతో మూడు దినములు మర్దనచేసి గురిగింజ ప్రమాణము మాత్రలుచేసి యెండించి భద్రపరచవలెను.

తేనెతో, సన్నపిప్పళ్లిచూర్ణము కలిపి ఒక మాత్ర చొప్పున సేవించవలెను.

ఇది మూలరోగములు, అజీర్ణం, అన్న ద్వేషము, మేహాశాక, పాండు, కామిలా మూత్రరోగము ఇవి మానును.

### ప్రభాకర భైరవము

| | | | |
|---|---|---|---|
| శు॥ నాభి | 1 తులం | కరక్కాయ | 1 తులం |
| సైంధవలవణం | 1 తులం | నల్లజీలకర | 1 తులం |
| శు॥ తాళకం | 1 తులం | ఆవాలు | 1 తులం |
| శు॥ వెలిగారం | 1 తులం | పిప్పళ్ళు | 1 తులం |
| శు॥ గంధకం | 1 తులం | మిర్యాలు | 1 తులం |
| శు॥ పాదరసం | 1 తులం | శొంఠి | 1 తులం |
| శు॥ మనోశిల | 1 తులం | ఇంగువ | 1 తులం |
| శు॥ ఇంగిలీకం | 1 తులం | శు॥ నేపాళవిత్తులు | 6 తులం |

మొదట వస్తువులను చూర్ణముచేసికొని నేపాళవిత్తులను ఖల్వమున నుంచి కాటుకవలె నూరవలెను. దానితో చూర్ణములను నాభి మున్నగువానిని కలిపి 3 జాములు విడువక నూరుచు మైనము వలె నైనపిదప భద్రపరచవలెను.

గురిగింజ ప్రమాణము శొంఠికషాయముతో సేవించిన సమస్త జ్వరములు మానును.

కరక్కాయల కషాయముతో నిచ్చిన దగ్గు మానును.

నేతితో సేవించిన రక్తమూలము నివారణమగును.

ఆవుపాలతో పుచ్చుకొనిన మూలము నివర్తియగును.

బల్లలు కడుపున కలిగి గుండెచేవవలె నుండునట్టి గడ్డలు మహోదరములు, గర్భపాపలు వీనికి అనుపానములు అల్లపురసము, తెల్లగడ్డల తైలము, తేనె.



### సైత్యహారరసము

| | | | |
|---|---|---|---|
| నిమ్మవుప్పు | 2 తులం | శు॥ ఇంగిలీకం | 2 తులం |
| సైంధవలవణం | ,, | శొంఠిచూర్ణం | ,, |
| జీలకరచూర్ణం | ,, | పంచదార | 10 తులం |

మొదట ఇంగిలీకము నిమ్మపండ్లరసముతో మర్దనచేసి తర్వాత చూర్ణములను వేసి కలియనూరవలెను. పాకమునకు వచ్చినవెంటనే తీసి సీసాలో నుంచుకొనవలెను.

1 నుండి 3½ గురిగింజలవరకు నోటిలో వేసుకొని చప్పరించి మ్రింగవలెను.

దీని సేవనవలన నోట నీరూరుట, నోరు వికారము ఇవి శాంతించును.

నోటికి రుచిని కలిగించును. ఆకలి నిచ్చును.

### జీవకుసుమ రసాయనము

| | | | |
|---|---|---|---|
| శు॥ రసకర్పూరము | 1 తులం | శు॥ గంధకం | 1 తులం |
| మంచి గంధపుచూర్ణం | ,, | లవంగాలచూర్ణం | ,, |
| కుంకుమపువ్వు | ,, | కస్తూరి | ¼ తులం |

గంధకం, రసకర్పూరములను కలిపి నూరి పిదప కస్తూరి కుంకుమపువ్వు కలుపుకొని గంధపుచూర్ణమును (వస్త్రగాలితము చేసినది) వేసి నీటితో మర్దన చేయవలెను, గురిగింజలంత మాత్ర చేసి యెండించి యుంచుకొనవలెను.

1 నుండి 3 మాత్రలవరకు ఇది సమామేహములను చర్మ వ్యాధులు, మేహగడ్డలను, కీలుపట్లు, వాపులు వీనిని పోగొట్టును, అనుభవమున ఉపయుక్తమైనదని యెరుగబడినది.

### వసంతకుసుమాకరము

| | | | |
|---|---|---|---|
| స్వర్ణభస్మము | 2 తులం | ముత్యభస్మము | 4 తులం |
| రజితభస్మము | ,, | నాగభస్మము | ,, |
| వంగభస్మము | ,, | అభ్రకభస్మము | ,, |

| | |
|---|---|
| సీసభస్మము 8 తులం | రససింధూరము 4 తులం |
| కాంతభస్మము 8 తులం | |

వీనిలో రససింధూరము స్వర్ణ, అభ్రకభస్మములను మొదట 1 జాము మర్దించవలెను, పిదప తక్కినవానిని కలిపి ఒక దినము కలియనూరి తర్వాతను,

| | |
|---|---|
| ఆవుపాలు | కుశవేరు కషాయము |
| చెరుకురసము | పసుపు కషాయము |
| అడ్డసర కషాయము | అరటిగడ్డ స్వరసము |
| చందన కషాయము | తామరగడ్డ స్వరసము |
| వట్టివేళ్ళ కషాయము | జాజిపూల స్వరసము |

వీనితో ప్రత్యేక ప్రత్యేకముగ ఏడేసిమార్లు భావనమర్దనలు చేసి పాకమునకు వచ్చిన తర్వాత కస్తూరి పైవిరసముతో నైన పచ్చగ నూరి దీనితో కలుపుకొని మర్దించవలెను.

ఒక గురిగింజ నుండి ఒకటిన్నర వరకు నేయి, పంచదార కలిపి సేవించవలెను.

ఇది మధుమూత్రము, బహుమూత్రము, క్షయ, రక్తపిత్త, మూత్రకృచ్ఛ్ర మూత్రాఘాతకాలను పోగొట్టును, అనుపాన భేదములతో సన్నిరోగములకు వాడవచ్చును.

మరియు నిది ఇంద్రియ పటుత్వమును, దేహబలమును, కలిగించును. ఆకలిని కలిగించును.

వాజీకరణమునకు 1 తులము వసంతకుసుమాకరము 1 తు, జాజికాయ 1 తు, జాపత్రి 1 తు, లవంగములు 1 తు, పిప్పళ్ళు 1 తు, దురదగొండివిత్తుల చూర్ణము అర తు॥ గొబ్బివిత్తుల చూర్ణం కలిపి పూటకు పావుతులము చూర్ణము పటికబెల్లము కలిపి పుచ్చుకొని కాచిన ఆవుపాలు 2 కొన్నులు త్రాగవలెను. రాత్రులయందు భోజనము పిదప అర్థగంటలకు దీనిని సేవించవలెను.

క్షయకు శీతోపలాది చూర్ణము 7 గురిగింజలయెత్తు, తిప్పసత్తు ఒకటిన్నర గు. యె. వసంతకుసుమాకరము 1 గు. యె. కలిపి తేనెలోగాని మేకపాలలోగాని పుచ్చుకొనవలెను.



మేడిపండ్ల చూర్ణము తేనె కలిపి సేవించిన బహుమూత్రము నయమగును.

తారరాక్షసము

| | |
|---|---|
| రసభస్మము | అభ్రకభస్మము |
| శు॥ గంధకము | తామ్రభస్మము |
| కాంతభస్మము | ఇవి సమము |

మొదట రసభస్మమును గంధకమును కలిపి నూరుకొని పిదప మిగత భస్మములను కలియనూరి, తెల్లగలిజేరు వేళ్ళరసము, తిప్పతీగ కషాయము, తులసియాకు స్వరసము, చిత్రమూల స్వరసము, త్రికటు కషాయము వీనితో ప్రత్యేక ప్రత్యేకముగ 3 దినములు భావనమర్దనలు చేసి ఎండించి మూసలో పెట్టి శీలుచేసి 25 పిడకలతో లఘుపుటంబు వేసి చల్లారిన తర్వాత తీసికొని నీళ్ళతో నూరి కప్పలుచేసి ఎండించి యుంచుకొనవలెను.

1 మొదలు 2 గు. యె. వరకు సేవించిన ఊరుస్తంభము, వాతరక్తము, ఆమవాతము, ధనుర్వాతము, పక్షవాతము, సంధిగత వాతము వీనిని హరించును.

పుష్టిని ఆకలిని కలిగించును.

తారకేశ్వరరసము

| | |
|---|---|
| రససింధూరము | లోహభస్మము |
| వంగభస్మము | అభ్రకభస్మము |

ఇవి సమం

వీనిని ఖల్వమందుంచి తేనె కలుపుచు నూరి గుళికలుగ కలిపి వాడుకొనవచ్చును.

ఒకటిన్నర నుండి రెండున్నర గురిగింజ ప్రమాణము సేవించవలెను.

ఇది సకల మేహరోగములను హరించును, బలవర్ధకౌషధము.

మధుమేహమునకు మేడిపండ్లచూర్ణము, తిప్పసత్తు, మంజిష్ట, త్రైఫలామలక చూర్ణము ఒక్కొక్క తులము గ్రహించి చూర్ణించి

తారకేశ్వరరసము కలుపుకొని నూరి పూటకు 5 గు. మొ. చొప్పున సేవించవలెను.

### వాతగజాంకుశము

| | | | |
|---|---|---|---|
| శు॥ పాదరసము | 8 తులం | త్రికటుకములు | 8 తులం |
| ముష్టిగింజలచూర్ణం | 9 తులం | త్రిఫలములు | 8 తులం |
| గంధకము | 8 తులం | | |

ముందుగ రసమును గంధకమును నూరి కజ్జలిచేసికొని 1 జాము బాగుగ మర్దించి పిదప తక్కిన చూర్ణములను వేసి నూరి తర్వాత నిమ్మపండ్ల రసముతో పాకమునకు వచ్చువరకు మర్దించి కుప్పెలుచేసి యుంచుకొనవలెను.

1 నుండి 2 గు. మొ. వరకు సేవించిన చచ్చువాతము, వాత రోగములు పోయి నరములకు బలమును కలిగించును.

కాళ్ళు చేతులు చచ్చుపడినవారికి వాతగజాంకుశము 1½ గు. మొ. జీలకర, మిర్యాలు ఉపరసముతో నీయవలెను. పైకి మహామాష తైలము మర్దన చేయవలెను.

వాతరోగములకు సొంఠి మిరియాల చూర్ణము కలిపి వాత గజాంకుశము 1 గు. మొ. యీయవలెను.

అజీర్తి అగ్నిమాంద్యములకు అల్లపు రసముతో నీయవలెను.

### వాతవిధ్వంసరసము

| | | | |
|---|---|---|---|
| శు॥ పాదరసము | 1 తులం | అభ్రకభస్మము | 1 తులం |
| శు॥ గంధకము | ,, | వెలిగార భస్మము | ,, |
| సీసభస్మము | ,, | శు॥ నాభి | 4½ తులం |
| వంగభస్మము | ,, | పిప్పలిచూర్ణం | 1 తులం |
| లోహభస్మము | ,, | మిర్యాలచూర్ణం | ,, |
| తామ్రభస్మము | ,, | శొంఠిచూర్ణం | ,, |

ముందు రస, గంధకములు కజ్జలి చేసికొని 1 జాము బాగుగ నూరి పిదప భస్మములను, చూర్ణములను కలియనూరి, త్రికటు కషాయము, నేలతాటిగడ్డ స్వరసము, చిత్రమూలము స్వరసము గుంట



గలగరస్వరసము, చంగల్వకోష్టు కషాయము వీనితో మూడేసి మార్లు వావిలాకు కషాయము, అల్లపురసము, ఆడ్డసర కషాయము, గంజాయియాకు కషాయము, నిమ్మరసము వీనితో ఒక్కొక్క పర్యాయము భావన మర్దనలు చేయవలెను.

పాకమునకు వచ్చిన తర్వాత కుప్పెలుచేసి యెండించి యుంచుకొనవలెను.

1 నుండి 2 గు. మొ. వరకు సేవించిన వాతరోగములు, సన్నిపాతజ్వరములు గ్రహణ్యతిసారములు నివారించును, బలమును కలిగించును.

### సూర్యావర్తిరసము

| | | | |
|---|---|---|---|
| అభ్రకభస్మము | 1 తులం | పసిండిపత్తి విత్తులపప్పు | 1 తు॥ |
| హేమమాక్షిక భస్మము | ,, | తిప్పసత్తు | ,, |
| ముత్యభస్మము | ,, | కోదాండవిత్తుల పప్పు | ,, |
| మడ్డి వెలిగార భస్మము | ,, | లవంగాల చూర్ణం | ,, |
| శు॥ ఇంగిలీకము | ,, | | |

ఇంగిలీకమును నిమ్మపండ్ల రసములో పలుచగ నగువరకు నూరి పిదప స్వర్ణమాక్షిక భస్మము అభ్రకభస్మము, ముత్యభస్మము కలిపి యొక దినము మర్దించి పత్తి విత్తులపప్పు, కోదాండ విత్తుల పప్పు వీనిని వేరుగ మెత్తగ నూరి కలుపుకొని పిదప ఇతర వస్తువులను కలిపి నిమ్మరసముతో సంతటిని కలిపి నొకదినము మర్దించి తర్వాతను అల్లపురసము ద్రాక్షకషాయము వీనితో మూడేసి రోజులు మర్దించి పక్వమైన తోడనే కుప్పెలుచేసి నీడ నెండించి యుంచుకొనవలెను.

ఇది రసాయనము, పాతపైత్య రోగములు త్రిదోష వికారములు గర్భవతులకు కలుగు వికారములు వీనిని హరించును.

గర్భవతులకు కలుగు సకల వికారములకు తగిన అనుపానముతో దీనిని సేవించిన గర్భవతులకు శక్తినిచ్చి ఆరోగ్యమును కలిగించును.

### కర్పూరాదిరసము

| | |
|---|---|
| శు॥ పళంద యింగిలీకము 1 తులం | జాజికాయలచూర్ణము 1 తులం |
| మడ్డివెలిగార భస్మము ,, | తుంగముస్తెలచూర్ణము ,, |
| హారతి కర్పూరము ,, | కొడిశపాలవిత్తుల ,, ,, |

మొదట ఇంగిలీకమును నీళ్ళతో నూరి హారతి కర్పూరమును కలిపి నూరి పిదప మిగిలిన వస్తువులను వేసి ఒకరోజు మర్దించి పాకమునకు వచ్చినప్పుడు రెండుగురిగింజల ప్రమాణం వటుకములుగ చేసికొనవలెను.

రెండు గురిగింజల మొత్తు సేవించిన సర్వాతిసారములు కలరా వీనిని శమింపచేయును.

### శేది జ్వరాంకుశ రసము

| | | |
|---|---|---|
| శు॥ పాదరసము 1 తులం | శు॥ మడ్డివెలిగారం | 2 తులం |
| శు॥ నాభి ,, | నేపాళము | 6 తులం |
| శు॥ గంధకం ,, | మిర్యాల చూర్ణము | 6 తులం |

రసగంధకమును కజ్జలిచేసి తర్వాత నాభిని నేపాళమును చూర్ణమును చేసి అల్లపురసముతో 3 రోజులు వాకుడు కాయలు స్వరసముతో 3 రోజులు మర్దించి గురిగింజలంత మాత్రలు చేయవలెను.

1 నుండి మూడు మాత్రలవరకు సేవించిన కఫము వాతము, మలబద్ధకము, జ్వరము అజీర్ణము వీనిని పోగొట్టును.

పిల్లలకు చనుబాలు తోన వీనిలో ఒకమాత్ర యీయవచ్చును.

రసౌషధ ప్రకరణము సంపూర్ణము

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు
# పులిప్పాణివైద్యము
## సింధూర ప్రకరణము

### ముఖ్యసూచనలు

సింధూరములను తయారుచేయు విధము భస్మప్రకరణమునను, రసౌషధ ప్రకరణమునను చాలవరకు వివరింపబడినవి. ఆ యా రోగములందు చెప్పబడిన విధమున సింధూరములను తయారు చేసుకొనవలెను.

సింధూరములను పాకము చేయునపుడు ఆ యా రోగము అందు చెప్పబడిన కాలపరిమితికంటె త్వరగాగాని ఆలస్యముగగాని ఎప్పుడు పక్వమైనపుడే తీసికొనవలెను. గాని సరిగా రోగము నందు చెప్పబడిన కాలమునకై గ్రహింపకూడదు. పాకము కొంచెం హెచ్చువ మంటను వేయకూడదు. అగ్నియొక్క తీక్ష్ణత వలన త్వరలో పాకమైనచో అపుడే గ్రహింపవలెను గాని కాలమును లెక్కపెట్టరాదు.

### అభ్రక సింధూరము

శుద్ధిచేసిన కృష్ణాభ్రకము 1 పలం తెల్లజిల్లేడువేళ్ళ రసముతో 4 జాములు మర్దించి యెండబెట్టి ప్రమిదలో నుంచి శీలుచేసి 100 పిడకలతో పుటము వేయవలెను. ఇటులే 6 పుటములు వేయవలెను.

మొదటి పుటము 100 పిడకలతోను, తర్వాత పుటములు 80 పిడకలతోను చేసిన చాలును.

తర్వాత వామింటాకు రసముతో మర్దించి ఒకపుటము, స్వర్ణగలగర రసముతో ఒక పుటము వేసిన సింధూరించును.

ఆవుపాలు, చీనిచక్కెర, నేయి, గోధుమరవ, పెసలు, కంది పప్పు, పాతబియ్యము ఇవి హితకరములు. చుట్ట, బీడి, సిగరెట్టు మద్యము స్త్రీలు పనికిరావు.

### అభ్రక సింధూరము
### (మరొక విధము)

అభ్రకమును నవనీతము జేరినది 10 పలములు జిల్లేడు వేళ్ళ రసమున 4 జాములు మర్దించి బిళ్ళలుచేసి మూకుడులో నుంచి శీలు చేసి 50 పిడకలతో పుటము వేయవలెను. ఇటులే 25 మారులు పుటము వేయవలెను.

తర్వాత చిత్రమూల రసముతో నూరి పై విధముననే 2 పుటములు వేసిన సింధూరమగును.

1 గురిగింజ మొత్తునుండి 2 వరకు అనుపాన భేదములతో సేవించిన బహుమూత్రము, మధుమేహము, మేహపెట్టలు నివారణ యగును.

### నల్లసీస సింధూరము

నల్లసీసమును మూసలో నుంచి నిప్పుపై పెట్టి కరిగించి నిమ్మ పండ్లరసములో భావన చేయవలెను.

మరల కరిగించి నువ్వులనూనె యందు ఏడుసారులుపోయవలెను.

ఇటులే కరిగించి 7 మారులు ఆవుపేడయందును, ఆవు పంచితమున 7 మారులు, ఉలవకట్టు నందు 7 మారులు, కాడియందు 7 మారులు కరిగించి, కరిగించి పోయవలెను అపుడు శుద్ధియగును.

శుద్ధమైన సీసమును 5 పలములు గ్రహించి శు॥ పాదరసము 1 పలం, దానితో కలిపి కరిగించి పైన తంగేడు సమూలము తెచ్చి నలుచేసి కుండలో వేసి 4 జాములు ఇనుప గడ్డపారతోగాని తంగేడు కర్రతోగాని రుద్దుచూనచ్చిన సింధూరించును. బాగా సింధూర మగువరకు యిటులే చేయవలెను

దీనిని గురిగింజమొత్తు తేనెతోగాని నేయితోగాని సేవించిన శుక్లమేహములు, రక్తకుసుము రోగములు, మూత్రకృచ్ఛ్రము బహుమూత్రము, సెగకట్టు, ఇట్టి పన్నియు నివారణ యగును.



### స్వర్ణ సింధూరము

ఒక పలము అపరంజి బంగారమును పొడిచేసి మాదీఫల రసమున మర్దించినపుడు నవాచార సున్నము, వెలిగార సున్నము ఒక్కొక్క వరహామొత్తు కలిపి 4 జాములు మర్దించి తర్వాత నీలి ఆకురసము, జెముడుపాలు కలిపి 4 జాములు మర్దించి బిళ్ళచేసి యెండించి ప్రమిదలో నుంచి సీలుచేసి గణపతిని ప్రార్థించి 2 అడుగుల మొత్తున పిడకలతో పుటము వేయవలెను. తర్వాత స్వాంగశీతలమున గ్రహించవలెను.

ఈ సింధూరమును బియ్యపుగింజ ప్రమాణము నేతితో పుచ్చుకొనిన పాండువులు, కుష్ఠు, కపాలశూల, పీనసలు నివారణ యగును. తేనెతో పుచ్చుకొనిన బుద్ధిచాంచల్యము, చక్కెరతో పుచ్చుకొనిన వ్రణములు, పురుగుకాటు, వాంతులు తీరును. వేన్నీళ్ళతో పుచ్చుకొనిన జ్వరములు మానును.

మరియు దీనిని కస్తూరితో కలిపి పుచ్చుకొనిన బలము, వీర్యము దేహకాంతి కలుగును.

పెసరపప్పు, కందిపప్పు, నేయి, పాలు, వంకాయలు, ములగ కాయ, ఉద్దిపప్పు, గోధుమ, మరియు బలవర్ధక ఆహారములు, పానీయములు హితకరములు.

### కాంత సింధూరము

సూది అంటురాయి పొడి 5 పలాలు కొలిమి నిప్పులో ఎర్రగా కాల్చి గోమూత్రములో 7 మారులు వేసి శుద్ధిచేసికొని ముంగిలి పండ్ల రసముతో నాలుగు జాములు మర్దించి బిళ్ళలుచేసి యెండించి మూకుటిలో నుంచి పైన మూకుటిని మూసి శీలమన్నుచేసి 50 పిడకలతో పుటము వేసి మరల పై రసములోనె నూరి 40 పిడకలతో పుటము వేయవలెను. మరల పై రసముతో మర్దించి పై విధముననే 25 పిడకలతో పుటము వేయవలెను.

తర్వాత సంగదురదగొండి ఆకురసముతో నూరి పై విధముననే ఒక పుటము వేసిన సింధూరమగును. ఈ సింధూరము నీల వర్ణము, ఎఱుపు కలిసినటులుండును.

గురిగింజ ప్రమాణము తేనెతో సేవించిన మేహజ్వరములు నివారణయగును.

| | | | |
|---|---|---|---|
| గంటుభారంగి | 1 పలం | చిత్రమూలం | 1 పలం |
| మిర్యాలు | ,, | అతిమధురం | ,, |
| కరక్కాయలు | ,, | తోమురగడ్డ | ,, |
| పిప్పళ్ళు | ,, | శొంఠి | ,, |
| నెల్లికాయలు | ,, | తాండ్రకాయలు | ,, |
| తాడికాయలు | ,, | కూరపసుపు | ,, |
| కలబందవేళ్ళు | ,, | అరదొండవేళ్ళు | ,, |
| మాగుడోసవేళ్ళు | ,, | గుంటగలగర వేళ్ళు | ,, |
| దురదగొండివేళ్ళు | ,, | నీరుగొబ్బిరి | ,, |

గుంటగలగరాకు చూర్ణం 1 పలం

వీనిని బాగా యెండించి చూర్ణముచేసి వస్త్రగాలితముచేసి 10 పలముల చీనిచక్కెర పాకముచేసి చూర్ణమునందు వేసి పక్వముగ వండి తేనె కొద్దిగ కలుపుకొని లేహ్యపాకమున దింపి చల్లార నిచ్చి సీసాలో భద్రపరచవలెను.

పూటకు నెల్లికాయ ప్రమాణము లేహ్యము గ్రహించియందు కొంత సింధూరము కలిపి పుచ్చుకొనిన మేహనంజులు, మేహవాయువులు, పిత్తవాయువులు, శ్వేత మేహము, గ్రహణి, అతిసారము, కరిమేహము, మేహజ్వరములు మానును.

కందిపప్పు, వంకాయ, మునగకాయ, కందగడ్డ, ఉస్తి వరుగులు, బుడమదోసవరుగులు, దొండవరుగులు, వాకుడుకాయ వరుగు, ఆవుపాలు ఇవి హితములు, పొగ త్రాగకూడదు మత్తు పదార్థము చింతపండు ఇవి వర్జ్యములు.

### తాళకసింధూరము

తాళకము 1 పలము మాగుతిలో పెట్టి కపిలాగ్నితో గాడిద గడప ఆకు రసము పోస్తూ నాలుగుజాములు వండవలెను తర్వాత ఆ మూలికనే నూరి తాళకమునకు కవచమిచ్చి శీలమన్ను చేసి స్వల్పముగ వేడి తగులుపటుల పుటము వేయవలెను. ఇటుల మూడు



మార్లు లఘుపుటము వేయవలెను. తర్వాత ప్రమిదలో ఇటుక రాయిపొడిపోసి దానిపై తాళకమునుంచి పైన ఆకు పసరుపోసి దానిపై ఇటుకరాయిపొడి పోసి పైన ప్రమిదపెట్టి సీలువేసి యెండ నిచ్చి 5 పిడకలతో పుటము వేయవలెను.

ఈ సింధూరమును బియ్యపు ప్రమాణము తేనెతో పుచ్చుకొనిన మేహక్షయములు, ఉబ్బసవ్యాధులు, కఫజ్వరములు, మేహవ్రణములు, మేహజ్వరములు ఇవి మానును

అనుభవముచే కలిగిన విధమున అనుపాన భేదములతో సేవించవలెను.

### ఏకగుణసింధూరము

శుద్ధ పాదరసము 1 తు. శుద్ధ గంధకము 1 తు.

ఈ రెంటిని కజ్జలిచేసి మూడుదినములు బాగుగ నూరి తర్వాత ఒక దినము కలబందరసములోను, ఒక దినము వమిడిపత్రి రసములోను మర్దించి యెండించి సీలు చేయబడిన సీసాలోగాని, సీమగాజు కుప్పెలోగాని పోసి వాలూకా యంత్రమున నుంచి క్రమాగ్నిచేత 15 జాములు సింధూరపాక విధానమును వండవలెను. గంధకముపోయి రసము సింధూరమగును, అపుడు దింపుకొని భద్రపరచవలెను అర నుండి $1\frac{1}{4}$ గురిగింజవరకు సేవించిన దగ్గుతో కూడిన జ్వరములు హరించును.

ఈ సింధూరము 1 గు. యె. త్రికటుచూర్ణము 2 గు. యె, అశ్వగంధచూర్ణము 2 గు. యె. వీనిని కలిపి ఆవు మరుగుపాలు 2 ఔన్సులుతో పుచ్చుకొనిన లోపలతో చిక్కిపోవుచున్న పిల్లలు బాధ తగ్గి కృశత్వము నివారణయగును.

సింధూరము 5 గు. యె. త్రికటుచూర్ణము 15 గు. యె. వీనిని కలిపి గుంటగలగరాకు రసమున నూరి శనగగింజంత మాత్రలు చేసి రోజుకు 2 మాత్రలు విధము పుచ్చుకొనిన జ్వరము దగ్గు మున్నగునవి నివారణయగును.

సింధూర ప్రకరణము సంపూర్ణము

———

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణి వైద్యము

## ద్రావక ప్రకరణము

### ఓమ ద్రావకము

వాము 100 పలములు శుభ్రపరచినవి ఒక కుండలోపోసి శుద్ధ జలముపోసి 5 దినములు నానబెట్టి దినము కలుపుతూ రావలెను. ఆరవదినము కుండకు మూతబెట్టి శీలమన్నుచేసి ఒక వైపున రంధ్రముచేసి ఒకగొట్టము రంధ్రమున దూర్చి దానికి శీలుచేసి, గొట్టముక్రింద పాత్రనుంచి కుండను పొయ్యిమీదనుంచి మంటబెట్టిన ద్రావకము గొట్టముగుండ పాత్రలోకి దిగును. దానిని సీసాలో భద్రపరచవలెను.

చన్నీళ్ళతో యీ ద్రావకము ఒక టీ స్పూన్ పోసి కలిపి త్రాగిన జలుబు, జ్వరము, అజీర్ణము, కడుపునొప్పి, అజీర్ణభేదులు, ఉష్ణవాయువు, వాంతులు మున్నగునవి నివారణయగును.

### నవాచార ద్రావకము

| | | | |
|---|---|---|---|
| నవాచారము | 10 పలములు | పటికారము | 5 పలములు |
| అయిదుమార్లుకాచిన | | కల్లుప్పు | 4 పలములు |
| సూరేకారం | 5 పలములు | ఇందుప్పు | 4 పలములు |

వీటన్నిటిని కలిపి అల్లపురసముతో ఒకజాము మర్దించి, తడి పొడిగ ఉండునపుడు కుండలో వేసి తగుమాత్రము జలము పోసి పైప్రకారము శీలమన్ను అదిచేసి పొయ్యిమీద నుంచి మంటవేసిన ద్రావకము దిగును. దానిని సీసాలో భద్రపరచవలెను.



దీనిని చన్నీటిలో ఒకటి టీ స్పూన్ వేసి కలిపి త్రాగిన శూలలు పాండురోగము, నీరుకట్టుట, నీరుచురుకు, బల్లలు మున్నగునవి నివారణయగును.

ఒక స్పూన్ ద్రావకమును అల్లపురసముతో పుచ్చుకొనిన వాంతులు, పైత్యవాంతులు మానును.

సుగంధపాలవేళ్ళ కషాయముతో సేవించిన కడుపునొప్పి నివారించును.

ఆరదొండవేళ్ళు, గాలిమిడివేళ్ళు, గుంటగలగరవేళ్ళు, నాగుదోసవేళ్ళు సమం గ్రహించి దంచి కుండలో వేసి శేరు నీళ్ళుపోసి యిందులో మిర్యాల చూర్ణము ¼ పలము వేసి పొయ్యిమీదనుంచి మంట వేసి అష్టభాగము కషాయము కాచి వడియబోసి; 2 ఔన్సుల కషాయములో ద్రావకము పోసి పుచ్చుకొనిన మేహానంజులు కడుపుబ్బరము, కాళ్ళుచేతుల వాపు, అండవాయువులు హరించును, శరీరము ఆరోగ్యముగ నుండును.

### శంఖ ద్రావకము

| | | | |
|---|---|---|---|
| పటిక | 1 పలం | యవక్షారం | 2 పలాలు |
| సైంధవ లవణం | 2 పలం | సురేకారం | 4 పలాలు |
| నవాసారం | 2 పలం | కాసీసం | అర పలం |

వీటిని చూర్ణముగ నూరి వకశాయంత్రములో గాని తిర్యక్పాతన యంత్రమునకు క్రింద రంధ్రముచేసి దానిక్రింద నొక పింగాణి పాత్రనుంచిన దానిలోని ద్రావకము దింపుకొనవలెను. ఇది తయారు చేయునపుడు చేతికి తగలకూడదు.

2 నుండి 5 చుక్కలవరకు 2 ఔన్సుల నీళ్ళలో కలిపి పుచ్చుకొనిన అజీర్ణము, ఆమ్లపైత్యము, యుల్సర్ కీ హాలోదరమునుపోగొట్టి ఆకలిని, పేగులను శుభ్రపరచి సరియైన స్థితిలో నుంచును.

శుద్ధ ద్రావకము నాలుకమీద వడకూడదు. మరొక ద్రవ పదార్థముతో కలిపి పుచ్చుకొనవలెను.

### మరొకవిధము

| | | | |
|---|---|---|---|
| సురేకారం | 10 పలాలు | అప్పళకారం ($Na_2HCO_3$) | 1 ప. |
| పటికారం | 10 పలాలు | ఉత్తరేణిపువ్వు. | ,, |
| శంఖభస్మం | 5 పలాలు | వెలిగారం | ,, |
| సజ్జాక్షారం | 1 పలం | యవక్షారం | ,, |
| నవాక్షారం | ,, | పలుకు సాంబ్రాణి | ,, |
| కరియుప్పు | ,, | ఆకుజెముడు | ,, |
| గాజుప్పు | ,, | పట్టుతో తీసిన పుప్పు | ,, |

వీటన్నిటిని నిమ్మపండ్ల రసములో మర్దించి ఒక కుండలో వేసి మూతమూసి మంటబెట్టి ద్రావకం దింపుకొనవలయును. ఇది మిక్కిలి కారముగ నుండును.

తులంయెత్తు 5 ఔన్సుల మంచినీళ్ళు కలిపి పుచ్చుకొనిన గుల్మ వ్యాధులు, ప్లీహవ్యాధులు, కడుపులో బల్లలు, కడుపునొప్పి, రొమ్మునొప్పి, పిత్తశూలలు, రొమ్మును కమ్ముకొనునట్టి క్షుద్ర వాయువులు, పైత్యవికారము, మూత్రకట్టు ఇట్టివన్నియు తీరును.

అల్లపురసములో నీళ్ళుకలిపి 5 చుక్కలు ద్రావకము కలిపి పుచ్చుకొనిన కడుపుమంటలు కఫము క్షుద్రవాయువు హరించును.

అష్ట గుల్మములు, శ్వాసకాస, ప్లీహరోగము, దశవాయువులు పొత్తి కడుపుబ్బుట మాంసబల్ల శ్లేష్మరోగములు, మహోదరము వీనికి వెర్రిపుచ్చకాయ రసముతో పై విధముననే సేవించవలెను.

### గుల్మహరద్రావకము

ఉత్తరేణి సమూలం, ఎర్రముండ్లతోటకూర సమూలం, బ్రహ్మదండి సమూలం, ద్రాక్షతీగ సమూలం, గుంటగలగర సమూలం, దుష్టపుచెట్టు సమూలం, నేలగొలిమి సమూలం, బొంతజెముడు సమూలం, చిత్రమూలం సమూలం వీనిని వేరుగ కాల్చి బూడిద చేసికొని ప్రతిదాని బూడిదె మూడుపళ్లు తూలిచి వేరు వేరు కుండలో వోసి 10 వళ్ళ జలములో అయిదు దినములు నానబెట్టి కలుపుచు 6 వ దినము తేటపంచుకొని కాచినచో ఉప్పగును. ఆ ఉప్పులోను



| | | | |
|---|---|---|---|
| గాజులుప్పు | 2 ప. | పూసీకుప్పు | 2 ప. |
| సైంధవ లవణం | 2 ప. | పెట్లుప్పు | 1 ప. |
| | | పటికారం | 1 ప. |

వీటన్నిటిని ఖల్వమున నుంచి పల్లి ఆకురసముతో ఒకజాము మర్దించి యెండబెట్టి కుండలో వేసి మూతబెట్టి శీలుచేసి పొయ్యిమీద బెట్టి ద్రావకం దింపుకొనవలెను.

ఈ ద్రావకము సుగంధపాలవేళ్ళ కషాయములో 20 చుక్కలు వేసి పుచ్చుకొనిన రొమ్మునొప్పి, పైత్యరోగములు, నీరుకట్టుట, లింగ స్థానమున దుర్మాంసము పెరుగుట, ఇట్టివన్నియు నివారణయగును.

### కల్లుప్పుద్రావకము

| | | | |
|---|---|---|---|
| కల్లుప్పు | 1 వీశ | సైంధవలవణం | 10 పలాలు |
| పటిక | అర వీశ | | |

వీనిని ఖల్వమున నుంచి నిమ్మపండ్ల రసముతో ఒకజాము మర్దించి యెండించి కొంచెము తడివుండగానే ఒక కుండలో బెట్టి మూతబెట్టి శీలుచేసి పొయ్యిమీదనుంచి ద్రావకము దింపుకొనవలెను.

దీనిని కొంచెము చన్నీళ్ళలో పది చుక్కలు వేసి పుచ్చుకొనిన కడుపునొప్పులు, కఫము, మూత్రకట్టు, మలబద్ధకము, రొమ్ము నొప్పి ఇట్టివన్నియు నివారణయగును.

### మరీచిద్రావకము

| | | | |
|---|---|---|---|
| మిర్యాలు | 1 వీశ | సన్నరాష్ట్రం | 1 పలం |
| శొంఠి | 1 పలం | | |

వీనిని పలియగొట్టి ఒక కుండలో వేసి 2 శేర్లు మంచినీళ్ళు పోసి అయిదు దినములు నానబెట్టి 6-వ నాడు పొయ్యెక్కించి అంబికా యంత్రముతో ద్రావకము దింపుకొనవలెను.

ఈ ద్రావకము 10 చుక్కలు కొంచెమునీళ్ళలో కలిపి పుచ్చుకొనిన శిరఃశూలమును హరించుటయే గాక, శ్వాసము, చలిజ్వరము, వాతరోగములు, కఫము, అజీర్ణము, వాపులు, మూర్ఛ, మందవిరేచనములు, కడుపుబ్బరము, చలిపోటు, ఇట్టివన్నియు తీరును.

## మహాద్రావకము

| | | | |
|---|---|---|---|
| పూసీరు ఉప్పు | 1 పలం | అండసున్నము | 1 పలం |
| గాజు ఉప్పు | ,, | సముద్రపునురుగు | ,, |
| ఆటుకుఉప్పు | ,, | ముండ్లతోటకూర ఉప్పు | ,, |
| పెట్లుప్పు | ,, | అపామార్గ ఉప్పు | ,, |
| పటికారం | ,, | సజ్జాక్షారం | ,, |
| నవాక్షారం | ,, | యవాక్షారం | ,, |

వీనిని ఒకటిగ చేర్చి చిన్న బానలోవేసి సీలుచేసి ద్రావకము దించుకొనేది.

పది చుక్కలు ద్రావకము నీళ్ళతో పుచ్చుకొనిన పై వ్యాధులన్నియు తీరును.

## పెట్లుప్పు ద్రావకము

అయిదు శేర పది దీక్షణైన సురేకారము 160 పలములు, పటికారం 60 పలములు వీనిని భాండములో వేసి సీలుచేసి ద్రావకం దింపుకొనవలెను.

అల్లపురసములోగాని, చన్నీళ్ళలోగాని పది చుక్కలు ద్రావకమువేసి పుచ్చుకొనిన కడుపునొప్పులు, శైత్యవాతములు, కడుపుమంట, నీరుకట్టు మున్నగునవి నివారించును.

ద్రావక ప్రకరణము సమాప్తము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు
# పులిప్పాణివైద్యము
## లేపప్రకరణము

### గమనింపవలసిన విషయములు

లేపములనగా పైకి రాయతగినవి, పట్టుగ వేయతగినవి. ఈ ఔషధములనగా మైనము కలియుటచే ముద్దగ నుండును. కొన్ని రోగములు చూర్ణములుగను, వస్త్రిగను నుండును. చూర్ణములను యేదైనను ద్రవపదార్థములతో కలిపి పైపూతకుపయోగింపవలసి యుండును.

రసగంధకములు కలియునట్టి రోగములందు మొట్టమొదట రసగంధకములను నూరి కజ్జలి చేసికొని తర్వాత ఇతర వస్తువులను కలిపి నూరవలెను.

తాళకము మణిశిల చేరునట్టి రోగములందు పై వస్తువులను వేర్వేరుగ మెత్తగ నూరుకొని తర్వాత యితర వస్తువులను కలిపి నూరవలెను.

మైనము నూనె కలియు రోగములందు మొదట తైలమును వెచ్చబెట్టి మైనమును చిన్న చిన్న ముక్కలుగ నలియగొట్టి నూనెలో వేసి మైనము కలిసి నూనెతో కలిసిపోయినది గ్రహించి దింపుకొనవలెను. చల్లారిన తర్వాత గట్టిపడును. అపుడు యితర వస్తువులను కలిపి నూరుకొనవలెను.

లేప ఔషధములు నోటికి కంటికి తగులనీయరాదు.

## గుగ్గిలంవర్తి

గుగ్గిలం 2 పలం పొడిచేసి పాత్రలో నూనెపోసి యందు ఆ పొడిని వేసి పక్వము చూచుకొని

| | |
|---|---|
| మృదారుశింగి | 2 పలం |
| గంగసింధూరం | ½ పలం |
| రసకర్పూరం | ½ పలం |

వీనిని పొడిచేసి నూనెలోవేసి కలియబెట్టుచు పక్వమైన దింపుకొని భద్రపరచవలెను. వలసినపుడు గుడ్డకు పట్టించి వ్రణములపై వేసిన సకల వ్రణములు నయమగును.

## కర్పూరవర్తి

| | | | |
|---|---|---|---|
| కర్పూరము | 1 పలం | సాంబ్రాణి | 1 పలం |

సాంబ్రాణి ముందుగ ఖల్వమున పొడిచేసుకొని పిదప కర్పూరమున కలుపుకొని బాగుగ నూరవలెను. బాగుగ నూరిన రెండును కలిసిపోయి ద్రవమువలె నగును అపుడు తీసికొని భద్రపరచవలెను

వలసినపుడు క్రొత్తగుడ్డకు పట్టించి వ్రణములపై వేయవలెను, పడికగడ్డలపై బాగుగ పనిచేయును, సకల వ్రణములకును వాడవచ్చును.

## గుగ్గిలంవర్తి
(మరియొక విధము)

తెల్లగుగ్గిలం 8 పలములు నువ్వులనూనె 1 పలంలోవేసి పొయ్యి కెక్కించి పక్వమైనపుడు

| | | | |
|---|---|---|---|
| రససింధూరం | 1 పలం | ఇంగిలీకం | 1 పలం |
| రసకర్పూరం | 1 పలం | పాలతుర్థం | 1 పలం |

వీనిని చూర్ణించి పై పాకములో వేసి బాగుగ కలియబెట్టుచు వర్తి పక్వమున దింపుకొనవలెను.

ఇదియు సకల వ్రణములకు గుడ్డకు పట్టించి వేయవచ్చును.



## సకలవ్రణహారవర్తి

ఇనుప బాణలిలో నేయి 4 పలాలు, తేనె మైనం 2 పలాలు చేర్చి కరిగించి, యివి కరుగుచున్నపుడు గంగసింధూరము 4 తులములు నూనె 2 పలాలు పోసి తర్వాత,

| | | | |
|---|---|---|---|
| రసకర్పూరం | అర తులం | సాంబ్రాణి | అర తులం |
| ఇంగిలీకం | ,, | మృదారుశింగి | ,, |
| హారతి కర్పూరం | ,, | | |

వీనిని పొడిచేసి పై పాత్రలో వేసి ఇనుపగరిటతో కలుపుతు పాకమైనపుడు దింపుకొని గుడ్డకు పట్టించి వ్రణములకు వేసిన అరని వ్రణములు రెండు పూటలలో నయమగును.

## దురదకు లేపనము

| | | | |
|---|---|---|---|
| చావండాలచూర్ణం | 1 పలం | మంచిపసుపు | అర పలం |
| రేలఆకుచూర్ణం | ,, | వాకచూర్ణం | ,, |
| నేరేడువిత్తులచూర్ణం | ,, | | |

గోమూత్రముతో మొదట వాకమునునూరి తక్కిన చూర్ణములను గోమూత్రము వేయుచు బాగా కలియ నూరవలెను. ద్రవరూపమును బొందినపుడు గుళికలుగ చేసి యెండించి భద్రపరచవలెను. అవసరమైనచో గోమూత్రముతో కలిపి రాయవలెను.

ఇది దురద, చర్మపగుళ్ళు, కురుపులు, పొడలు, శ్వేతకుష్ఠము వీనిని పోగొట్టును.

దురదను నువ్వులనూనెలో కలిపి రాయవలెను. పగుళ్ళకు కొబ్బరినూనెలో కలిపి రాయవలెను. గజ్జి మోదుగపువ్వు కషాయముతో రాయవలెను.

పొడలకు చావంచాల కషాయముతో రాయవలెను.

## శైత్యహారలేపము

| | | | |
|---|---|---|---|
| హారతి కర్పూరము | 1 పలం | తేనెమైనము | 1 పలం |
| తెల్లమిర్యాల చూర్ణము | అర పలం | కొబ్బరినూనె | 4 పలం |

కొబ్బరినూనెను వెచ్చపెట్టి యందు కొంచెముమైనమును కరిగించి దించి చల్లార్చి చూర్ణమును కర్పూరమును వేర్వేరుగ నూరుకొని పిదప అన్నిటిని కలిపి కలియనూరి ఆఖరున పెప్పరుమెంట్ క్రిస్టల్ 1 పలం కలిపి నూరి భద్రపరచవలెను.

ఇది తలనొప్పి, ఒంటి తలనొప్పి, జలుబు, కీళ్ళనొప్పులు, తేలుకుట్లు వీటన్నిటిని పారద్రోలును.

వంగసింధూరపళాస్త్రి

| | |
|---|---|
| వంగసింధూరం | 1 పలం |
| రసకర్పూరం | అర పలం |
| మృదారశింగ్ | 1 పలం |
| నువ్వులనూనె | 8 పలం |

వస్తువులను బాగుగ నూరుకొని నూనెను బాణలిలో పోసి పొయ్యికెక్కించి నూరిన వస్తువును నూనెలోవేసి పళాస్త్రి పక్వమున దింపుకొనవలెను.

ఇది వ్రణములను పుండ్లను మాన్పును.

మరొక విధము

తెల్లగుగ్గిలం 16 వరహాలెత్తు
కాల్చిన కోడిగ్రుడ్లు పెంకుల భస్మం 2 వరహాలెత్తు
రసం 2 వరహాలెత్తు
మైలతుత్థం 2 వరహాలెత్తు
పాలతుత్థం 2 వరహాలెత్తు
పచ్చగావుండ మైనం 2 వరహాలెత్తు

వరుస అన్నిటిని కలిపి పొడిచేసుకొని నువ్వులనూనెలో మైనమును కరిగించి దానియందు చూర్ణమును పోసి కలుపుచు పళాస్త్రి పక్వమున దింపుకొని చల్లారిన పిదప ఖల్వమున నుంచి కొబ్బరినూనె వేసి మర్దించి భద్రపరచవలెను.

దీనివలన ఆరని వ్రణములు, దీర్ఘకాలముగ నుండునట్టి వ్రణములు మానును.



వాపు మానుటకు లేపము

దేవదారుచెక్క   సవాసారము   శొంఠిచూర్ణము

ఇవి సమం గ్రహించి చూర్ణము చేసికొని వస్త్రగాలితము చేసి యుంచుకొనవలెను.

దీనిని నిమ్మరసముతోగాని, వేన్నీళ్ళతోగాని పులిసిన మజ్జిగతో బాగా కలిపి వాపుగలచోట పట్టువేసిన వాపు తగ్గును. పగలనిగడ్డపై వేసిన త్వరగ పక్వమై పగులును.

వ్రణములకు పళాస్త్రి

8 పలములు నువ్వులనూనెను, బాణలిలో పోసి పొయ్యిమీదుంచి వంగసింధూరము ఒక పలమువేసి కలుపుచు,

| | | |
|---|---|---|
| రసకర్పూరం | 2 వరహాలయెత్తు | |
| కాశీకం | 1 | ,, |
| రససింధూరం | | ,, |
| తెల్లకాచు | | ,, |
| సాంబ్రాణి | | ,, |

వీనిని పొడిచేసుకొని నూనెలోవేసి కలుపుచు పళాస్త్రి పక్వమున దింపుకొని భద్రపరచవలెను.

గుడ్డకు పట్టించి వ్రణములకు వేసిన మానును. గడ్డలకు వేసిన పక్వముకాని గడ్డలు పక్వమగును.

నీరుడువిత్తుల లేపము

నీరుడువిత్తులు పగులగొట్టి పెంకు తీసివేసి పప్పును గ్రహించి కొబ్బరనూనెతో మెత్తగ నూరవలెను. మైనమువలె అయిన తర్వాత భద్రపరచవలెను

దీనిని తగుమాత్రము మజ్జిగలో కలిపి దురదగలచోట రాచిన దురద మాయమగును.

చర్మపగుళ్ళకు కొబ్బరనూనెలో కలిపి రాయవలెను.

శ్విత్రకుష్ఠములను బావంచాల కషాయముతో కలిపి రాయవలెను.

### సింధూరాది లేపము

| | | | |
|---|---|---|---|
| రసకర్పూరము | 6 పలాలు | మృద్దారుశింగు | 6 పలాలు |
| రససింధూరము | 6 పలాలు | మైనము | 60 పలాలు |
| గంగసింధూరము | 12 పలాలు | కొబ్బరిమానె | 4 వీశలు |

మొదట మైనమును కొబ్బరిమానెలో కరిగించి కలిపిన తర్వాత దించి చల్లార్చి తక్కినవానిని కలిపి మెత్తగ నూరవలెను. పిదప జాగ్రతపరచవలెను.

ఇది చర్మమున కలుగునట్టి సర్వరోగములను హరించును. పొడలు, వ్రణములు, పగుళ్ళు, ఫిరంగి వ్రణములు సమస్తమును పోగొట్టును.

లేప ప్రకరణము సంపూర్ణము



శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు
# పులిప్పాణివైద్యము
## మైనప్రకరణము



### ఇంగిలీక మైనము

| | |
|---|---|
| శుద్ధిచేసిన ఇంగిలీకము | 10 వరహాలయెత్తు |
| హారతికర్పూరము | 5 వరహాలయెత్తు |
| వలుకుసాంబ్రాణి | 5 వరహాలయెత్తు |

వీటిని ఖల్వములో నూరిన మైనమువలె నగును.

ఈ ఔషధమును గురిగింజ ప్రమాణము వాము లేహ్యములో కలిపి పుచ్చుకొనిన వాంతి భేదులు కట్టును. అజీర్ణము, కడుపుబ్బరములు నివారణయగును.

### పూర మైనము

| | |
|---|---|
| రసకర్పూరము | 1 వరహాయెత్తు |
| ఇంగిలీకం | ,, |
| మిర్యాలు | ,, |
| తాటిబెల్లం | ,, |

వీనిని ఖల్వములో నుంచి తేనె కొద్దిగ కలుపుచు నూరవలెను. రెండుజాములు నూరినపిదప మైనమగును.

మిరియము ప్రమాణము ఉదయం సాయంకాలములయందు సేవించిన మేహశూల, గ్రంధులు, అండవాతము, పుండ్లు, పౌత్రము మున్నగునవి తీరును.

నేయి, ఆవుపాలు, మేకమాంసము, వేయించిన కందిపప్పు, వంకాయ, మునగపిందెలు, బెండకాయ పెద్ద చిక్కుడుకాయలు, గోధుమ ఇవి హితకరములు, చింతపండు పనికిరాదు.

### త్రినేత్ర మైనము

కొబ్బరిచిప్పలు కాల్చిన భస్మము 2 వరహాలయెత్తు
శుద్ధి నేపాళవిత్తులు ,,
శుద్ధి పాదరసము ,,
రాతిబెల్లం ,,

ఈ వస్తువులను ఖల్వమందుంచి కొబ్బరిపాలు పోసి ఒకజాము మర్దించి మైనపక్వముగ అయినతోడనే భద్రపరచుకొనవలెను.

దీనిని పెసరయెత్తు వేడినీటి అనుపానముతో పుచ్చుకొనిన జ్వరములు, ఎక్కిళ్ళు, వాంతి, శ్వాస, మాంద్యము, త్రిదోషములు, విషము, నంజు, జిహ్వాదోషములు, సుఖవన్ని ఇట్టివన్నియు తీరును.

మైన ప్రకరణము సంపూర్ణము

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణి వైద్యము

## సున్న ప్రకరణము

### ఉక్కు సున్నము

ఉక్కుపొడి 5 పలములు పింగాణి పాత్రలోనుంచి తెల్లజిల్లేడు పాలు రసము మునుగునటుల పోసి 21 దినములు ఎండలో పెట్టవలెను. ఉక్కురసము తెల్లబడిపోవును. దానిని ప్రమిదలో నుంచి సీలుచేసి పంద పిడకలతో పుటము పెట్టిన సున్నమగును.

ఈ సున్నమును చిన్న్యపుప్రమాణము తేనెతో పుచ్చుకొనిన శ్వేతకుష్ఠు, అస్థిగతజ్వరములు, శూలనొప్పులు, అతిసార విరేచనములు కామానంజు, పాండువు మున్నగునవి తీరును.

### వంగ సున్నము

నల్లసీసము 1 పలం
పాదరసము 1 పలం

ఈ రెంటిని ఖల్వములో పొడిచేసుకుని దీనితో 5 మార్లు పెచ్చుకేసిన పిల్లుపప్పు 2 పలములు వేసి నిమ్మపండ్లరసముతో నాల్గు జాములు మర్దించి బిళ్ళలుచేసి బాగా యెండించి చిన్న పిడకలలో ఆ బిళ్ళలనుంచి సీలుచేసి యెండించి 8 పిడకలతో పుటము వేయవలెను. సాంగశీతలమైన తీసికొని భద్రపరచవలెను. దీనితో,

దురిగడ్డ 1 వరహాలయెత్తు గన్నెరు సున్నము 3 వరహాలయెత్తు నేతియన్నారసముతో మర్దించి దురిగడ్డను కపచమిచ్చి మాడదిన

ములు ఎండలో ఎండబెట్టి ప్రమిదలోనుంచి శీలమన్ను చేసి ఎండించి ఒక పిడకతో పుటము వేయవలెను. దురిశి సున్నమగును.

ఈ సున్నము రసమును కట్టును. మరియు 64 పరకులను కట్టును.

### ముప్పుసున్నము

| | | | |
|---|---|---|---|
| పూనీరు 2oz అరవీశ | | శు॥ నాగం | 4 పలాలు |
| సవీరం 2oz అరవీశ | | శు॥ మైనతుత్థం | 4 పలాలు |
| నల్లిగంధకం | 4 పలాలు | రక్తమనోశిల | 4 పలాలు |
| జయురసం | 4 పలాలు | | |

వీనిని ఖల్వమున నుంచి నిమ్మపండ్ల రసములో నాలుగు జాములు మర్దించి పింగాణీ పాత్రలో నుంచి రాత్రిపూట బహిఃప్రదేశమున మంచులో నుంచవలెను. వేకువజామున చూచిన నీరుండును ఆ నీటిని జాగ్రతగ సీసాలోకి తీసికొనవలెను. మూత గట్టిదిగ నుంచవలెను.

తర్వాత పింగాణీ పాత్రను గాలి తగలని ప్రదేశమున నుంచి గట్టిగ మూతపెట్టవలెను. రాత్రిపూట మరల మంచులో బెట్టి నీటిని వేకువ జామునకే వంచుకొనవలెను. ఇటుల 5, 6 దినములు చేసి నీటిని తీసికొనవలెను.

ఈ నీటిలో సవీరమును నుంచి ఎండపెట్టుచువచ్చిన సవీరము కట్టును. అరిదారమును యీ నీటిలో నుంచి ఎండలోబెట్టుచు వచ్చిన అరిదారము తెలుపగును.

వళంగ యింగిలీకమును యీ నీటిలో నుంచి ప్రమిదలోనుంచి నిప్పులో 4 జాములు వేడిచేసిన కట్టి మైనమగును.

ఈ ఇంగిలీక మైనమును పెసరగింజలంత తేనెలో రంగరించి యిచ్చిన మరణకాలమున కంఠమున చేరునట్టి కఫమును కరిగించును. మహోదరములు, గుల్మములు, బల్లలు, కఠినమైన శూలలు, పక్షవాయువులు. మున్నగువానిని నివారింపజేయును.



### దురిశి గుళు సున్నం

దురిశి అర్ధపలమును తేనెలో ఒకదినం నానవేసి కడిగి ఎండించి

| | |
|---|---|
| సవీరం | 1 వరహాయెత్తు |
| తెనగాజాలు | ,, |
| నూరకత్తు కర్పూరం | ,, |
| పునుగు | ,, |

వీనిని చనుబాలతో మర్దించి దురిశిగడ్డకు కవచమిచ్చి బాగుగ ఎండించి పాతచింతపండు పిత్తు పీసలు లేకుండా దుత్తలో వేసి పిల్లల మూత్రము పోసి బాగుగ ఇంకిపోవునటుల కాచి దురిశి గడ్డను అందులో వుంచి పైమూతబెట్టి శీలచేసి ఎండనిచ్చి 7 పిడకలతో పుటంవేసిన సున్నమగును.

### ముప్పుసున్నము

మాఘ, ఫాల్గుణ మాసములలో చవుటి నేలయందు తెల్లటి సురేకారం వత్తివలె పుట్టును, దీనిని పూనీరందురు.

| | |
|---|---|
| ఈ నీరుసున్నము | 4 పళ్ళు |
| రాళ్ళసున్నము | 4 పళ్ళు |

ఈ రెంటిని ఒక భాండమున వేసి పిల్లల మూత్రము 16 పళ్ళు పోసి బాగా కలియబెట్టి మూడు దినములు నాననిచ్చి తేటను వంచుకొని పొయ్యికెక్కించి కాచవలెను. చిన్న మంటవేసి మాడకుండ కాచిన సున్నమగును. ఈ విధమున ఐదుమాఱులు చేసిన ఉప్పు అగును.

దీనిని పింగాణీ పాత్రలో వేసి ఎండలో బెట్టవలెను. ఎండిన పిదప దానిని గ్రహించి ఖల్వమున నిమ్మపండ్లరసములో ఒక జాము మర్దించవలెను. పిదప నీడలో నెండించి ప్రమిదలో నుంచి ప్రమిద మూసి సీలచేసి 10 పిడకలతో పుటము వేయవలెను. ఇట్టి స్థితిలో దీనిని 'గుళు' యందురు.

ఈ సున్నము సకల లోహములను కట్టును.

### రససున్నము

పాదరసం 1 పలం
నెల్లికాయగంధకం ,,
అపరంజి బంగారం ,,
కట్టినవాగం ,,

వీటి ఖల్వమున నుంచి నిమ్మకండ్లరసముతో నాల్గు జాములు
మర్దించి గంగాజలక పెట్టించి వాలుకాయంత్రమునందు 8 జాములు
మంట వేయవలెను. స్వాంగశీతలమున తీసి పగులగొట్టి చూచిన
సింధూరమగును.

ఒక చిన్నపుగింజ ప్రమాణము నేతితో పుచ్చుకొనిన, కుష్ఠు
రోగములు, మహారోగములు, కరిమేహము, కాళమేహము, మధు
మేహము, వ్రణములు, భగందరము, బహుమూత్రము, మూత్ర
కృచ్ఛ్రము, వాయుసంబంధ వ్యాధులు ఇవి యన్నియు సకల
రోగములను బాపి వజ్రశరీరమును కలుగజేయును. మండలము
సేవించిన కాయసిద్ధి కలుగును.

### మరొకవిధము

ముత్యపుసున్నం 1 పలం
శు॥ పాదరసం ,,
సవ్వీరం ,,
దళసిరులు తీసిన పెల్లుప్పు ,,
నవాసారం ,,

వీటన్నిటిని ఖల్వమున నుంచి కోడిగుడ్డు తెల్లరసము తెల్ల
జిల్లేడుపాలు సమం కలిపి పింగాణీ పాత్రలో పోసి ఉంచి ఎండలో
ఒక దినముంచి ఆ రసముతో నాలుగుజాములు మర్దించి బిళ్ళచేసి
యెండించి ప్రమిదలో పెట్టి ప్రమిద మూసి సీలుచేసి 5 పిడకలతో
పుటం వేయవలయును.

సున్న ప్రకరణము సంపూర్ణము

---

శ్రీ రస్తు

# వసిష్ఠప్రోక్తమగు
# పులిప్పాణివైద్యము
## క్వాథచూర్ణప్రకరణము

### గమనించవలసిన విషయములు

కషాయముగ కాచుట కుపయోగింపబడు వస్తువులను చూర్ణ
ముగ చేసి యుంచుకొనుటకు క్వాథమని పేరు. దీనిని కషాయమని
కూడ అనుటకలదు. దీనిని తయారుచేసిన వెంటనే ఉపయోగింప
వలెను. వ్యాధిని త్వరితముగ నయపరచును.

సాధారణముగ ఔషధ ద్రవ్యములకు 16 రెట్లు జలమునుపోసి
8 వ వంతు మిగులునటుల కాచుకొనవలెను. కషాయము తయారు
చేయునట్టి పాత్ర మట్టిదిగనే యుండుట మంచిది. శ్రేష్ఠమైనది
కూడ. కషాయము తయారైన వెంటనే శుభ్రమైన గుడ్డలో
వడియబోసి సీసాలో భద్రపరచవలెను. తయారైన కషాయము
24 గంటల లోపలనే యుపయోగింపవలెను. తర్వాత నుపయో
గింపరాదు.

కషాయము సామాన్యముగ 1 ఔన్సునుండి 2 వరకు మాత్రమే
మోతాదు. దినమునకు రెండుసార్లు అవసరమేర్పడిన 3 సార్లు ఉప
యోగింపవచ్చును కషాయమును మధ్యాగ్ని చేతనే వండవలెను.

కషాయము ఆయా రోగములందు చెప్పబడిన ప్రకారము
కాచుట ముఖ్యము. సరిగ కాగనిదే దించరాదు. కాగుచున్నపుడు
మాటిమాటికి కలియబెట్టరాదు. ఎక్కువగ యిగిరిపోవునటుల కాచ

కూడదు. ఒకవేళ యిగిరిపోయినచో మరల నందులో నీరుపోసి కాచ కూడదు. సిద్ధమైన కషాయమును మూతపెట్టి యుంచవలెను.

ఛిన్నరుహాది క్వాథ చూర్ణము

| | |
|---|---|
| తిప్పతీగ | పర్పాటకము |
| దురదగొండివేళ్ళు | అడ్డసరపు ఆకు |
| తుంగముస్తెలు | నేలవేము |
| శొంఠి | |

ఈ వస్తువులు సమము గ్రహించి కచ్చాగా దంచి యుంచుకొని అవసరమైనపుడు కషాయము కాచుకొని యుపయోగింపవలెను.

దీనిని సేవించుటవలన కాసము, సామాన్య జ్వరములు, త్రిదోషజ్వరములు, ధాతుగత జ్వరములు నివారణయగును.

తిప్పసత్తు, శీమలనాశిరి, పిప్పళ్ళ మర్దనము ఇవి ఒక చిన్నం గ్రహించి మారి ఒక్కొక్క పూటకు అర్థచిన్న మొప్పున కషాయముతో సేవించిన పురాణ జ్వరములు హరించును

దాహము కలిగిన జ్వరములలో కషాయము అష్టభాగము దింపుకొని మర్దన చూర్ణముతో కలిపి సేవించవలెను.

మంజిష్టాది క్వాథ చూర్ణము

| | | | |
|---|---|---|---|
| మంజిష్ట | 1 పలం | కరక్కాయ | 1 పలం |
| ఉసిరిక బెండు | ,, | తానికాయ | ,, |
| తిప్పతీగ | ,, | మానిపసుపు | ,, |
| వేపచెక్క | ,, | కటుకరోహిణి | ,, |
| వస | ,, | | |

ఈ వస్తువులను రోటిలోవేసి కచ్చాగా దంచి యుంచుకొనవలెను. కావలసినపుడు విధిప్రకారము కషాయము తయారు చేసుకొనవలెను.

దీనిని సేవించుటవలన పిత్తమును, వాతమును పోగొట్టును, రక్తమును శుద్ధిపరచును, ముడుతలువడిన చర్మములు బిగువు కలిగి కాంతి కలుగును.



భారంగ్యాది క్వాథ చూర్ణము

| | | | |
|---|---|---|---|
| గంటుభారంగి | 1 పలం | నేలవేము | 1 పలం |
| శొంఠి | ,, | వాకుడు | ,, |
| పిప్పళ్లు | ,, | తిప్పతీగ | ,, |
| తుంగముస్తెలు | ,, | చెంగల్వకోష్టు | ,, |
| దూలగొండి | ,, | పర్పాటకం | ,, |

వీనిని కచ్చాగా దంచి భద్రపరచుకొనవలెను.

అవసరమైనపుడు 5 తులములు ఈ చూర్ణమునకు 80 తులముల నీళ్ళుపోసి ఎనిమిదవ భాగము దింపుకొని వాడుకొనవలెను.

ఒకటినుండి 2 ఔన్సులవరకు యీ కషాయమును వాడుకొనవచ్చును. దీని సేవనవలన వాత కఫజ్వరములు, వికారము శ్వాసకాసలు నివర్తియగును.

పులి పురుగులుచేరి జ్వరము కలిగినపుడు, దగ్గు, శరీరమున కలుగు నొప్పులు ఇవి మానును.

నింబాది క్వాథ చూర్ణము

| | | | |
|---|---|---|---|
| ముదిరిన వేపపట్ట | 1 పలం | ఎండు పసుపు | 1 పలం |
| శొంఠి | ,, | తిప్పతీగ | ,, |
| అడ్డరసము | ,, | ఉసిరికబెరడు | ,, |
| కరక్కాయబెరడు | ,, | తానికాయబెరడు | ,, |
| చేదుపొట్ల | ,, | వాకుడు | ,, |

వీనిని ఎండించి కచ్చాగాదంచి యుంచుకొని ఆ రసము వచ్చినపుడు కషాయము వస్తువులకు పదహారు రెట్లు ఎక్కువగా నీళ్ళుపోసి 8 వ వంతు యుండునటుల కాచి దింపుకొనవలెను.

ఒక ఔన్సు కషాయము సేవించిన శీత, విషజ్వరములు, చర్మరోగములు, నైమిరోగములు, పైత్యము వీనిని పోగొట్టును.

## దశమూల క్వాథ చూర్ణము

| | | | |
|---|---|---|---|
| మారేడు | 1 పలం | కోలపొన్న | 1 పలం |
| దుండిలము | ,, | మయ్యాకుపొన్న | ,, |
| నేలములక | ,, | పెద్దముల్లు | ,, |
| వాకుడు | ,, | తక్కిలి | ,, |
| పల్లేరు | ,, | కలిగొట్టు | ,, |

వీనిని ఎండించి కచ్చాగా దంచి భద్రపరచుకొనవలెను. అవసరము కలిగినపుడు విధిప్రకారము కషాయము కాచుకొని వాడుకొనవలెను.

దీనిని సేవించుటవలన వాత, కఫములు, శ్వాసకాస, విషమసన్నిపాత జ్వరములు నివారణయగును.

మరియు హృదయమునకు బలము నిచ్చును. ఉత్తేజమును కలిగించును.

| | | | |
|---|---|---|---|
| వాతరాక్షసము | 1 చిన్నం | కస్తూరి | ¼ చిన్నం |
| జాన్న | 2 చిన్నములు | సాపుజాతు | 2 చిన్నములు |
| రొయ్యకీర | 2 చిన్నములు | పిప్పళ్ళు | 2 చిన్నములు |

వీనిని జట్టమగు కషాయముతోగాని చిత్రమూలము కషాయముతోగాని నూరి గురిగింజలంత మాత్రలుచేసి పూటకు ఒక మాత్ర చొప్పున సేవించిన చచ్చువాతము పక్షవాతము నివారణయగును. పైకి మాషతైలము మర్దించవలెను.

## పంచతిక్త క్వాథ చూర్ణము

| | |
|---|---|
| ముదిరిన వేపపట్ట | ములక |
| వాకుడు | తిప్పతీగ |
| చేదుపొట్ల | |

వీనిని సమము గ్రహించి ఎండించి కచ్చాగాదంచి భద్రపరచవలెను. అవసరము కలిగినపుడు విధిప్రకారము కషాయము కాచి యుపయోగించుకొనవలెను.



దీనిని ఒక నెల సేవించిన చర్మరోగము విసర్పము, శీత జ్వరము, విషమజ్వరము, పురాణజ్వరము, మలేరియా మున్నగు జ్వరాలను శమింపజేయును.

మరియు పైత్యరోగములను హరించి రక్తమును శుద్ధిచేసి వృద్ధిని కలిగించును.

## స్తన్యశోధక క్వాథ చూర్ణము

| | | | |
|---|---|---|---|
| కలుప్రాకుగ | 1 తులం | తిప్పతీగ | 1 తులం |
| చేదుపొట్ల | ,, | వేపయీనెలు | ,, |
| తానికాయబెరడు | ,, | కరక్కాయబెరడు | ,, |

వీనిని గ్రహించి ఎండించి కచ్చాగా దంచి 16 పలముల నీళ్ళలోపోసి 12వ భాగము కషాయము దింపుకొని పూటకు అర్ధ తులము పుచ్చుకొనవలెను.

### మరొకవిధము

| | | | |
|---|---|---|---|
| శొంఠి | 1 తులం | చిత్రమూలము | 1 తులం |
| చవ్యం | ,, | పాడి | ,, |
| పిప్పళ్ళు | ,, | | |

వీనిని కచ్చాగా దంచి 16 పలముల నీళ్ళలో 12-వ భాగము మిగులునట్లుగ కాచి దించుకొని వడియబోసి పూటకు అర్ధపలము పుచ్చుకొనవలెను

ఇది గర్భకోశమును శుద్ధపరచును. మరియు తల్లులకు చనుబాలు దోషములను పోగొట్టును, పాలు తేలికగను, పిల్లలకు బలవర్ధకముగను నుండును. పిల్లలకు తల్లిపాలవలన కలుగు అజీర్ణవ్యాధులు వాంతులు, విరేచనములు మున్నగునవి సంభవించినపుడు యీ యోగమును అనుష్టింపవలెను అట్టి సందర్భమున తల్లిపాలను నిలుపుట మంచిది. పై రెంటికిని గుణమొక్కటియే యగును.

## స్తన్యవర్ధక క్వాథ చూర్ణము

| | | | |
|---|---|---|---|
| దర్భవేళ్ళు | 1 తులం | పత్తిధాన్యపువేళ్ళు | 1 తులం |
| వట్టివేళ్ళు | 1 తులం | కాశవేళ్ళు | 1 తులం |

| | | | |
|---|---|---|---|
| కుశవేళ్ళు | 1 తులం | గుండ్రయునుగడ్డివేళ్ళు | 1 తులం |
| శాలిధాన్యపువేళ్ళు | ,, | ఉక్కటయునుగడ్డి | ,, |
| చెఱకువేళ్ళు | ,, | కత్తృణయునుగడ్డివేళ్ళు | ,, |

ఈ వస్తువులను దంచి 16 పలముల నీళ్లుపోసి మధ్యాగ్నితో అష్టభాగము మిగులునటుల కాచి దించి వడియబోసికొనవలెను.

ఈ కషాయమును అర్ధపలము పంచదార పాలు కలిపి పుచ్చుకొనిన చనుబాలు వృద్ధియగును మరియు బలము నిచ్చును.

### మహారాస్నాదిక్వాథ చూర్ణము

| | | | |
|---|---|---|---|
| సన్నరాష్ట్రం | 2 తులం | రేలకాయగుజ్జు | 1 తులం |
| కరక్కాయబెరడు | 1 తులం | దురదగొండివిత్తులు | ,, |
| అతివస | ,, | బలావేళ్ళు | ,, |
| చవ్యము | ,, | తుంగముస్తెలు | ,, |
| పిల్లిపీచర | ,, | ఆముదవేళ్లు | ,, |
| పిప్పళ్ళు | ,, | దేవదారుచూర్ణము | ,, |
| పునర్నవా | ,, | గుడూచి | ,, |
| ములుగోరింట | ,, | పెద్దమానుచెక్క | ,, |
| ధనియాలు | ,, | కచ్చూరాలు | ,, |
| వస | ,, | సోపు | ,, |
| బాకుడు | ,, | ములక | ,, |
| వల్లేలు | ,, | అడ్డసరము | ,, |
| శొంఠి | ,, | అశ్వగంధి | ,, |

వీనిని మెత్తగాదంచి 16 పలముల నీళ్ళలో బోసి 2 జాములు నానబెట్టి పిదప మధ్యాగ్నిచేత 8 వ భాగము మిగులునటుల కాచి వడియబోసుకొనవలయును.

అర్ధపలము పెద్దలకు పిల్లలకు కాలుపలము వంతున సేవించిన వాతమును హరించును. ఆకలిని కలిగించును.

అండవృద్ధి, ఆంత్రవృద్ధి, శ్లీపదము వీనిని కూడా పోవడచును.



### ద్రాక్షాది చూర్ణము

| | | | |
|---|---|---|---|
| ద్రాక్షపండ్లు | 1 తులం | నాగకేసరాలు | 1 తులం |
| ఉసిరికపప్పు | ,, | తెల్లచందనం | ,, |
| తుంగముస్తెలు | ,, | వల్లేరుకాయలు | ,, |
| వరిపేలాలు | ,, | పిప్పళ్ళు | ,, |
| తెల్లకలువదుంపలు | ,, | ఖర్జూరపుకాయలు | ,, |
| ధనియాలు | ,, | శొంఠి | ,, |
| అతిమధురం | ,, | ఏలక్కాయలు | ,, |
| వట్టివేళ్ళు | ,, | లవంగంపట్ట | ,, |
| కచ్చూరాలు | ,, | కురువేరు | ,, |
| సుగంధిపాల | ,, | ఆకుపత్రి | ,, |
| సీమతవాషీరి | ,, | హారతికర్పూరం | ,, |
| తాలిసపత్రి | ,, | | |

వీనిలో ద్రాక్షపండ్లు, ఖర్జూరపుకాయలు వీనిలోని గింజలను పుల్లలను తొలగించి ఖల్వములో మెత్తగా నూరి ఉసిరికపప్పు, అతిమధురం, శొంఠి చూర్ణము వేసి కలియనూరి ఎండించవలెను. అపుడు చూర్ణమగును. వరిపేలాలు దంచి జల్లెడపట్టి కలుపుకొనవలెను. హారతికర్పూరమును నూరుచు మిగిలిన చూర్ణమునుకొంచెము కొంచెముగ వేయుచు నూరవలెను. వీటన్నిటిని కలిపి నూరి జల్లెడ పట్టవలెను. పిదప 6 పలముల పంచదార కలుపుకొని సీసాలో భద్రపరచవలెను.

దీనిని 10 గురిగింజల ఎత్తు నుండి 20 గురిగింజల ఎత్తువరకు సేవించిన శరీరమునకు బలమును కలిగించును, ఆకలిని కలిగించును.

శరీరము వేడిగనుండి చిక్కిపోవువారికి దగ్గుకలవారికి అత్యంత గుణమిచ్చును.

శ్వేతప్రదరము కలవారికి పేరిన నేతితో సేవించవలెను.

క్వాథచూర్ణ ప్రకరణము సంపూర్ణము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణి వైద్యము

## పానక ప్రకరణము

### కొన్ని సూచనలు

పానకములకు ముఖ్యవస్తువులు బెల్లము, చక్కెర, కలకండ ఇవి. ఆయా రోగములందు యేయే వస్తువు చెప్పబడినదో దానినే వాడవలెను. పానకములకు నిమ్మరసము, నారింజరసము, కమలాపండ్ల రసము, ఇవియు, సుగంధపాల, గులాబిపువ్వు, వట్టివేళ్ళు వీటి కషాయములు గాని ద్రవములగును. కషాయములైన పక్వమైన కషాయములను శుద్ధవస్త్రముతో వడియపోసి గ్రహింపవలెను. ద్రవమును, బెల్లము మున్నగు మధుర పదార్థములు కొలత ప్రకారము వేసి కాచి తీగపాకము వచ్చునపుడు దింపుకొని భద్రపరచవలెను. దీనినే సిరప్ అనియు, షర్బత్తు అనియు నందురు.

పానకము తయారుచేయునపుడు ద్రవముతో ముందుగ పంచదారో, లేక యే వస్తువు చెప్పబడినదో దానిని కరగించుకొని పొయ్యికెక్కించి పక్వము చేయవలెను. పానకము కాచునపుడు అందులోని మురికి పోవుటకై నిమ్మరసము కొంచెము వేసిన నురుగుతో కలిసి మురికి పైకి తేలును దానిని తీసివేయవలెను.

పానకము తయారు చేయునపుడు వైద్యుడు పొయ్యివద్దనే యుండి జాగ్రతగ కలుపుచు పొంగు రాకుండ చూచుకొనవలెను పాకము సమముగ గమనింపబడవలెను. పాకము ముదిరినచో చెక్కునను,



పాకపాత్ర కళాయిపాత్రగ నుండవలెను. నోరు వెడల్పుగ నుండవలెను. కాయునపుడు మూత పెట్టరాదు.

బెల్లము, పంచదార కలియుటచే త్వరితముగ పొంగు వచ్చును. కనుక వైద్యుడు దగ్గరేయుండి పాకము పెట్టవలెను.

### స్వర్ణముఖ పానకము

| | | | |
|---|---|---|---|
| సునాముఖ ఆకు | 7½ పలము | లేంగజ్జ | 4 పలములు |
| గులాబి మొగ్గలు | 4 ,, | శొంఠి | 1 పలం |
| బెల్ల తేగడ | 4 ,, | పంచదార | ½ వీశ |
| ద్రాక్ష | 4 ,, | | |

పై వస్తువులను కత్తితో ముక్కలుగ నరికి పిదప మెత్తగా దంచి 10 వళ్ళ నీళ్ళుపోసి మధ్యాగ్నితో 4వ భాగము మిగులునటుల కషాయము కాచి దింపుకొని వడియబోసి దానిలో పంచదారను కలిపి తీగపాకము వచ్చునపుడు దింపుకొని సాంకేతలమున సీసాలో భద్రపరచుకొనవలెను.

దీనిని 1 ఔన్సు మొదలు 3 ఔన్సులవరకు 1 కి 2 పాళ్ళ నీళ్ళు కలిపి సేవించవలెను. 5 సంవత్సరముల వయస్సునుండి 20 వయస్సుగల పిల్లలకైన అర్ధభాగ మీయవలెను. 5 సంవత్సరముల వయస్సులోపు గల పిల్లలకు పానకము నీయరాదు.

మలబద్ధకము కలవారు ఉదయ, సాయంకాలములందు సేవించిన తీరును. మూలవ్యాధి కలవారుకూడ పై విధముగ సేవింప వచ్చును.

| | | |
|---|---|---|
| నిమ్మపండ్ల రసము | 30 ఔన్సులు | |
| అల్లపు నిజరసము | 10 | ,, |
| పంచదార | 80 | ,, |

అల్లపురసములో అడుగున తేరుకట్టి సున్నమును నివర్తించి రసములు గ్రహించి దానితో నిమ్మపండ్ల రసముకూడ చేర్చుకొని పంచదారనందు కలుపుకొని, అది కరిగిన తర్వాత మధ్యాగ్నిచే

లేతపాకము వచ్చువరకు కాచి దించి వడియబోసుకొని సీసాలో భద్రపరచవలెను.

¼ నుండి ½ ఔన్సు వరకు నీళ్ళుకలిపి పుచ్చుకొనిన పైత్యము, అరుచిని, దాహము ఖండించును. నోటికి రుచినిచ్చును. బలహీనముగ నున్నపుడు తులము చొప్పున దినమునకు మూడు మారులు యీయవలెను. కొన్ని యౌషధములకు అనుపానముగ దీనిని వాడుదురు.

### పంచతిక్తపానకము

| | |
|---|---|
| మూడు సంవత్సరముల ముదురు వేపచెక్క | 2 పలములు |
| చేదుపొట్ల | 2 పలములు |
| వాకుడు | 2 పలములు |
| తిప్పతీగె | 2 పలములు |
| అడ్డసరము | 2 పలములు |
| పంచదార | 30 పలములు |

వస్తువుల మెత్తగ దంచి 2 వీశెల నీళ్లుపోసి మధ్యాగ్నిచే నాల్గవ భాగము మిగులునటుల కషాయము దింపుకొని వడియబోసి పంచదారనందు కలిపి, కరిగిన పిదప కళాయిపాత్రలో పొయ్యిక్రింది మధ్యాగ్నిచే లేతపాకము వచ్చినపుడు దింపుకొని సాంగశీతలమున వడియబోసి సీసాలో భద్రపరచవలెను.

ఒక ఔన్సు నుండి 2 వరకు రెండింతలు నీళ్ళుకలిపి సేవించవలెను. పిల్లలకు అర్ధభాగము.

దీనిని సేవించుటచే క్రిమి, చర్మరోగము, శీతజ్వరము, మలేరియా, ఇన్ ఫ్లూయెంజా, ప్లేగు ఇవి మానును. రక్తమును శుద్ధిపరచును. శరీరమునకు కాంతి నిచ్చును.

### శారిబాదిపానకము

| | |
|---|---|
| సుగంధిపాలవేళ్ళ పొట్టు | 16 పలములు |
| అతిమధురం | 2 పలములు |



| | |
|---|---|
| ఖర్జూరపుకాయలు | 2 పలములు |
| వట్టివేళ్ళు | 2 పలములు |
| తెల్ల చందనపు పొట్టు | 2 పలములు |
| ఏలకాయలు | 2 పలములు |
| ద్రాక్షపండ్లు | 2 పలములు |
| చక్కెర | 1¼ వీశె |

వస్తువులను మెత్తగా దంచి 12 పళ్ళ నీళ్లుపోసి మధ్యాగ్నిచే నాలుగవ భాగము మిగులునటుల కషాయము దింపుకొని కళాయి పాత్రలో వడబోసి యందు పంచదార కలిపి కరగించి పొయ్యిక్రింది లేతపాకము వచ్చువరకు కాచి దింపుకొని వడబోసి సీసాలో భద్రపరచవలెను.

అర్ధ ఔన్సునుండి ఒక ఔన్సువరకు మూడింతలు నీళ్ళుకలిపి సేవించవలెను. పిల్లలకు అర్ధభాగము.

ఇది సమధాతువును కలిగించును, పైత్యమును పోగొట్టును.

వేసవికాలమున యెండలో తిరిగి వచ్చినవారు దీనిని సేవించిన అత్యుష్ణము హరించును. దినమునకు రెండు ఔన్సులకంటె నెక్కువ సేవించరాదు.

పానకముల ప్రకరణము

సంపూర్ణము



శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

## నేత్రరోగౌషధముల ప్రకరణము

### గమనింపవలసిన విషయములు

నేత్రరోగ ఔషధములు వర్తులుగ అనగా సన్నగా పొడుగా తయారుచేయబడునవి ఇందు తామ్రభస్మము, లోహభస్మము ఆయా రోగములందు చెప్పబడిన ప్రకారము చేర్చబడవలెను. పటికారము, మైలతుత్తము చేర్చవలసిన రోగములందు వానిని శుద్ధిచేసి నిప్పుపై పొంగించి బూడిద అయినతర్వాత చేర్చవలెను. మణిశిల, తాళకము వీనిని చేర్చవలసినపుడు వానిని శుద్ధిచేసి మెత్తగ నూరి ప్రమాణము ప్రకారము చేర్చవలెను. శొంఠి మున్నగు వస్తువులను చేర్చవలసినచోట వానిని బాగా దంచి చూర్ణము చేసి వస్త్రగాళితముచేసి కలుపుకొనవలెను.

ఔషధముల మర్దనమున కుపయోగింపబడు ద్రవములు అనగా స్వరసములు, కషాయములు, కొబ్బరిజలము, కాంపోదకము ఆకాశజలము ఇవి. ఆయా రోగములందు వివరింపబడిన విధమున చేర్చుకొనవలెను.

ఈ నేత్రరోగౌషధములను ఎంత ఎక్కువగ మర్దించిన నంత మంచిది. గరుకులుండరాదు. ఔషధములను శుభ్రమైన సీసాలలో భద్రపరచవలెను. చుక్కలుగ వాడదగిన మందులను అందుకని ప్రత్యేకమైన సీసాలలో నుంచుకొనవలెను. అంజనములను రెప్పలకు రాయవలెను. చుక్కల మందును వేయవలసి వచ్చినపుడు రోగిని వెల్లకిల పండబెట్టి యామందును కళ్లలో వేయవలెను



వర్తులను వాడవలసి వచ్చినపుడు సానను చేసి శుభ్రముగ కడిగికొని ఆయా రోగములందు చెప్పబడిన ద్రవముతో అరగదీసి యుపయోగింపవలెను. మందును వాడిన తర్వాత కండ్లను నలుపరాదు. కండ్లనుండి నీరు కారిపోయిన తర్వాత శుభ్రమైన గుడ్డతో కండ్లను తుడుచుకొని తర్వాతగాని నిద్రింపరాదు.

ఇందును గల పథ్యమును తప్పక గమనింపవలెను. కారము, పులుపు, ఎండను చూచుట, స్త్రీ సంపర్గము, అరమానిండి, పొగ, నిప్పువద్దగాని, పొగలోగాని యుండుట తగదు.

### నేత్రబిందు

బాగా పొంగించి బూడిదచేసి వస్త్రగాళితము చేసిన 1 పలము పటికారము 16 పలముల పన్నీరు కొద్దికొద్దిగా వేసి బాగుగా నూరి సీసాలో పోసి 4 జాములుంచి తర్వాత మూడుసార్లు వడపోసి భద్రపరచవలెను.

దీనిని కండ్లు కలిగినవారికి ఎండ ఎక్కకముందు ఐదు చుక్కలు ఎండ తగ్గిన తర్వాత ఐదు చుక్కలు కంటిలో వేసిన నయమగును. మరియు కండ్లు ఎర్రబారుట కండ్ల కలకలు తీరును.

### నారికేళాంజనము

| | | | |
|---|---|---|---|
| అతిమధురం | 1 పలం | కానిక్కాయ | 1 పలం |
| కరక్కాయ | 1 పలం | ఉసిరికకాయ | 1 పలం, |
| మానిపసుపు | 1 పలం | | |

వీని దంచి 128 ఔన్సుల నారికేళ జలముపోసి 16 ఔన్సులు మిగులునట్లుల కాచి వడియబోసి మరొక కుండలో పోసి చిన్నని మంటచే మరగ కాచి 8 ఔన్సులుండగా దింపి చల్లార్చి యందు

| | | | |
|---|---|---|---|
| శుద్ధ మైలతుత్థము | ¼ తులం | రసాంజనము | ¼ తులం |
| పచ్చకర్పూరము | ,, | మిర్యాలు | ,, |
| సముద్రపు నురుగు | ,, | | |

వీనిని పోసి కొద్దికొద్దిగ కేన వేయుచు నూరవలెను. అన్ని వస్తువులు కలిసిపోయిన తర్వాత సన్నని గుడ్డలో వడియబోసి

యుంచుకొనవలెను. ఈ ఔషధములో నీ రేమాత్రము కలియ కూడదు.

దీనిని నేత్రములకు వాడుటవలన కండ్ల దురదలు, నలకల బాధ, కండ్లమంటలు, నిద్రరాకపోవుట, కండ్లు ఎర్రబారుట, పూలుసు కట్టుట, కండ్లు పొంగుట ఇట్టివన్నియు తీరును.

### సిద్ధనాగార్జునవర్తి

| | |
|---|---|
| కరక్కాయపప్పు | 1 తులం |
| తానికాయపప్పు | ,, |
| ఉసిరికాయపప్పు | ,, |
| శొంఠి | ,, |
| పిప్పళ్ళు | ,, |
| మిర్యాలు | ,, |
| సైంధవలవణము | ,, |
| అతిమధురం | ,, |
| తు॥ మైలతుత్తం | ,, |
| రసాంజనం | ,, |
| మెట్టతామరదుంపలు | ,, |
| లొద్దుగచెక్క | ,, |
| వాయువిడంగం | ,, |
| తామ్రభస్మం | ,, |

ముందుగ వస్తువులను దంచి మర్దించి వస్త్రగాలితము చేసికొనవలెను. మైలతుత్తమును పొంగించి బూడిద చేసికొనవలెను. తామ్రభస్మమును రసాంజనమును ఖల్వమున వేసి సైంధవలవణము కలిపి నూరి పచ్చాలను కూడా దానితో కలుపుకొని వర్షపునీటితో నూరవలెను పిదప చూర్ణమును కలుపుకొనవలెను అంతా కలియ నటుల నూరి వర్తులుగ చేసికొని భద్రపరచవలెను.

దీనిని మోదుగ పూలరసములో అంగరించి కంటికి వేసిన కండ్లలోని పువ్వులు నివారించును. చనుబాలతో వేసిన కండ్ల ఎరుపులు మానును.



### చంద్రోదయవర్తి

| | | | |
|---|---|---|---|
| కరక్కాయపప్పు | 1 తులం | తానికాయలపప్పు | 1 తులం |
| వస | ,, | శంఖములోని మధ్యభాగం | ,, |
| చంగల్వకోష్టు | ,, | తు॥ మణిశిలం | ,, |
| పిప్పళ్ళు | ,, | మిర్యాలు | ,, |

మణిశిలను మేకపాలతో మెత్తగానూరి, తర్వాత శంఖనాభిని నూరి, వస్తువులను చూర్ణించి వస్త్రగాలితము చేసిన దానిని కలుపుకొని మర్దించవలెను.

మూడుదినములు మర్దించి వర్తులుచేసి నీడను దుమ్ముపడకుండ ఎండించి భద్రపరచవలెను.

దీనిని తేనెతో అరగతీసి శెనగబద్దంత కంటిలో వేసిన తిమిరము, పటలరోగము, రెప్పలలో కలుగు దుర్మాంసము, రేచీకటి, కంటిపువ్వులు ఇవి నయమగును, దృష్టి శుద్ధియగును.

### కంటిపొరలకు

శంఖు చనుబాలతో అరగదీసి కంటి రెప్పలకు వేసిన పొరలు మానును.

### దుర్మాంసమును పోగొట్టుటకు

శుద్ధి చేసిన పాలతుత్థము నాలుగుపాళ్లు మిరియాలు పచ్చాలు ఇవి 8 పాళ్ళు వీనిని నిమ్మపండ్ల రసములో నూరి కంటి పొరలకు పట్టించిన దుర్మాంసము కరించును.

### కన్నువాచినందుకు

నల్లతుమ్మచెక్క గంధము తీసికొని వెచ్చగా కంటి పొరలపై పట్టించిన వాపు తగ్గును

నేత్రరోగౌషధముల ప్రకరణము

సంపూర్ణము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

## షర్బతు ప్రకరణము

### రోజాపువ్వు షర్బత్తు

12 పలముల రోజాపువ్వును 1¼ పళ్ళ శుద్ధ జలమున బోసి 1 పడికి యింగిలినపుడు దింపుకొని వడియబోసికొనవలెను. అందులో మళ్ళీ 12 పలముల పువ్వును వేసి అర పడి యింగుల కాచుకొని, వడియబోసుకొని యందు 21 పలముల పువ్వును వేసి కాలుపడికి దింపుకొని వడిబోసి చీని పంచదార 10 పలములు కలిపి తీగపాకము వచ్చువరకు కాచి దింపుకొనవలెను.

1 ఔన్సు నీళ్ళ కలిపి పుచ్చుకొనిన మలబద్ధము, మూలము, పైత్యము ఇవి తీరును.

### పచ్చిద్రాక్షపండ్ల షర్బత్తు

పచ్చిద్రాక్షపండ్ల రసము 20 పలములు చీని చక్కెర 20 పలములు కరగించి పొయ్యికెక్కించి తీగ పాకమువచ్చువరకు కాచి దింపునపుడు 3 పలముల పన్నీరుపోసి భద్రపరచవలెను.

దీనిని ఒకపలము తగిన నీరుకలిపి సేవించిన పైత్యవికారము, పైత్యోష్ణము శమించి ఆకలిని కలిగించును.

### సుగంధపాల షర్బత్తు

ఒకపడి శుద్ధోదకమును పొంగించి దింపుకొని యందు 16 పలముల సుగంధపాలవేళ్ళను కచ్చాగా దంచివేసి 6½ గంటలసేపు



నానబెట్టి తర్వాతను పొయ్యికెక్కించి ఒకటికి ఎనిమిది పడి యింగులు పటుల కాచి వడబోసుకొని యందు 16 పలముల పంచదార కలిపి కాచి తీగ పక్వమున దింపుకొని సీసాలో భద్రపరచవలెను.

దీనిని రెండు తులములు తగిన జలము కలిపి సేవించిన గళోష్ణము, ప్రమేహము, నీరుచురుకు ఇట్టివి తీరును.

### నిమ్మపండ్ల షర్బత్తు

నిమ్మపండ్లరసము పిండి వడపోసి తీసిన దానికి రెండున్నరవంతు లెక్కువ పంచదార కలిపి కాచి తీగ పాకమున దింపుకొని చల్లారిన పిదప సీసాలో భద్రపరచవలెను.

పూటకు ఒక తులము రెండింతలు జలముచేర్చి పుచ్చుకొనిన పైత్యవికారము, తల తిరుగుట ఇట్టివి తీరి ఆకలి కలిగించును.

### చందన షర్బత్తు

ముదిరిన గంధపు చూర్ణమును కాలుపడి జలములో ఒక దినము నానబెట్టి మరుదినము పొంగించి 4 పలముల కషాయము దింపుకొని వడపోసి 6 పలముల పంచదార కలిపి కాచి పక్వమైన తర్వాత 3 పలముల పన్నీరు బోసి సీసాలో భద్రపరచవలెను.

దీనిని పూటకు ఒక పలము తగిన నీరు కలుపుకొని సేవించిన మూలరోగము శాంతించును.

### దానిమ్మపండ్ల షర్బత్తు

దానిమ్మపండ్ల రసము 10 పలములలో 15 పలముల పంచదార కలిపి పక్వముగ కాచి చల్లార్చి సీసాలో భద్రపరచవలెను.

దీనిని మూడు తులములు నీరుకలిపి సేవించిన పైత్య సంబంధ వ్యాధులు తీరును.

### అల్లం షర్బత్తు

3 పలముల అల్లమును చిన్నముక్కలుగ నరికి 1½ ఆరాను వేడి జలములో 4 గంటల కాలము నానబెట్టి వడియబోసికొని 35 పలముల చక్కెర కలిపి పక్వముగ కాచి సీసాలో భద్రపరచవలెను.

ఒక తులము సర్బత్తును తగిన జలముతో కలిపి సేవించిన అజీర్ణము పైత్యము నివర్తియగును. ఆకలిని కలిగించును.

### తామర పుష్ప సర్బత్తు

ఎండిన తెల్లతామర పుష్పము 18 పలములు గ్రహించి మూడ్కాలువడి జలములో ఉడికించి మూడింట నొకవంతు దింపుకొని వడియగోసి 20 పలములు చక్కెరకలిపి పొయ్యికెక్కించి పక్వమున దింపుకొని సీసాలో భద్రపరచవలెను.

పూటకు 1½ తులము తగుమాత్రము జలముకలిపి సేవించిన తలనొప్పి, పైత్యజ్వరములు, పార్శ్వనొప్పి, కడుపునొప్పి, మేహ తాపము మున్నగునవి తీరును.

సర్బత్తు ప్రకరణము
సంపూర్ణము



శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు
# పులిప్పాణి వైద్యము
## ఇతర ఔషధములు



### ఆకలి కలిగించుటకు

| | | | |
|---|---|---|---|
| వాము | 1 పలము | చిన్నాదాలు | 1 పలము |
| కురాసాని వాము | 1 పలము | | |

వీనిని మెత్తగ చూర్ణించి 1½ పలము తాటిబెల్లములో కలిపి పిసికి కుంకుడుగింజలంత మాత్రలు కట్టి పూటకొకటి సేవించిన ఆకలిని కలిగించును.

### మరొకవిధము

పుదినా రసము 1 భా, నిమ్మపండ్ల రసము 3 భా, కలిపి చక్కెర కలిపి సేవించిన ఆకలిని కలిగించును,

### మేహ ఉష్ణమునకు

తుత్తిరాకు కషాయముపెట్టి దానితో గోక్షీరము, పంచదార కలిపి సేవించిన మేహ ఉష్ణము తీరును,

### ఎక్కిళ్లకు

రూమస్తకి, లవంగపట్ట యీ రెంటిని సమము, గ్రహించి కచ్చాగా దంచి తగుమాత్రము జలమున కషాయముకాచి చల్లార్చి యీయగా ఎక్కిళ్ళు మానును,

### మరొకవిధము

నెమలిరెక్క కాల్చిన భస్మమును కటుకరోహిణి కాల్చిన భస్మమును సమముగ్రహించి బాగుగ కలుపుకొని తగుమాత్రము తేనెతో రంగరించి పుచ్చుకొనిన ఎక్కిళ్లు మానును,

### మద్యము సేవించిన మత్తు తీరుటకు

ధనియాలు పులుపెక్కిన కాడిలో నూరి తగుమాత్రము సీతు కలిపి సేవించిన మద్యమత్తు తీరును. మరియు ముల్లంగి గడ్డల రసములో పటికారముపొడి కలిపి యిచ్చినను తీరును.

### మూత్రవిసర్జనకు

మేక పెంటికలను చిన్నపిల్లల మూత్రమున కలిపి కాచి పొంగువచ్చువరకుంచి దింపి పొత్తికడుపుకు పట్టించిన మూత్రము వెడలును.

### అరని పుండ్లకు

తెల్లగడ్డలు, వస, ఉమ్మెత్తవేరు సమము గ్రహించి సీరుతో నూరి మంచినూనెలో కలిపి పొంగించి నూనె యెఱ్ఱగ వచ్చువరకుంచి దింపి చల్లార్చి పుండ్లకు రాచిన నయమగును.

### నల్లమందు అలవాటును మాన్పుట

| | | | |
|---|---|---|---|
| జాజికాయ | 5 వరహాలయెత్తు | ఉమ్మెత్త | 10 వ. యె. |
| జాపత్రి | 5 వరహాలయెత్తు | పట్టివేరు | 10 వ. యె. |

ఈ వస్తువులను ఒకటిగ నూరి జాజికాయ ప్రమాణము మాత్రలుచేసి నీడనెండించి ఒకమాత్ర చొప్పున ఆవుపాలతో సేవించిన నల్లమందు అలవాటు పోవును.

### కామెరకు

| | | | |
|---|---|---|---|
| మనోశిల | 3 పలములు | సున్నము | 1 పలము |
| పసుపు | 3 పలములు | | |

వీనిని కలిపి నూరి కామెరకు పైపూతచేసిన నయమగును.

### అగ్నిక్షతపుండ్లకు

వెల్లిపలుగు దానిమ్మపండ్లబెరడు రెంటిని సమము గ్రహించి మాడు వరకు వేయించి చనుబాలలో కలిపి అగ్నిచే కాలిన పుండ్లకు వేసిన ఆరిపోవును.



### కత్తిగాయములకు

తుమ్మికియాకును నూరి మంచినూనెలో ఉడికించి కొంచెము ముద్దగ నగువరకు కాచి దింపుకొని గాయములకు వేసిన నయమగును.

### లింగవిజృంభణకు

విషముష్టి విత్తులు, పెన్నేరుగడ్డ వస సమము గ్రహించి ఆవు వెన్నలో నూరి లింగమునకు లేపనమిస్తూ రాగా విజృంభించును.

### తేలు కుట్టిన

నిమ్మపండ్లరసమున ఇంగువను చాది కుట్టినచోట వేసిన కుట్టినచోటు చల్లబడును.

### బంకవిరేచనములకు

| | |
|---|---|
| జాజికాయ | చింతగింజల బెరడు |
| మాచికాయ | ఎండిన మామిడిగింజ |
| దానిమ్మపండు బెరడు | గసగస తొవకువక్క |

వీనిని కాలుపలము గ్రహించి ఆవుపాలలో నానవేసి యొక దినముంచి మరుదినము యెండించి చూర్ణించి వస్త్రగాలితముచేసి దీని పంచదార రెండున్నరపలములు ఆవుపాలు అర్ధ అరాకులో వేసి పాకముబట్టి పై చూర్ణమును కలిపి లేహ్యపాకమున దింపుకొని ఒక పలము ఆవునేయి కలిపి యుంచుకొనవలెను.

ఉసిరికాయ ప్రమాణము రెండుపూటలు పుచ్చుకొనిన జిగట విరేచనము బంక విరేచనము రక్తవిరేచనము కట్టును.

### శరీరపుష్టియగుటకు

| | |
|---|---|
| శొంఠి | పిప్పళ్ళు |
| కరక్కాయ | తోక మిరియాలు |

వీనిని సమతూకము గ్రహించి చూర్ణించి, వస్త్రగాలితము చేసి ఖల్వమునయుంచి తేనెపోసి నూరి ఉసిరికాయ ప్రమాణము మాత్రలుచేసి నీడ నెండించి పూటకొక మాత్ర చొప్పున పుచ్చుకొని అరాకు ఆవుపాలు త్రాగిన శరీరము పుష్టినిచ్చును.

## పుల్లత్రేపులకు

బూడిదచేసిన వస, వేయించిన కరియుప్పు, ఇంగువ ఇవి సమభాగము గ్రహించి చూర్ణించి త్రికటి ప్రమాణము నోట వేసి కొని కొద్దిగ మజ్జిగ, తేనె వేన్నీళ్ళు త్రాగిన పుల్లత్రేపులు నివారణ యగును.

## తలలోని పేలు, గ్రుడ్లు నశించుటకు

పటికారమును పొంగించి పొడిచేసి వస్త్రగాళితముచేసి నీటిలో కరిగించి తలకంటుకొని 8 గంటలు నాని స్నానముచేసిన పేలు, పేలు నాశనమగును.

## అన్నద్వేషనివారణకు

నిమ్మపండును నాలుగుభాగములుగకోసి దానిలో, శొంఠి, మిర్యాలు, పిప్పళ్లు, వాము, ఇంగువ వీనిని కాలుపలము గ్రహించి చూర్ణించి నిమ్మపండులో నూరి, రాత్రిపూట మంచులో నుంచి ఉదయము ఒక బద్ద చొప్పున నాలుగు దినములు సేవించిన పైత్యవాయువు, తలతిరుగుట, వికారము, అజీర్ణము హరించి ఆకలి కలిగించును.

## నోటి అరోచకమునకు

ఏలకులు అర్ధపలము వేయించిన జీలకర 1 పలము వీనిని తగుమాత్రము నీటితో కషాయముకాచి చీనిచక్కెర కలుపుకొని సేవించిన అరోచకము మానును.

## వరిబీజమునకు

నల్లమందు, ములగబంక నేతితో నూరి పట్టు వేయవలెను, లేక ఆవాలు, వసనూరి పట్టువేసినను, గంటుభారంగి బియ్యం కడుగుతో నూరి పట్టువేసినను,

రాతి సున్నం కోడిగుడ్డు సొనతో నూరి పట్టువేసినను, హరించును.

## మరియు లోపలకు

ఆముదము, ఆవుపాలు సమముగా కలిపి పూటకు 3 తులముల చొప్పున సేవించిన నివారణయగును.



## కట్లు

గుచ్చుబిగుర్లు ఆముదముతో వెచ్చచేసి కట్టిన నయమగును, చింతపండు సున్నంకలిపి పట్టువేసిన నివారణయగును.

## వెర్రికుక్క, నక్క కాటులకు

గచ్చుపప్పు నూరి కలిలో కలిపి 5 ఔన్సులు త్రాగింపవలెను, మూడుదినములు చప్పిడి పథ్యము, 6 నెలలవరకు యిదే చికిత్స, మామిడికాయ, స్త్రీలంకైన ఆవాలు యివి పనికిరావు.

## సామాన్య కుక్క కాటుకు

నూనె బెల్లం జిల్లేడుపాలు కలియనూరి కరచినచోట వేయవలెను.

## చచ్చిన బిడ్డలను బయటకు తెచ్చుట

మిర్యాలు, మునగవేరు, సమం తరవాణితో నూరి తరవాణి కలిపి త్రాగించిన కడుపులోని చనిపోయిన శిశువు బయటపడును.

తెల్ల యీశ్వరవేరు అరగతీసి గంధమును కరచినచోట వేయవలెను. ఆ గంధమునే గురిగింజ ప్రమాణము లోపలికి సేవింపవచ్చును.

## చెవిలో కురుపు, చీమునకు

దుష్టపాకు రసములో ఉప్పు తగుమాత్రము కలిపి చెవిలో వేయవలెను, కురుపు మానును, చీము కట్టును.

## చెవుడుకు

మారేడుపండు ఆవు పంచితముతో నూరి కొంచెం నీళ్లు చేర్చి కాచి చెవిలోవేసిన చెవుడు నివారణయగును,

## చెవి పోట్లకు

గవ్వను కాల్చి పొడిచేసి కొంచెము చెవిలో వేసి నిమ్మపండ్ల రసము పోసిన పోట్లు మానును.

### చిన్నపిల్లల కామెర్లకు

కాల్చినచెక్క     లవంగాలు     ఏలకులు

ఇవి సమం గ్రహించి చూర్ణముచేసి పూటకు రెండు చిన్నములు తేనెతో యిచ్చిన 6 దినములలో నివర్తియగును.

### ఉబ్బుకామెర్లకు

గిద్దెడు ఆవుపెరుగులో 8 చుక్కలు కాకరాకుపసరు కలిపి యిచ్చిన ఉబ్బుకామెర్ల నయమగును.

### గోరుచుట్టుకు

పసుపు నీటిలో గుడ్డను తడిపి గోరుకు చుట్టిన నయమగును.

మరియు

పసుపు సున్నం కలిపి పారాణిచేసి గోరుపై రాసి గుడ్డచుట్టిన నయమగును.

### బోదకాలుకు

పెద్దకొనుపట్ట కషాయము గోమూత్రము సగము పాలు కలిపి ఒక మండలము దినములు రెండు ఔన్సుల చొప్పున సేవించిన బోదకాలు నివారణయగును.

### రక్తపుష్టికి

కుంకుమపువ్వును తేనెలో కలిపి మండలము దినములు సేవించిన రక్తపుష్టి కలుగును.

### స్త్రీలకు రొమ్మున కలుగు దుర్గంధమునకు

కరక్కాయ బెరడు, మారేడుచెక్క, తుంగముస్తెలు వీనిని సమం గ్రహించి చూర్ణించి స్త్రీల స్తనములపై నలుగుపెట్టిన దుర్గంధము మానును.

### మూత్రకట్టుకు

చిల్లగింజలు పొడిచేసి లేత కొబ్బరికాయకు రంధ్రము చేసి పొడి నందులోవేసి ఒకరాత్రి నాననిచ్చి ఉదయము ఆ కొబ్బరినీరు పుచ్చు



కొనవలెను. ఇటుల మూడు దినములు పుచ్చుకొనిన మూత్రము జారిగనగును. ఇచ్ఛాపథ్యము.

### ఉబ్బసదగ్గుకు

మిర్యాలు 7, పొట్టుతీసిన తెల్లగడ్డపాయలు 4, దుష్టూపాకు రసముతో మర్దించి చిట్టాముదముతో కలిపి పుచ్చుకొనిన కఫం విడలును, దగ్గు మానును.

### రక్తపీనసకు

ముక్కులో నుంచి నెత్తురు వచ్చుటకు గంగిరావికాయలు సగములగొట్టి లోనివిత్తనములను 16 తులెత్తుకుని మూడు మిరపగింజలు చేసి కాడిబోసి గుడ్డనుంచి పొట్లము కట్టి మూడు చుక్కలు ముక్కులో పిండవలెను. ఇటుల ఏడుపర్యాయములు చేయవలెను. ఉప్పు, పులుసు, పొగాకు వాడకూడదు రక్తపీనసము మానును.

### స్త్రీలు ముట్టైనపుడు కలుగు కడుపునొప్పికి

తాటిబెల్లం 1½ పలములు  పులిసిన పెరుగు 1 పలం

కళింగపండ్ల రసం 1 పలం

వీనిని కళాయిపాత్రలోపోసి పాకము పెట్టవలెను. అందు

| | | | |
|---|---|---|---|
| వెలిగారం | 1 పలం | నవాసారం | 1 పలం |
| సూరేకారం | ,, | జీలకర | ,, |
| గాజుప్పు | ,, | సైంధవలవణం | ,, |
| పటికారం | ,, | ఇంగువ | ,, |
| నవృకారం | ,, | కాంతపురాయి | ,, |

వీనిని మెత్తగ పొడిచేసి పై పాకములో కలిపి పిదప,

| | | | |
|---|---|---|---|
| తెల్లగడ్డలు | 1 పలం | మునగవేరు చెక్క | 1 పలం |
| తెల్లజిల్లేడుపాలు | 1 పలం | నేపాళ | 3 వ. ఎ. |

వీనిని కాటుకవలె నూరి పై పాకముతో కలిపి లేహ్యపాకముగ వండి దింపుకొనవలెను.

దీనిని గొంటివరకు ప్రమాణము పుచ్చుకొనిన, మొట్టుకొట్టు, సూతక వాయువు వాతమువలన కలుగు పోట్లు, కడుపునొప్పి, శరీరాంగములలో కలుగు నొప్పులు, సూతికాజ్వరములు, నడుము నొప్పి మున్నగునవి తీరును. ఆరోగ్యము కలిగి సంతానవతులగుదురు. ఇద్యాపథ్యము.

పందులు, వంగపిందెలు, ఉస్తికాయ, అల్లం పూరగాయ, మునగకూర, నారదబ్బకాయ, దురదకంద, ఆవుపాలు, గొయ్యతోటకూర, నల్లికాయవడియం, రేగుపండ్ల పచ్చడి, ఆవుమజ్జిగ, పులిచింతాకుపచ్చడి ఇవి హితమైనవి.

పైత్యవాయువులకు

| | | | |
|---|---|---|---|
| అల్లపురసం | 1 పడి | పుదినారసం | 1 పడి |
| దానిమ్మరసం | కాలుపడి | నిమ్మపండ్లరసం | కాలుపడి |

వీని నన్నిటిని కళాయిపాత్రలోపోసి చీనాచక్కెర 10 పలాలు పై రసములో కలిపి పొయ్యికెక్కించి పట్టవలెను.

| | | | |
|---|---|---|---|
| శొంఠి | 1 పలం | ధనియాలు | 1 పలం |
| మిర్యాలు | ,, | సైంధవలవణం | ,, |
| పిప్పళ్ళు | ,, | జీలకర | ,, |
| తాళిసపత్రి | ,, | | |

వీనిని మెత్తగ చూర్ణించి పై పాకమున కలిపి కలియబెట్టి పక్వసమయమున 4 పలముల తేనె, నాలుగుపలముల నేయి కలిపి లేహ్యపాకమున దింపుకొనవలెను.

పూటకు గచ్చకాయ ప్రమాణము పుచ్చుకొనిన పై వ్యాధులన్నియు తీరును పథ్యము పై విధమునకే.

పంజా - పాండు రోగములకు

గోవు పంచితము 18 శేర్లు కుండలోపోసి

| | | | |
|---|---|---|---|
| కరక్కాయ | 4 పలములు | మానిపసుపు | 4 పలములు |
| నల్లికాయ | ,, | తానిక్కాయ | ,, |

వీని కచ్చాగా దంచి పంచితములో వేసి పాత ఇనుప చిట్టెము 80 పలములు ఇనుము పొడి 80 పలములు, సూదంటురాయి 16 పల



ములు వీనిని పొడిచేసి అందులో వేసి పొయ్యికెక్కించి ఇరుకవటుల కాచవలెను.

| | | | |
|---|---|---|---|
| వాయువిడంగము | కాలు పలం | పిప్పళ్ళు | కాలు పలం |
| చిత్రమూలవేరుచెక్క | ,, | మిర్యాలు | ,, |
| గుంటగలగరవేరు | ,, | శొంఠి | ,, |
| | | ఏలకులు | ,, |

వీనిని చూర్ణించి వస్త్రగాలితముచేసి పై దానిలో కలిపి గచ్చకాయ పరిమాణము మాత్రచేసి పూటకు ఒకటి చొప్పున పెరుగులో కలిపి పుచ్చుకొనవలెను.

దీని సేవనవలన పంజా, పాండురోగములు, వాయువులు, గర్భస్థబల్లలు, గుల్మములు, పంజాలో కలుగు కడుపుబ్బరము, మోకాళ్ళు, మోచేతులవాపు, శరీరము రక్తము క్షీణించి తెల్లబడుట ఇట్టివన్నియు మానును.

కందిపప్పు, వాకుడుకాయ, దొండపండు, మునగపిందెలు, వంకపిందెలు, పుస్తివరుగు, గొయ్యతోటకూర, వేపిళ్ళు ఇవి హితకరములు, తేనె కలిసియు దీనిని సేవింపవచ్చును. పెరుగులో పుచ్చుకొనిన గ్రహణి, అతిసారము, మూలరోగము నివారణయగును.

సకలరోగములకు

| | | | |
|---|---|---|---|
| పాదరసభస్మము | 1 పలము | నాభి | 1 పలము |
| గంధక భస్మము | ,, | పగడ భస్మము | ,, |
| తాళక భస్మము | ,, | ముత్యపుచిప్పల భస్మం | ,, |
| వెలిగార భస్మము | ,, | పటికార భస్మము | ,, |
| శంఖ భస్మము | ,, | | |

వీనిని ఖల్వమందుంచి కలబందరసములో ఒక దినము నిమ్మపండ్ల రసములో ఒక దినము మర్దించి బిళ్ళలుచేసి 8 దినములు ఎండలో నెండించి లోతుగానైన రెండు చిన్నకుండలలో ఒక దానిలో అడుగున గుడ్డ తీసివేసి కలబంద మట్టలను పరచి దానిపై బిళ్ళల నుంచి పైన నాళ్ళి మట్టలను పరచి కుండమూకప్పి సందు లేకుండా 13

శీలముచేసి బాగా యెండించి పొయ్యి కెక్కించి బీరకట్టెలతో మధ్యాగ్నిచే 8 జాములు వండి చల్లారనిచ్చి ఔషధమును గ్రహించి ఖల్వములో నుంచి దానిలో,

| | | | |
|---|---|---|---|
| కుందనపురేకు | 1¼ వ. ఎ. | కస్తూరి | 1¼ వ. ఎ. |
| ముత్యములు | ,, | రుద్రాక్ష | ,, |
| పగడములు | ,, | వరిగ వెండి | ,, |
| పచ్చకర్పూరము | ,, | అక్కలకర్ర | ,, |

వీనిని మెత్తగ పొడిచేసి పై మందుతో కలిపి చనుబాలతో నాలుగుజాములు మర్దించి, పిదప నల్లతులసియాకు రసముతో నాలుగుజాములు, దానిమ్మపండ్లు రసముతో నాలుగుజాములు మర్దించి కజలికప్పెలుకట్టి ధన్వంతరిని భగవంతుని ధ్యానించి జాగ్రత పరచుకొనవలెను,

దీనిని అర్ధగురిగింజ ప్రమాణము తేనెలో లేక చనుబాలలో కలిపి సేవించిన సన్నిపాత జ్వరములు దోషములు హరించును.

వాసెడు చూర్ణము, లేక లేహ్య అనుపానముతో పుచ్చుకొనిన శ్వాసకాస, మేహక్షయ, ఉబ్బసము, కఫవాతరోగములు హరించును,

ప్రతిదినము చనుబాలతో పుచ్చుకొనిన గజబలమును కలిగించును,

శంఖపుష్ప రసముతో పుచ్చుకొనిన వాంతులు కట్టును,

అశ్వగంధి లేహ్యములో గాని అశ్వగంధి చూర్ణములో గాని కలిపి పుచ్చుకొనిన అస్థిగతజ్వరములు, పురాణజ్వరములు మానును,

పంచదార, అడ్డసరపు ఆకు రసము, లేక తమలపాకు రసములోగాని కలిపి పుచ్చుకొనిన శరీరపుష్టి, ధాతువృద్ధి వాజీకరము, కామోద్దీపనము కలుగును,

గంధపుచెక్క కషాయముతో పుచ్చుకొనిన వాంతులు కట్టును,

మానిపసుపు చూర్ణముతో పుచ్చుకొనిన, లేక తేనె, పంచదారతో కలిపి పుచ్చుకొనిన సమస్త మేహరోగములు నివారణ యగును,



మేహావెట్టలకు

| | | | |
|---|---|---|---|
| పొన్నగంటి ఆకు రసం | ¼ సేరు | కానాకురసం | ¼ సేరు |
| తంగేటిపూల రసం | ,, | బిల్వాకురసం | ,, |
| శ్రీగంధపుచెక్క కషాయం | ,, | ముల్లంగిగడ్డ రసం | ,, |
| వట్టివేళ్ళ కషాయం | ,, | నేలవుసిరిక రసం | ,, |

వీనిని ఒకకుండలో పోసి ఆవునెయ్యి ఒక వీసెడుపోసి పొయ్యి కెక్కించి కాచునపుడు,

| | | | |
|---|---|---|---|
| చలవమిర్యాలు | ¼ పలం | జిలకర | ¼ పలం |
| అతిమధురం | ,, | ధనియాలు | ,, |
| కోష్టం | ,, | జాజికాయ | ,, |
| జాపత్రి | ,, | పైడితంగేడిపట్ట | ,, |
| యేలకులు | ,, | కుదబదవిత్తులు | ,, |
| సాలామిస్రి | ,, | లవంగములు | ,, |
| కుంకుమపువ్వు | ,, | పచ్చకర్పూరము | ,, |
| నల్లతుమ్మవిత్తులు | ,, | | |

వీనిని చూర్ణించి పై దానిలో వేసి 5 పలముల చీనాకలకండ పొడిచేసి వేసి పావుసేరు పన్నీరు, అర్ధసేరు ఆవుపాలు కలుపుకొని పక్వమైన తర్వాత దింపుకొని భద్రపరచవలెను

పూటకు ఒక తులం చొప్పున సేవించిన మేహావెట్టలు, శరీరము మంట, శరీరోష్ణములు నీరుచుకుకు, చేతులు కాళ్ళు కండ్ల మంటలు ఇవన్నియు నివారణయగును శరీరము సమశీతోష్ణము కలిగి ఆరోగ్యముగ నుండును

తిప్పసత్తు
(తయారుచేయు విధము)

ముదిరిన తిప్పతీగ వేళ్ళను తెచ్చి కత్తితో పైపొట్టు తీసివేసి సన్నని ముక్కలుగ కొట్టి దంచి నీటిలో కడుగవలెను. జిగురు వచ్చు వరకు దంచి కడుగుచుండవలెను. కడిగిన నీళ్ళను ప్రత్యేకముగ నుంచవలెను జిగురు రాకపోయిన దంచి కడుగుటను మాని, మొదట కడిగిన నీళ్ళను వెడల్పాటి తాంబాళములో పోయవలెను. సత్తు అంత

తెల్లగ అడుగున చేరి, నీరు పైకి తేలును. ఆ నీటిని వంచివేయవలెను. ఈవిధముగనే రెండవసారి, మూడవసారి కడిగిన నీటిని తాంబాళము లలో పోసి యుంచవలెను. ఇందులో తయారగు సత్తు మొదటిదాని యంత తెల్లగ నుండదు. పైకి తేలిన నీటిని యెప్పటికప్పుడు వంచి వేయుచుండవలెను. ఇటుల చేరిన సత్తును బాగుగ యెండువర కుంచిన అది ముక్కలగును. ఇది రెండురోజులలో తయారగును. రాత్రియందు పాత్రమునకు మూతబెట్టి యుంచవలెను. మూలికను దంచునపుడు రోలుకుగాని, రోకలికిగాని, సున్నము ఏమాత్రము తగిలియుండినను సత్తు విరిగిపోవును. పళ్ళెములకు కూడ సున్నము తగులనీయరాదు

ఈ సత్తును ప్రత్యేకముగ వాడుటయేగాక ఇతర ఔషధముల లోను చేర్తురు.

దీనిని 2½ గురిగింజల ప్రమాణము నుండి ఏడు గురిగింజల యెత్తువరకు వాడవచ్చును.

ఇది జ్వరమును, పూరాణ జ్వరములను ధాతుక్షయము పోగొట్టును. బలవర్ధకము, రసాయనము వంటిది.

ఇతర ఔషధములకు అనుపానముగ వాడబడును.

పిండతైలము

| | | | |
|---|---|---|---|
| సుగంధిపాలపొట్టు | 10 పలములు | మంజిష్ట | 10 ప. |
| అతిమధురం | 10 పలములు | తేనెమైనము | 15 ప. |
| తెల్లగుగ్గిలం | 15 పలములు | ఆముదము | 8 వీశెలు. |

ప్రథమమున వస్తువులను కచ్చాగాదంచి భాండములో వేసి 25 వీశెల జలముపోసి నాల్గవభాగము మిగులునటుల కాచి వడియ బోసి ఆ కషాయములో ఆముదమును పోసి సన్నమదిగా కషాయము ఇగిరిపోవువరకు కాచి నీరుపోయినది తెలుసుకొని దింపి దానిని సన్నని గుడ్డలో వడియబోసి దానిని పొయ్యికెక్కించి తెల్లగుగ్గిలమును చూర్ణించి కొద్ది కొద్దిగ వేయుచు కలుపవలెను. గుగ్గిలము కలిసి పోయిన తర్వాత మైనమును ముక్కలుగ చేసి కొద్ది కొద్దిగ వేయుచు కల్పుచుండవలెను. ఇది వేయునపుడు పొంగవచ్చును. జాగ్రత తీసు



కొనవలెను. అవి రెండు కలిసిపోయిన తర్వాత దింపుకొని వేడి మీదనే సన్నటి గుడ్డలో వడబోసుకొని భద్రపరచవలెను. చల్లారిన గడ్డి పడిపోవును.

దీనిని వ్రణములపై రాసిన యెటువంటి వ్రణమునైనను మాన్పును. మరియు కీళ్ళవాతమునకు దీనిని చరిమి మర్దించిన గుణ మగును. వాపునకుపైన దీనిని చరిమిన వాపు తగ్గిపోవును

కాలిన పుండ్లకు లేపనముచేసిన త్వరగ మానును. చీముపట్టిన పుండ్లైన చీమును వత్తితో తుడిచి వీనిని వాడవలెను.

వరిబీజమునకు దీనిని చరిమి గోచి పెట్టుచుండిన వాపు తగ్గి బాధ నివర్తియగును. కాళ్ళ వగుళ్ళకు అమోఘ గుణకారి. ఏనుగ కాలుకు దీనిని వాడుచుండిన వాపు తగ్గును. తాపము దురద వీనిని పోగొట్టును.

సూతికాభరణము

| | | | |
|---|---|---|---|
| శుద్ధకృష్ణాభ్రక సింధూరం | 1 తులం | స్వర్ణభస్మం | 1 తులం |
| వైక్రాంత భస్మం | ,, | లోహభస్మం | ,, |
| తామ్రభస్మం | ,, | శు॥ నాభి | ,, |
| శు॥ పాదరసం | ,, | శు॥ గంధకం | ,, |
| రజితభస్మం | ,, | సీసభస్మం | ,, |
| వంగభస్మం | ,, | | |

వీనిలో రసగంధకములను కజ్జలి చేసికొని పిదప భస్మములను కొద్ది కొద్దిగ వేయుచు మర్దించవలెను. ఆఖరున నాభిని కలుపుకొని మర్దించవలెను.

| | |
|---|---|
| గుంటగలగరాకు రసము | చిత్రమూల రసం |
| తెల్లగజ్జెరు రసము | అడ్డసర కషాయం |
| చిఱ్ఱబొద్ది కషాయము | తిప్పతీగ కషాయము |
| తుంసిరాను రసము | అక్కలకర్ర కషాయం |
| ఉమ్మెత్త రసము | బోడతరం రసము |
| జంబీర రసము | చన్న చర్లగడ్డ రసము |
| కలబంద రసము | కాకరాకు రసము |

వీనిలో ప్రత్యేక ప్రత్యేకముగ ఒక్కొక్క ద్రవముచేత 4 జాములు మర్దించవలెను. పిదప ఎండించి గాజుకుప్పెలో సగము వరకు పోసి సీలుచేసి వాలుకాయంత్రమున 8 జాములు పాకము చేయవలెను. గంధకము పోకుండగ తీసికొని చూర్ణించి తర్వాత,

| | |
|---|---|
| చేప చేదు | కోడి చేదు |
| అడవిపంది చేదు | మేక చేదు |
| తాబేలు చేదు | ఏనుగ చేదు |
| దున్నపోతు చేదు | ఉడుము చేదు |
| నెమలి చేదు | గుర్రపు చేదు |
| త్రాచుపాము చేదు | పావురాయి చేదు |
| మొసలి చేదు | |

వీనిలో ఒక్కొక్కరోజు ఒక్కొక్క చేదుతో నీళ్ళతో కల్కము దీనిపై కొంచెమును మర్దించవలెను. ఇటుల భావన మర్దనలైన తర్వాత కుప్పెచేసి జాగ్రతగ నుంచుకొనవలెను.

అర నుండి 1 గురిగింజయెత్తు సేవించిన గర్భాశయము శుద్ధియగును, హృదయమునకు బలమునిచ్చును, రక్తవేగమును శమింపచేయును, సూతికారోగమును హరించును.

త్రికటుకముల చూర్ణము 1 తు, సదాపాకు చూర్ణము 1 తు, రెంటితో సూతికాభరణము ఒకటికి పదహారవవంతు కలిపినూరి శెనగ యెత్తు వేసి నీళ్ళతో రెండుపూటలు యిచ్చిన సూతికాజ్వరము లన్నియు తీరును. ఆకలిని కలిగించును.

ఏకవల్లిపాయ, నిరుపాల, పిప్పళ్లు, వేప ఈనెలు, కరివేపాకు యీనెలు, వావిలాకు ఈనెలు, చికిరింతకాయలు, జటామాంసి, ప్రతివి ఒక తులం గ్రహించి కచ్చాగా దంచి 40 తులముల నీళ్ళలో ఎనిమిదవ భాగము మిగులునటుల కషాయము కాచి దింపుకొని చిట్టాముగింజ తూకము 1 కొన్న కషాయముతో సేవించిన ప్రసవించిన వారికి నైన నడుము నొప్పి, జ్వరము, పోట్లు ఇట్టివి నివారణయగును. మరియు ధనుర్వాతము, కంపవాతము, శ్లీహ, గుల్మము వీనినికూడ నివారించును.



ఉబ్బసమునకు.

శొంఠి 1 భా॥ మిరియాలు అర భా॥ లవంగాలు 1 భా॥ పిప్పళ్లు అర భా॥ కరక్కాయ పోలుపు 1 భా॥ తుంగ గడ్డలు ఇన్నిటికి సమానము పాతబెల్లం వేసి ఖల్వములో వేసి నూర్చి కుంకుడుగింజ ప్రమాణము మాత్రలు చేసి నీడనార్చి పుక్కిటబెట్టి ద్రవము మ్రింగుచుండిన యెడల ఉబ్బసము, దగ్గు, పిల్లికూతలు రొంప తక్షణమే నివారించును.

సర్వవ్యాధులకు సిద్ధక్రియ

శు॥ నాభి 1 భా॥ శు॥ రసము 1 భా॥ నేలతాడిదుంపలు 1 భా॥ గజపిప్పళ్ళు 1 భా॥ శొంఠి 1 భా॥ శు॥ గంధకం 1 భా॥ శు॥ తాళకము 1 భా॥ శు॥ ఇంగిలీకము 1 భా॥ కవిరి అర భా॥ కరక్కాయలు 1 భా॥ శు॥ వెలిగారము అర భా॥ నున్నాటి కరక్కాయలు అర భా॥ శు॥ నేపాళాలు 1 భా॥ వీటిని వేరువేరుగా చూర్ణించి గుంటగలగరాకు పసరుతో 3 రోజులును సన్నజెముడు రసముతో 1 పూట మర్దించి మిరపగింజ ప్రమాణము మాత్రలు కట్టి నీడ నెండించి ఒక మాత్ర తమలపాకు రసముతో నిచ్చిన కడుపునొప్పి నివారించును. నీటితో అరగదీసి యిచ్చిన పాము విషము దిగును. (కరచినచోట కొద్దిగా చాది కట్టుకొనవలెను.)

శొంఠి రసముతో అందు మాత్ర అరగదీసి తేలు కుట్టినచోట వేసిన విషము హరించును.

తేనెతో చాది యిచ్చిన శీతజ్వరాలు పోవును,

శిరోవ్యాధులకు గుంటగలగరాకు స్వరసముతో నివ్వవలయును,

పిప్పలి రసాన అరగదీసి కన్నులకు వేసిన శిరోవాయువులు హరించును.

ఆకుజెముడు సన్నజెముడు రసములతో నిచ్చిన పిల్లల సురకలు, అజీర్ణములు, అగ్నిమాంద్యములు, పిల్లల దగ్గులు, నివారించును.

కీళ్ళనొప్పులకు వరిగోగు నల్లవుప్పిచెక్క కషాయముతో సేవించేది.

పక్షవాతమునకు అల్లము సన్నరాష్ట్రము అనుపానముతో నిచ్చిన నివారణమగును.

6 గురిగింజల నుండి 16 వరకు నెయ్యి, తేనె, నీళ్ళు వీనితో కేనితోనైన సేవించిన క్షయరోగ, పిత్తరోగ చిన్నశ్వాసలు హరించును.

ఆమవాతమునకు

ఆముగముకు పాలయందు వేసి కాచి సేవనచేసిన ఆమవాత ములు నయమగును.

చంద్రోదయరసం

శు॥ రసం, గంధకం, కర్పూర శిలాజిత్తు భస్మం, అభ్రకం, వంగం, లవంగాలు, ఏలకులు, ఇవి సమాంశములు అంటిదుంప కలబంద రసాలతో 6 దినములు బాగా మర్దించి చిరికందిగింజంత మాత్రలు వాడుచుండిన విశ్రతిమేహములు, కామిలలు, హరించును.

అపానవాయువులకు

శిలాజిత్తు రెండు గురిగింజలయెత్తు ఆవునేతితో కలిపి వారమున కొక పర్యాయము యిచ్చిన అపానవాయువులు తగ్గును.

కమరకు

కొంత కరక్కాయ తిప్పతీగ సమం కషాయముగాచి గుగ్గిలము వేసి వేడిగ నున్నపుడు త్రాగించిన కమర, పిడలి, జంఘు వీక వీల్ల రొమ్ము బాధలు పోవును.

కస్తూరిమాత్రలు

యింగిలీకము 2 తు॥ రససింధూరం 2 తు॥ రసకర్పూరం 2 తు॥ జాజి ఒకటికి ఎనిమిది తులం పాదరసం ఒకటికి ఎనిమిది తులం రొయ్యవీర ఒకటికి ఎనిమిది తు॥ గోరోజనం ఒకటికి పదహారు తులం కటుకరోహిణి వేయించినది అర తులం కస్తూరి ¼ చిన్న తమలపాకు రసముతో మర్దించి పెసలు గింజంత మాత్రలుచేసి వాడేది. పసి పిల్లలకు కలిగే అన్ని రకముల జబ్బులకు మంచిది.



వీర్యవృద్ధి లేహ్యము

యష్టిమధుకము 20 భా॥ గొబ్బిగింజలు 30 భా॥ తులసి, గుమ్మడి, పత్తి, దొండ, వీర, ఉత్తరేణు, వెంపలి, దోస, రేగు, జాజికాయలు, గుంటగలగర, దూరగుండి, పల్లేరు కొండవెండ, తోటకూర, తుంద, జడ, ముసగ, కూతురుబుడమ వీటిగింజలు పెన్నేరు, పిల్లితేగలు, బూరుగజిగురు, మారేడు, కన్నెకోమలి, జాజికాయ, నేలతాడి, సాలామిశ్రి, మరాటిమొగ్గలు, జాపత్రి, లవంగాలు, ఒక్కొక్కపాలు గ్రహించి చూర్ణించి తేనె చక్కెర కలిపి సేవించిన దేహాన్నవృద్ధి శుక్రక్షయ మిక్కిలి బలము కలుగును. కామ సౌఖ్యము కలుగును. మందత్వము పోవును.

దగ్గులకు

కలకండ 16 భా॥ తవాక్షీరి 8 భా॥ పిప్పళ్ళు 4 భాగములు ఏలకులు 2 భాగములు దాలిచెక్క 1 భా॥ చూర్ణించి నెయ్యి తేనెతో పుచ్చుకొన్న దగ్గులు నశించును.

చంగల్వకోష్టు 1 న॥ కలింగరాష్ట్రం 1 న॥ దుంపరాష్ట్రం 1న॥ లవంగాలు 1 న॥ దాలిచెక్క 1 న॥ పంచదార 2 న॥ కలిపి వాడేది దగ్గులకు అమోఘముగా పనిచేయును.

కలింగరాష్ట్రం 10 తు॥ దుంపరాష్ట్రం 10 తు॥ వస 10 తు॥ లవంగాలు 10 తు॥ పిప్పళ్ళు 10 తు॥ ఉసిరికాయ రసముతో మర్దన తేనెతో మర్దన క్షయలు, ఉబ్బసములు దగ్గులు పోవును.

సౌభాగ్యశొంఠి

రెండు కుడుపములు మంచినీరు దానికి సమముపాలు ప్రస్థము పంచదార పాకము రానిచ్చి ఏలకులు 1 పలం, మాల్కంగిణిగింజలు 1 పలం, నాగకేసరాలు 1 పలం, పిప్పళ్ళు 1 పలం, మిరియాలు 1 పలం, జీలకర్ర 1 పలం, చలవమిర్యాలు 1 పలం, జాజు 1 పలం, లవంగాలు 1 పలం, వాయులవంగాలు 1 పలం, తాలింతబోలు 1-పలం సదాపవిత్తులు 1 పలం, ఆకుపత్రి 1 పలం, ధనియాలు 2 పలాలు శొంఠి 16 పలములు, ఇవి అన్నియు చూర్ణించి వేయవలెను. దీనిని

సేవించిన సూతికాజ్వరములు, ప్లీహము, మలబంధము, క్షయ, దగ్గు, మేహములు పోవును.

పొత్తికడుపు వ్రణములకు

అనసత్రికము చూర్ణము 2 మొకలు 6 చిన్నాల ఎత్తుగాని, లేక 8 మొకలు 6 తులములు కషాయముగాని యిచ్చిన పొత్తికడుపు వ్యాధులు వ్రణములు నివారించును.

వస్తి వ్యాధులకు

పటిక 1 మాసము, పటికబెల్లం (కలకండ) 4 మాసాలు కలిపి 8 ఔన్సులు పాలయందువేసి త్రాగిన వస్తి వ్యాధులు నివారణయగును.

మల ఉదావర్తమునకు

పంచదార 1 తులము తెగడ 1 తు॥ పిప్పళ్ళు 2 తు॥ అన్ని కలుపుకొని భోజనమునకు ముందు తేనెతోటి పుచ్చుకొనిన మల ఉదావర్తము నయమగును.

కఫరోగమునకు

ఆవాలు, కారుసముపు, యిప్పపువ్వు మూడింటిని సమభాగములుగా నూరి ఉడికించి చాతిమీద వేపుచేసిన కఫరోగములు కుదురును.

పిచ్చికి

శిలాజిత్తు 1 వడ్లగింజయెత్తు గాడిదగడపాకుతో అరుగదీసి యిచ్చిన ఆరంభదశయందుండు పిచ్చి నయమగును.

మతిచాంచల్యమునకు

శిలాజిత్తు 2 గురిగింజల ఎత్తును, జలకర్ర తులము, వాము తులం కషాయముపెట్టి యా కషాయమునందు కలిపి యిచ్చిన మతి చాంచల్యము నయమగును.

జలకర్ర, సోపు, కషాయమునందు శిలాజిత్తు 2 గురిగింజల యెత్తు కలిపి యిచ్చిన పిచ్చిమాటలు తగ్గును.



ముట్టుకట్టుకు

6 చిన్నములయెత్తు కర్పూరాల చూర్ణము అర తులం పంచదారలో కలిపి బహిష్టచేరిన మూడురోజులవరకు మూడు మాసములు యిచ్చిన రజస్సు క్రమముగా అగును.

రసకర్పూరము 1 తు. తెల్లకవిరి 1 తు॥ యాలకులు 1 తు, గుంటకలగర రసముతో 4 రోజులు నూరి పెసరగింజలంత మాత్రలు చేసి మీగడతోను కేరితోను కలిపి యిచ్చిన కుష్టులు నల్లమచ్చలు తెల్లమచ్చలు, సవావ్యాధులు గుణమగును.

జిహ్వా దోషములకు

మంచిదొండకాయను కుమ్ములో ఉడకబెట్టి దాని రసముదీసి ఎండపైనుంచి అందులో మంచిపగడము బంగారము రుద్రాక్ష పై మూడువస్తువులను కొద్దిగా అరగదీసి నాలుకకు పట్టించి కొంచము సేపుంచి బంగారురేకతో నాలుకను గీకివేయవలెను. ఇటుల మూడు పర్యాయములు చేసిన జిహ్వాదోషములు హరించును.

మరొక విధము

సైంధవలవణము 1 వ॥ శొంఠి అర వ॥ పిప్పళ్లు 1 వ॥ మిరియాలు అర వ॥ ఇంగువ అర వ॥ వెలిగారము అర వ॥ (నిప్పుపై పొంగించినది) వీనిని నిమ్మపండ్ల రసములో నూరి నాలుకకు పట్టించిన నాలుక మొందుట మున్నగునవి హరించును. మరొకటి

మాదీఫల కేసరములు 1 వ॥ నెయ్యి 1½ వ॥ సైంధవలవణము 1 వ॥ మిరియాల చూర్ణం 1 వ॥ వీనిని కలిపి నూరి కుంకుడుగింజ ప్రమాణము మాత్రలుచేసి ఒకదానిని బుగ్గనుంచుకొని ఆ ద్రవము మ్రింగుచుండిన నాలుక ఎండి బిరదుగట్టుట నాలుక అంపమువలె నుండుట అరోచకము మున్నగునవి నివారించును.

ఇంకొకటి

అక్కలకర్ర, వాము, యిండుపగింజలు సమాంశములుగా నూరి కషాయముపెట్టి పుక్కిలించిన జిహ్వాదోషములు హరించును.

ఎండ్రకాయ డొక్కలోని నీటిని త్రాగిన జిహ్వాదోషము హరించును.

నెమలి యీకలమసిని కాల్చి తేనెతో రంగరించి నాలుకకు రాచిన జిహ్వాదోషములు హరించును.

భోజన సంజీవి మాత్రలు

అల్లము, చవుటిఉప్పు, జాపత్రి, కూరఉప్పు, సురేకారము కల్లుప్పు, ఇందుప్పు, గాజుప్పు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, ఓమము ఇంగువ, వెంగల్వాకోష్టము, శుద్ధిచేసిన, గంజాయాకు, నవాసారం పిప్పలీమూలము ఇవి ప్రతివస్తువు 1 పలము, తాటిబెల్లము 1 పలము తెల్లగడ్డలు (వెల్లుల్లి) 6 పలములు,

వస్తువులన్నియు ప్రత్యేకముగ వేసి చూర్ణముచేసుకొని ఖల్వములో వేసి అందులో తాటిబెల్లము తెల్లగడ్డలను పైతోలు ఒలిచి అందులోవేసి మెత్తగా మర్దించి మైనముచేసి యుంచుకొని ఉసిరికాయ ప్రమాణము దినమునకు రెండు మూడు పూటలు, నీళ్ళు, మజ్జిగ, తేనె, ఓమము కషాయము మొదలగు అనుపానములచే వాడిన గుల్మము, గ్రహిణి, సూతికావాయువులు, మూట్టుకట్టు రజోబంధము, గ్రహణి, అజీర్ణభేదులు, కడుపులోనిగడ్డలు, అగ్నిమాంద్యము, అజీర్ణము, పిత్తవాయువులు కడుపునొప్పులు, వాతనొప్పులు మొదలగునవి హరించును.

సంజ్ఞ :-గంజాయి ఆకును విత్తనములు తీసివేసిన మూడు దినములు నీళ్ళలో నానవేసి పిసికి మెత్తని నేతిలో లేతగా వేయించగా శుద్ధియగును.

ప్రమేహమునకు

వస్తువులు-(1) తోకమిరియాలు, గుడూచిసత్వం, వెదురుప్పు, ఏలకులు, ఇవి ప్రతివస్తువు 2 పలములు, కర్పూర శిలాజిత్తురాయి 8 తులములు, 1 వంగభస్మము (తగరము) అర తులము,

చేయుపద్ధతి-వస్తువులన్నియు క్రమప్రకారము దంచి చూర్ణము చేసుకొని ఇందులో తగరభస్మమును కలిపి నూరి యుంచుకొనునది,

ప్రమాణము-పూటకు కాలు మొదలు అర తులమువరకు, వెన్న, నేయి, చక్కెర, పాలు మొదలగు అనుపానములతో దినమునకు 2, 3 పర్యాయములు ఈయవలయును,



తీరు జాడ్యములు—తెలుపు, పసిమి మొదలగు ఔపసర్గిక మేహము, శుక్లమేహము, దంతిమేహము, క్షార మేహము, మొదలగు ప్రమేహములు తీరును.

సంజ్ఞ—కర్పూర శిలాజిత్తు రాయికి బదులు భస్మము చేర్చుకొనవచ్చును. భస్మముచేయు స్వల్పయోగము శుద్ధిచేసిన వంగమును పలచగా రేకులు కొట్టి సన్నగా కత్తిరించి ఒక గోతముతొండుపై ఒక అంగుళము మందమునకు పసుపుపొడి పరచి దానిమీద పలచగా వంగరేకులను చల్లి రేకులను ఒక దానిమీద మరియొకటి పడకుండ యుండునట్లు గోతమును చుట్టి దారముతో కట్టి పైన మొరమట్టి శీలు చేసి యెండబెట్టి సుమారు 50 పిడకలతో పుటమువేయగా వంగ రేకులు బొరుగువలె భస్మమై యుండును. దీనిని ఉపాయముగా మెత్తి నూరి యుంచుకొని పై చూర్ణములో కలుపుకొనునది.

మరొకవిధము

జీలకర్ర 3 పలములు, శృంగిభస్మము 3 పలములు, తెల్ల చక్కెర 2 పలములు

చేయువిధము—జీలకర్ర చూర్ణముచేసి వస్త్రగాళితముచేసి అందులో శృంగిభస్మము చక్కెర కలుపుకొనునది.

ప్రమాణము—పూటకు కాలు మొదలు అర తులము ప్రమాణము వెన్న, నేయి అనుపానములతో ఉదయం సాయంత్రములయందు 15, 20 దినములు సేవించవలయును. ఇందువలన మూత్ర వ్యాధులు పిత్తవాయువు మైకము. తలతిరుగుట, గుండెనొప్పి, స్వప్నస్ఖలనము మొదలగునవి తీరును.

శృంగి అనగా గట్టిగానుండు దుప్పికొమ్ము దీనిని సన్న పలుకులుగ పగలగొట్టి ఆవిశాకుతో కూడ వేసి రాణలిలో కాల్చి బొగ్గుచేసి ఆవిశాకు నూరి అందుచుక్క శృంగి పలుకులు పెట్టి శీలుచేసి 30 పిడకలతో పుటముచేయగా భస్మమగును. భస్మము తెల్లగా కానియెడల యీ శృంగిని ఆవిశాకు రసముతో నూరి మరియొక పుటము వేయగా భస్మమగును. దీనిని ఉపయోగించునది.

ఇంకొక పద్ధతి

శుద్ధిచేసిన వల్లసీసము నాగము 5 పలములు, ఏలకులు అర పలం వెదురుప్పు (వంశలోచన) అర పలము.

చేయుపద్ధతి — తెల్లగలిజేరు (పునర్నవ) నారింజ నీరు ఆవరి, రేగు, తురకవేప, వేప ఈ ఆరు చెట్లకొమ్మలను వేరు వేరుగా కట్టలుకట్టి యుంచుకొనునది. పై వల్లసీసము ఒక చట్టిలో పెట్టి పొయ్యిపెట్టి సీసము కరుగు ముఖముపై ఆరు కట్టలతో ఒకటి వెనుక మరియొకటితో రుద్దుచురాగా అనగా గ్రాసమియ్యవలయును. ఇట్లు క్రమముగా నాలుగైదు దినములు గ్రాసమియ్యవలయును. ఇట్లురుద్దుచుండగా వల్లసీసము భస్మమగుచు అనేకవర్ణములుగ తిరుగుచు తుదకు తెల్లగ భస్మమగును. కొంత ఆలస్యమైనను తెల్లగా అగువరకు రుద్దవలయును. ఈ భస్మము చేయునప్పుడు రేగు కట్టలతో పొయ్యి మంట వేయుట శ్రేష్టము.

పై ప్రకారం చేయబడిన నాగభస్మము 1 పలము, ఏలకులు వెదురుప్పు చూర్ణముచేసి ఈ మూడు వస్తువులు ఒక చట్టిలోవేసి పొయ్యిమీదపెట్టి సుమారు అర గంట వేచగా అన్నియు తెల్లగా భస్మమగును. దీనిని మారి సీసాలో భద్రపరచునది.

ప్రమాణము—పూటకు గురిగింజయెత్తు వెన్న, నేయి, చక్కెర మొదలగు అనుపానములతో ఈయనగును.

కుదిరెడి వ్యాధులు—20 మేహములు, తెలుపు, పసిమి, చర్మవ్యాధులు, క్షయలు, అంతర్గత జ్వరములు మొదలగు సకల వ్యాధులు నివర్తియగును.

వల్లసీసము, విషతుల్యమైన లోహము కనుక చక్కగ శుద్ధిచేసి భస్మము చేయవలయును. భస్మముచేసిన వెనుక లోహారజము ఉన్నదాయని పరీక్షించి ఉపయోగించవలయును. సందేహమున్నచో పై భస్మమును తెల్లగలిజేరు ఆకురసముతో నూరి మరియొక పుటముచేసిన తెల్లగా భస్మమగును.

ఇంకొక విధము

రసకర్పూరము 5 తులములు, కర్పూరము 5 తులములు,



చేయుపద్ధతి—పై రెండు వస్తువులను ఖల్వములో పొడిచేసి రెండుదినములు మర్దించి యుండపెట్టి పైన చదరముగ మరియొక చట్టిమూసి శీలుచేసి పొయ్యిమీదపెట్టి చట్టిక్రింద అవమానె దీపముతో మంటవేయగా పై చట్టికి పతంగము అనగా భస్మము యెక్కును. దీనిని జాగ్రత్తగ యెత్తి భద్రపరచునది.

ప్రమాణము—పూటకు కాలు మొదలు అర గురిగింజ ప్రమాణము ఉదయం సాయంత్రములయందు పాలమీగడలోపెట్టి మ్రింగునది. ఇందుకు పథ్యము వాయువు పదార్థములు చింతపండు మొదలగునవి కూడదు

ఈ ఔషధమును అధికదినములు వాడకూడదు వైద్యుడు జాగ్రత్తగ వాడవలయును.

మరియొక పద్ధతి

(1) నాలుగుపాళ్లు కాచి శుద్ధిచేసిన సురేకారము 12 తులములు, శుద్ధిచేసిన గంధకము $1\frac{1}{4}$ తులములు.

(2) గైరికము (కావిరాయి), శుద్ధిచేసిన పటికారము, తెల్ల చక్కెర ఇవి ప్రతివస్తువు ఒక్కొక్క తులము,

చేయుపద్ధతి—1-వ నంబరులోని రెండు వస్తువులను పొడిచేసి ఒక్కటిగా కలుపుకొని ఒక మట్టిపాత్రలో పెట్టి బొగ్గులపొయ్యిమీద పెట్టగా కరుగును, తర్వాత కొంతకాలమునకు పొగ లేచును. ఆ పొగ యంతయు అణగిన పిమ్మట కళాయిపూసిన రాగిపాత్రలో మెల్లగా పోసి ఆరబెట్టి యెత్తి సీసాలో ఉంచునది. ఈ సురేకారము 1 తులం 2-నంబరులోని 3 వస్తువులు అన్నియు మెత్తగానూరి యుంచునది.

ప్రమాణము—పూటకు కాలు మొదలు అర తులము వరకు పాలలో ప్రయోగించునది. దినమునకు రెండు మూడు పూటలు యీయనగును. ఇందువలన తెలుపు, పసిమి, మరుగు మొదలగునవియు నివర్తియగును. వ్యాధికి తగినట్లు పథ్యముంచవచ్చును.

సజ్జ—పటికారము దానికి సమము ఆవువెన్న, ఈ రెండును ఒక మట్టిపాత్రలోపెట్టి శీలుచేసి 10 పిడకలలో పుటమువేయగా భస్మమగును. దీనిని పై యోగములలో చేర్చుటకు వీలగును.

---

శ్రీ రస్తు

# వసిష్ఠప్రోక్తమగు

# పులిప్పాణివైద్యము

## విషహార ప్రకరణము

### తేలు విషమునకు చికిత్స

కుంకుడుకాయతొక్క, పోకచెక్క 5 తమలపాకు సున్నంతో తాంబూలము సేవించిన విషము హరించును.

తేలు కుట్టిన వెంటనే వన్నీటిలో స్నానంచేసిన బాధ ఉపశమించును.

కటిక పొంగించి కుట్టినచోట వేసిన నయమగును.

లిక్కర్ అమోనియా కుట్టినచోట రెండు చుక్కలు వేయవలెను.

ఇంగువను నీటిలో అరగదీసి వేయవలెను

హారాతి రాసినను బాధ తగ్గును. నల్ల ఉమ్మెత్తవేరు అరగదీసి రాయవలెను.

తెల్లజిల్లేడు వేరు అరగదీసి కుట్టినచోట వేయవలెను.

నల్లమందును నిమ్మకాయ రసములో చాది కుట్టినచోట వేయవలెను.

తేనెకూడి రాసిన బాధ తగ్గును. మాగిన అరటిపండును కుట్టినచోట కట్టవలెను.

నీలిఆకు చూర్ణం నీళ్ళలో కలిపి త్రాగించిన నయమగును.

మైలతుత్తం నిప్పులో పొంగించి ఆ చూర్ణమును నీళ్ళ తంగిలించి కుట్టినచోట వేయవలెను.



నల్లరబ్బరు ముక్కను నిప్పుమీదకాచి కుట్టినచోట అంటించవలెను.

నాగముష్టివేరు నీరుల్లిరసములో చాది కుట్టినచోట వేయవలెను.

గాడిదగడపవేరు ¼ తులము, తమలపాకులు 2 కలిపి తినిపించేది.

వట్టికొరింత వేపాకు, పిప్పళ్ళు, మిరియాలు, జాయువికొంగము భద్రముస్తలు, జిలకర, శొంఠి, చిత్రమూలం, సైంధవలవణం, వెంగల్వకోష్ఠు, అతివస, చిటుబొర్ధి, కరక్కాయ ఇవి సమం గ్రహించి కోక మాత్రంతో నూరి మాత్రలుచేసి నీడ నెండించి భద్రపరచవలెను. తేలు కుట్టినపుడు కుట్టినచోట యీ మాత్రను జిల్లేడు పాలతో అరగదీసి వేసిన మానును.

### త్రాచుపాము విషములకు

నీలివేరు, తెల్లగన్నేరువేరు, ఇంగువ, మిరియాలు, శొంఠి, వెలిగారం, మారోడుండాకు పసరుతో నూరి కణికలుచేసి నీడను ఎండించి వలసినపుడు తులం నీళ్ళలో కలిపి యీయవలెను.

ఈశ్వరివేరు, మిరియాలు, ఆవునెయ్యి కలిపియిచ్చిన విషము హరించును.

కోడిశపాల 1 తులం మిర్యాలు 1 తులం రెండు కలిపి నూరి ఆవునేయి కలిపి యిచ్చిన విషము పోవును.

పాతాళగరుడవేరు ముక్కలుగ నరికి నమలి మ్రింగిన విషము నివారణయగును.

గాడిదెగడపాకు సమూలం నూరి యీయవలెను.

మారేడు వేరు గంధం అరగదీసి నీళ్ళలో కలిపి యీయవలెను

నిమ్మవేరు, మారేడువేరు నీళ్ళతో నూరి యిచ్చిన విషము హరించును.

చిర్రివేళ్ళరసం 3 తులములు యీయవలెను.

తెల్లగురివిందవేరు రసం ఒకతులం ఇచ్చిన విషము తొలగును వేపజిగురు మంచినూనెలో కలిపి యీయవలెను.

వేము ఆకువ, వేపబీర, కానుగువిత్తు, దిరిశెనవిత్తు సమం చూర్ణించి అర్ధ తులం చొప్పున గోమూత్రముతో నిచ్చిన విషము తొలగును.

బ్రహ్మదండివేరుగాని, జమ్మివేరుగాని నమిలి తినిన విషము నివారణయగును.

తెల్లజిల్లేడు మొగ్గలు 5 ఆముదముతో వేయించి మిరియాలు 2 తులం కలిపి నూరి మాత్రలుచేసి యీయవలెను.

తెల్లజిల్లేడువేరు, కొండిశపాల, చేదుబీర విత్తులు, ఇంగువ, వస కొండ పిప్పళ్ళు మిరియాలు ఇవి సమం మేకమూత్రముతో నూరి యెండించి చూర్ణముచేసి యుంచుకొని వలసినపుడు అర్ధతులం మేక మూత్రముతో కలిపి యీయవలెను.

తెల్లజిల్లేడు మొగ్గలు 4 మిరియాలు 7 చేదు పుచ్చకాయ ముక్క లేక విత్తులు నీళ్ళతో నూరి యిచ్చిన విషము హరించును.

దుష్టపువేరు రసం చాయపసుపు మిరియాలు నూరి కలిపి యిచ్చిన విషము నివారణయగును.

పసుపు అర్ధతులం ఆవుపాలతో కాచిగాని కాచకగాని కలిపి గోమూత్రం లేక 8 వయస్సుకు లోబడ్డ పిల్లల మూత్రముతో కలిపి యీయవలెను.

నేలతాటిగడ్డ రసం, పొంగించిన వెలిగారం కలిపి యిచ్చిన విషము వెడలు.

చేదుబీరవేళ్ళరసం, నేలతాటిగడ్డల రసం కలిపి ఈయవలెను.

నేలగుమ్మడు దుంప కలితో గంధంతీసి 3 తులములు చొప్పున యిచ్చేది.

టింక్చరు ఆకోనిటా 15 చుక్కలు 2 తులములు నీళ్ళతో కలిపి 15 నిమిషముల కొకసారి యీయవలెను.

నాగముష్టివేరు నీటితో నూరి యీయవలెను

రం ఆకో సారాను 2 తులములు తగుమాత్రము నీటితో కలిపి యీయవలెను.

కానరదుంప గుంట్రటి బిళ్ళలుగా తరిగి తెల్లజిల్లేడు పాలలో 7 సార్లు నానబెట్టి యెండించిన ముక్క అర్ధతులము యీయవలెను.



### కండ్లకు కలికములు

పాతాళగరుడవేరు మిరియాలు నూరి కంటికి కలికము వేయవలెను.

మునగగింజలను దిరిశెనపువ్వు రసంలో ఏడుమార్లు తడిపి యెండించి యుంచుకొని పాము కరచినవారికి ఒకగింజను నీటితో చాది కండ్లకు కలికము వేయవలెను.

తమలపాకు రసంలో మిర్యాలు చాది వేయవలెను.

సముద్ర పాలవిత్తులు జమ్మిగింజలు, కానుగుగింజలు సమం గ్రహించి నీటితో మెత్తగ నూరి కణికేచేసి యెండించి యుంచుకొని అవసరము వచ్చినపుడు నీటితోచాది కంటికి కలికము వేయవలెను.

తెల్లగురివిందపూలు, మిర్యాలు నిమ్మరసముతో మెత్తగా నూరి కలికము వేయవలెను

ముషిణిగింజలు గంధంతీసి కలికము వేయవలెను.

ముషిణిగింజలు, మిర్యాలు మారేడాకు పసరుతో మెత్తగ నూరి కణికచేసి యెండించి యుంచుకొని వలసినపుడు నీటితో అరగతీసి కంటికి కలికము వేయవలెను.

### నస్యములు

తెల్లదింటెనవేరు నరమూత్రములో నూరి నస్యం చేయింప వలెను.

జిల్లేడుపాలలో విభూతి 4 మారులు నాననిచ్చి యెండించి మిరి యాల చూర్ణము కలిపి నస్యము చేయవలెను.

దుష్టపాకు, మారేడాకు, వెల్లుల్లి మెత్తగ నూరి గుడ్డలో మూటగట్టి ముక్కులో ఆ రసమును పిండవలెను,

### మూర్ఛలకు

కుంకుడుకాయ, చావిటాకు కలిపినూరి ఆ రసమును చెవిలోను ముక్కులోను పిండి లోపలికి కూడ యిచ్చిన మూర్ఛ విడిపోవును.

కొండిశపాల, మిరియాలు సమం నీటితో నూరి నీరు తగినంత కలిపి లోపలికియిచ్చిన విషముచే కలిగిన మైకము నివర్తియగును,

కృష్ణతులసివేరు చెక్క ఉప్పు నూరి లోపలికీయవలెను.

చేదు అనపకాయ సమానం ఎండించి చూర్ణించి యుంచుకొని అవసరమైనపుడు నీటితో ఒకతులం చూర్ణం కలిపి యీయవలెను.

### కాంతులు కట్టుటకు

తిప్పతీగెల రసం జిలకరచూర్ణం కలిపి సేవించిన కాంతులు కట్టును.

తోటకూర గింజలు మిర్యాలునూరి ఆవునేతితో కలిపియీయవలెను.

### పైకి పట్టు

పాము కరచిన గాయంమీదను నల్లజీడిగింజల రసం వేసిన మానును.

### వాపులు తగ్గుటకు

జిల్లేడాకుగాని, మారేడాకుగాని కలితో వుడికించి 3 కట్లు కట్టిన కరచినచోట కలిగిన వాపు తగ్గును.

దిరిశెఆకుగాని, జిల్లేడాకుగాని మిర్యాలతో నూరి వాపుపై రాచిన వాపుతగ్గును.

### ఇతర పాములు కరచిన లోపలకు మందు

కామంచిఆకు పసరు 8 తులములు లోపలికిచ్చిన యెట్టి పాము విషమైనను నివారణయగును.

రావంచాలు గోమూత్రమున నానవేసి ఎండించి తర్వాత గోమూత్రంతో నూరి లోపలికిచ్చిన ఎట్టి విషమైనను హరించును.

నల్లకలువదుంప చూర్ణం 1 తులం పంచదారతో కలిపి యివ్వవలెను.

పాతాళగరుడవేరు, యీశ్వరివేరు, మిర్యాలు నీళ్ళతో నూరి లోపలికీయవలెను.

పటికపొడి 4 తులములు పెంకిలో పోసి నిప్పుమీదనుంచి నీరు ఇంకించి నూరి 1 తులం పొడి కలిలో కలిపి ఈయవలెను. చప్పిడి పథ్యము.



నల్లరేగుచెక్క నీళ్ళతోనూరి యిచ్చిన విషముహరించును.

కొడిశపాలచెక్క, మారేడుచెక్క, నాగదొండదుంప ఇవి ఒక్కొక్కటి 16 తులములు గ్రహించి చూర్ణించి యుంచుకొని అవసరము కలిగినపుడు 3 తులములు, మిర్యాల చూర్ణం 3 తులములు కలిపి యీయవలెను.

### మిడినాగుల విషమునకు

రేలపండుగుజ్జు, మిర్యాలు నీటితో నూరి నీటిలో కలిపి లోనికీయవలెను.

కృష్ణతులసిఆకు రసం 2 తులములు, చిరివేరు రసం 2 తు, పసుపుగుండ 3 తు, పాతబెల్లం 7 తు, ఇవి కలితో నూరి లోపలికిచ్చిన విషము హరించును. దీనికి ఆవుమజ్జిగ అన్నం ఉప్పు కలుపక పథ్యము.

నాగసర్పిదుంప 1 తులం మిరియాలు కలిపి నూరి యియ్యవలెను

### అన్నిజాతుల పొడపాముల విషమునకు

ఇండుగు, నాగముష్టి, ఈశ్వరి వీని వేళులను సమంగ్రహించి గంధం అరగదీసి యిచ్చిన పైపాముల విషము హరించును.

దుప్పితోలు కాల్చిన మసి కలిలో కలిపి యీయవలెను.

మునిగోబ్బవేళ్ళు పాదపత్రివేళ్ళు, పెన్నేరుదుంప ఇవి నీళ్ళతో నూరి యీయవలెను.

కొడిశపాలచెక్క 2 తు, ఇండుగువేరు గంధం 2 తు, మిర్యాలు 2 తు, ఆవునేయి 3 తు, నిమ్మపండు రసం 4 తు, ఇవి కలిపి 3 పూటలకు యీయవలెను. గాయమునకు ముషిణివేరు గంధం రాచేది.

ఇండుగుకాయ ప్రత్యేకము నీటితో నూరి యీయవలెను.

### మచ్చలు, పుండ్లు మానుటకు

దిరిశెనాకు, పాదపత్రిఆకు యీపల్లు సమం యాలకులు 1 పాలు నూరి నీటితో సీయవలెను.

చల్లగుమ్మడివేరు గంధం, మునిగోబ్బిఆకు మిర్యాలు నూరి పైకి రాయవలెను.

చిట్టాముదం గింజలు వేయించి తులసి ఆకు రసముతో నూరి రాచేది.

వస్తివేళ్ళ కలితో నూరి వాపున్నచోట పట్టువేయవలెను.

తెల్లకాకరకాయ రసంగాని చేదుబీరాకు రసంగాని గాయం పైన రాయవలెను.

పావురపురెట్ట, గంజెంద్రుకలు, ఆవుగోమ్ము, నెమలికన్ను, వరిపొట్టు, ధనియాలు, పత్తిగింజలు, రాతిపువ్వు, ఇవి నీళ్ళతో నూరి పట్టు వేయవలెను. పాము ఉన్నదని సందేహం ఉన్నచోట ఈ పొగ వేసిన పాము పారిపోవును.

కాడిపుర్ల పాము విషమునకు

కటుధూపం నీళ్ళలో కలిపి లోపకీయవలెను. ఈపాము కరచిన విషము చాల దుష్టమైనది.

పీనిపాదమునకు

గొబ్బివేళ్ళు, కుంకుడుకాయ కలితో నూరి కొంచెం లోపలికి పుచ్చుకోవలెను, పైకి రాయవలెను.

నల్లసకుగుడు విషమునకు

నల్లవుప్పివేరుచెక్క 4 తులములు, నిమ్మపండ్ల రసముతో నూరి లోపకీయవలెను.

ఉల్లగుమ్మిడిదుంప కలితో నూరి యీయవలెను.

దాసరిపాము విషమునకు

ఒన్నెకు చిత్రివేరు, మహిసాక్షిగుగ్గిలం, కటుదూప అత్రుపంచితముతో నూరి కరచినచోట పట్టువేయవలెను.

రక్తకారి పెంజరము విషమునకు

పక్కిరవేరు గంధం రోజుకు 1 తులం చొప్పున 8 దినములు సేవించవలెను. ఇది కరచిన రోమకూపములనుండి రక్తము వెడలును, రక్తము యెక్కువ వచ్చినచో

సేపాళములు ½ తు, నూరి తినవలెను.



నల్లజిలుసువేరు గంధం రోజుకు ఒక తులం చొప్పున మూడు రోజులు వరుసగ తినవలెను.

తెల్లపుసిరిగ, మారేడుచక్కలు ప్రతి దినం 8 తులలు, తుమ్మ, విషబొద్ది, ఈశ్వర, పూడుగు చిత్రమూలం, తిప్పతీగ, నల్లజిలుసు వీని వేళ్లు ప్రతి దినం 2 తులలు వీనిని బాగుగ యెండించి చూర్ణించి వస్త్రగాళితముచేసి పూటకు ఒక తులం చొప్పున సేవించవలెను. ఇచ్ఛాపథ్యము

పాము విషముతగిలి ఒంట్లో దద్దులు కలిగినందుకు

ఉసిరికెపప్పు, వేపాకు సమం చూర్ణంచేసి పూటకు ఒక తులం చొప్పున సేవించిన దద్దులు, దురద మానును.

ఒంటికి పిడక బూడిద గోమూత్రంలో ఉప్పుకలిపినూరి పట్టించి నాని స్నానము చేయవలెను.

నగ్గుపొద కరిచినందుకు

గచ్చవేరు గంధం 4 తు, మిరియాలు 4 తు, కలిపి నువ్వుల నూనెతో నూరి సేవించిన విషము నివారణమగును.

తెల్లపులిమిడివేరు, మిరియాలు 4 తు, చొప్పున గ్రహించి నేతితో నూరి సేవించవలెను

లింగదొండాకు రసం మిరియాలు ఆవునేతితో కలిపి యీయవలెను.

గచ్చవేరు గంధం కలిలో కలిపి యివ్వవలెను.

పైపూతకు

వేపవేరు, ఇండుగువేరు, జిరేకవేరు, కాకగవేరు, కరక్కాయ వీని గంధం కలిపి పైకి రాయవలెను. ఆవుపాలు అన్నం పథ్యము.

ఎర్రకలువదుంప తురకమిర్యాలు ప్రతిదినం 2తులాలుగ్రహించి నీటితో నూరి పట్టించవలెను. ఆవు మజ్జిగ అన్నం పథ్యము.

జెర్రి విషమునకు

కాడికపాలవేళ్ళు 1 వీశ 4 శేర్ల నీళ్ళలో పోసి కషాయము కాచి 4వ వంతు ఉన్నప్పుడు దించి, ఆ కషాయమును ఒంటికి పట్టించి నాని వేన్నీళ్ళలో స్నానము చేయవలెను.

### వ్రణములు - కురుపులు

గోరింటాకు, నల్లపుస్మృతాకు, రసకర్పూరం, మిర్యాలు, సమం గ్రహించి జలముతో మెత్తగా నూరి వ్రణములకు కురుపులకు రాచిన మానును.

గాడిదగడపాకు ఆముదములో నూరి వ్రణములకు రాచిన మానును.

కాకిగొండాకు నూరి పట్టువేసిన వాపు తగ్గును.

పసుపు వాది వ్రణములకు పట్టించిన మానును.

ఆనపాకు నూరి ఆముదములో వెచ్చచేసి కట్టవలెను.

తిప్పతీగ ఆకు నూరి పట్టు వేయవలెను

వేపాకు పసుపు కలిపి మెత్తగ నూరి పట్టువేయవలెను.

### సమస్త విషములకు

శుద్ధి మైలతుత్తము 2 తులములు తు॥ గంధకము 2 తు॥ శు॥ పాదరసము 2 తు॥ ముద్దపసుపుకొమ్ము 1 తు॥ పొంగించిన వెలిగారం 2 తు॥ యీ వస్తువులను చూర్ణించి నాగసారకాయ నిజరసముతో వారము రోజులు మర్దించి గురివిందగింజ మాత్ర ప్రమాణం చేసి మొగ పిల్ల మూత్రముతో యిచ్చిన స్థావరజంగములు (నాభిపాషాణములు) వక్క కరచినవారికి పాము కరచినవారికి పిచ్చికుక్క కరచినవారికి ఎలుక కరచినవారికి తేలు కుట్టినవారికి నల్లమందు తిన్నవారికి ఫుంగిడి తగిలిన పశువులకు దోషగుణములకు బాలింతగుణములకు కడుపులోకి నేత్రములకు అంజనము వేయవచ్చును. తప్పక నివారణయగును. యిచ్ఛాపథ్యము.

### ఉమ్మెత్తాకు విరుగుడు

ఉమ్మెత్తకాయగాని, ఆకురసముగాని, తిన్నవానికి వంకాయ గింజలు (వడసలోనివి) రోటిలోయుంచి నూరి త్రాగించిన తక్షణం విరిచివేయును.

### నల్లమందుకు విరుగుడు

నల్లమందు తిన్నవాడు శొంఠి కషాయముగాని, శొంఠి చూర్ణముగాని తినిన నల్లమందు గుణం విరిగిపోవును.

విషహార ప్రకరణము సంపూర్ణము

---

శ్రీరస్తు

# వసిష్ఠప్రోక్తమగు
# పశుప్రాణివైద్యము
## కొన్ని మూలికల ఉపయోగము

### ఏనుగపల్లేరు గుణము

ఏనుగపల్లేరు సమూలము నూరి గోటుపక్క ప్రమాణము గేదె పెరుగులో కలిపి ఉపయోగింపుట పదారు దినములు యిచ్చిన మైకము, దాహము, తెలుపు, తెల్లకుష్ఠము, శరీరము మంటగనుండుట, ఇట్టివి నివారించును.

### కర్పూరవల్లి గుణము

కర్పూరవల్లియాకు పసరు ¼ ఔన్సులో, 2 లేక 3 గోరోజన మాత్రలు చాది చంటిపిల్లలకు వేసిన, బిడ్డలకు కలుగు జలుబు, దగ్గు శైత్యము ఇట్టివి నివారణయగును.

### గంగరావిచెట్టు గుణము

గంగరావి పట్టను నీటితో నూరి వక్క ప్రమాణము కూటి నీళ్ళతో కలిపి పుచ్చుకొనిన విరేచనమగును. దీని సేవనవలన తీట, గజ్జి నివారణయగును. దీనికాయ రసము ఎంగిలితగులుటచే కలుగునట్టి చిడుముపై పూరవయగునటుల రాయుచుండిన నయమగును.

### అంతర్దాహహర గుణము

ఈ ఆకు కొంచెము గ్రహించి తగుమాత్రము నీటితో బాగుగ ఉడకబెట్టి కషాయము దింపుకొని 3 ఔన్సుల కషాయము సేవించిన నీరసములను, ఉష్ణాధిక్యమువలన కలుగు యితర ఉపద్రవములు నివా

రణయగును. ఆకును నీటిలో నూరి మూలమునకు పట్టువేసిన శాంతించును.

అడ్డసరపాకు గుణము

దీనియాకులను గ్రహించి దంచి రసముతీసి దానికి సమం మంచినూనె చేర్చి యెండలో 4 రోజులుంచి తర్వాతను పిల్లలకు కలుగునట్టి కరప్పాణీ పుండ్లు, గజ్జి, తీట మున్నగువానికి పైపూతగ నుపయోగించిన నయమగును.

కంజాంకోరయాకు గుణము

ఈ యాకులను గొనివచ్చి వలిపితీసిన రసము ఒక చెంచా వరకు చిన్నపిల్లలకు పోసిన జ్వరము మాంద్యము విరేచనములు దగ్గులాంటి పిల్లలకు కలుగునట్టి బాధలు తీరును.

గంటెనవిత్తుల గుణము

ఈ విత్తనములను తగుమాత్రము గ్రహించి నేతితో వేయించి పొడిచేసి ఒక వరహాయెత్తు సేవించిన విరేచనమగును. దీని యాకులను యెండించి చూర్ణించి అర్ధవరహాయెత్తు పిల్లలకిచ్చిన కఫమును పోగొట్టును. ఇందులో తెలుపు గంటెన శ్రేష్టము.

కుప్పింటి గుణము

ఈ యాకులను యెండించి చూర్ణముచేసి వరహాయెత్తు చూర్ణము తగుమాత్రలు నీళ్ళలో కలిపి పంచదారచేర్చి సేవించిన కడుపునగల క్రిములన్నియు బయటపడును. వేరును యెండించి చూర్ణముచేసి పైవిధముననే సేవించిన విరేచనమగును. దీని యాకు పసరును కొంచము వేపనూనె కలిపి యెండలోపెట్టి జాగ్రత పరచి పిల్లలకు నాలికమీద రాచిన కఫము వెడలును. క్రిములు చేర కుండును.

తగరిస గుణము

దీనివేరును రెండు పలములు గ్రహించి నిమ్మపండ్ల రసములో నూరి తామరకు పైపూతవేసిన మానును. దీని విత్తనములనునూరి మజ్జిగలో కలిపి తీట కురుపులకు పైనరాచిన త్వరగ మానును.



నల్లవావిలి గుణము

దీనియాకులను తగుమాత్రము గ్రహించి అరపడి నీళ్ళలో పోసి కషాయము కాచి సగము దింపుకొని 3 చెంచాల కషాయమును సేవించిన జ్వరము మానును. ఆకును ఉప్పును కలిపి వేయించి కీళ్ళ నొప్పులకు ఒత్తడమిచ్చిన నొప్పులు నివారణ యగును. ఆకు రసముతీసి నూనె కలిపి వాపులకు పైపూతగ నుపయోగించిన వాపు తగ్గును

నువ్వుల గుణము

నువ్వులను నీటితో నూరి ఉడికించి ముండ్లు గ్రుచ్చుకొని విరిగి పోయి బాధించుచుండిన దానికి కట్టిన ముండ్లు బయటపడును. ఆకులను పసుపుకలిపి నూరి ఉడికించి కట్టినను ముండ్లను తీసివేయును

చిన్నపల్లేరు గుణము

దీనిని సమూలముగ తగుమాత్రము గ్రహించి కషాయము కాచి రెండు చెంచాల కషాయము ఉదయపుపూట సేవించిన తీట గజ్జి, మేహకురుపులు ఇట్టివి తీరును. ఇచ్చా పథ్యము.

నల్లేరు గుణము

నల్లేరు గణుపులను తీసివేసి తగుమాత్రము గ్రహించి నీటితో నూరి వక్క ప్రమాణము ఉదయముపూట పుచ్చుకొనిన అసనమున కలుగుమంట, జిల, రక్తమూలము నివారణయగును.

నేలవెలగ గుణము

ఇందులో నేలవెలగ, నక్కవెలగ, గుజ్జువెలగ అని మూడి కలుగలవు. ఇందులో అన్నిటికిని గుణ మొక్కటియే. దీని యాకులను తగుమాత్రము కషాయముకాచి సేవించిన జ్వరము, అతిసారము, పైత్యవికారములు ఇట్టివి తీరును.

నేలఉసిరిక గుణము

దీనిని సమూలము గ్రహించి దంచి పసరుతీసి అర్ధపలము ఆవుపాలు కలిపి రెండుపూటలు సేవించిన పసుపుకామెర్లు నివారణయగును. ఆవుపాలు అన్నము పథ్యము ఆకును ఎండించి చూర్ణించి త్రికటు ప్రమాణము ఆవుపాలతో సేవించిన ఆకలి, దీపనము కలు

గును, దీని చిగురు మెంతులు తగుమాత్రము కలిపి కషాయముకాచి 3 పొత్తులు పుచ్చుకొనిన అజీర్ణభేదులు హరించును.

తెగడ గుణము

దీని వేరును నీటితో నూరి వక్క ప్రమాణము ఆవుపాలు కలిపి సేవించిన విరేచనమగును. క్రిములు వెడలును.

విభూతిగచ్చ గుణము

దీని రొక్కలను తగుమాత్రము తీసికొని నీటితో నూరి గచ్చ కాయ ప్రమాణము సేవించిన మేహదగ్ధ, విరేచనములు, ఇవి తీరును. ఆకు పసరును చెవులో పోసిన చెవిపోట్లు నివారించును.

లక్క

మోతాదు—5 మొదలు 6 గ్రైనులు చూర్ణమును తేనె లేక నేయి లేక బూడిదగుమ్మడి స్వరసము, చక్కెర వీనితో సేవించిన స్తంభనీయము, రక్తశోధకము, రక్తవృద్ధికరము, రసాయనము.

ఉపయోగములు—దేహములో ఏ భాగమునుండి యైనను రక్తము పడుచున్నప్పుడు దీని పొడిని ప్రత్యేకముగా నైనను, ఇతర ద్రవములతో చేర్చియైనను ఇత్తురు ఇది రక్తములో మార్పును కలిగించుటచే కాకోలు రక్తమును గడ్డకట్టునటుల చేయును, గర్భాశయ వ్యాధులలో యోనినుండి రక్తము పడుచున్నప్పుడును, ఏ కారణము వల్లనైనను ఊపిరితిత్తులలో నుండియు, పుపుసములనుండియు రక్తము పడుచున్నప్పుడును ఇది చాల మంచిమందు; చిరకాలమునుండియున్న ప్రవాహికకును, రక్తహీనతకును ఇది ఉపయోగింపబడుచున్నది. ఉరఃక్షతములో దీనిని తేనెతో నిచ్చిన చాల గుణకరము, దీనిని చేర్చి కాచిన తైలముతో చిరకాలగతమైన జ్వరముగలవారికి అభ్యంగము: మర్దన చేయించినచో మిక్కిలి ఉపయోగముగా నుండును.

లవంగపట్ట

మోతాదు—5 మొదలు 30 గ్రైనులు చూర్ణము తేనెతోగాని, స్వరసమును తేనెతోగాని, ద్రవ్యాంతరములతో చేర్చిగాని, ఉపయోగించునది.



గుణము:—పాచనీయము, ఉద్రేకహారము, సుగంధకరము, ఉత్తేజనము, స్తంభనీయము, క్రిమిహరము.

ఉపయోగములు—ఇతర ఔషధములతో చేర్చి పేగులలో కూతలు, వాంతులు, ఓకరింత, అతిసారము వీనిలోను, కడుపునొప్పి యున్నప్పుడును, ఇతర ఔషధములచే నోటికి రుచి తప్పిపోయినప్పుడును ఇత్తురు నోటిలోనుంచుకొని నమలుటచే దుర్గంధమును హరించును. ముఖ్యముగా ప్రవాహికలో ఇది చాలా ఉపయోగకరము. అప్పుడు ప్రారంభావస్థలలో స్వరసముగా చేసి తేనెతో కలిపి ఇచ్చిన మంచిది, లేక స్తంభనకరములగు జాజికాయ, బూరుగు, తుమ్మజిగురు వీనితో నిచ్చిన మంచిది. నల్లమందుతో కూడ కలిపి ఈయవచ్చును గాని జాగ్రత్తగా చూచి యీయవలెను.

వట్టివేరు

ఉశీరం పాచనం శీతం స్తంభనం లఘు తిక్తకం।
మధురం జ్వరహృత్ వాంతిమదనుత్ కఫపిత్తహృత్
తృష్ణాస్రవిషవీసర్ప దాహకృచ్ఛ్ర వ్రణాపహం॥ (బృ. ని. ర)

మోతాదులు—5 మొదలు 15 గ్రైనులు చూర్ణమును చక్కెరతో నీయవచ్చును లేక అరతులము మొదలు ఒక తులము వట్టివేళ్ళతో కషాయముకాచి ఈయవచ్చును. ఒకటికి ఎనిమిది తులముల వట్టివేళ్ళను ఒక కప్పునీళ్ళతో బాగుగాకాచి వడియగట్టి పాలు, చక్కెర చేర్చి ఈయవచ్చును.

లేక పానకముగాకాచి తీసికొనవచ్చును. ఇతర ఔషధములకు అనుపానముగా వాడవచ్చును.

గుణము—శీతలము, స్వేదజనకము, మూత్రలము, ఉద్రేకహారము, రజఃప్రవర్తకము,

ఉపయోగములు—ఇతర ఔషధములతో పాటు దీనిని జ్వరములలో ఒడలిమంట యున్నప్పుడును ముట్టుసరిగా కాకపోవుట, ఒడలి నొప్పులు, కీళ్ళనొప్పులు మున్నగునవి ఉన్నప్పుడు ఉపయోగించవచ్చును. చలువచేయు తలమానెలలోను క్రిమిహరముగు సబ్బుల

లోను, స్నానచూర్ణములలోను, లేపములలోను చేరుచున్నది. ఇది త్రాగుటకై జలమునకు సుగంధము నిచ్చుటకు ఉపయోగపడును. వేసవికాలములో దీనితో చేయబడిన తడకలను కిటికీలకు, తలుపులకు అడ్డముకట్టి పైన నీరు చల్లుచుండుటచే కొంత వేడిమి తగ్గును. ఇది చలవను చేయుటచే మూత్రనాళములో మంట, ప్రకోపము మున్నగునవి యుండునపుడు చాల మంచిది.

### వస

మోతాదు—5 మొదలు 15 గ్రేనులు చూర్ణమును తేనెతో తీసికొనవలెను.

గుణము—లోనికిచ్చిన యెడల ఉత్తేజకము, పాచనీయము, మూత్రలము, స్తంభనీయము, అంత్రక్రిమిహరము, మృదువిరేచనీయము, వృష్యము, రసాయనము, సుగంధకరము, పైన లేపనముగా నుపయోగించుటచే క్రిమిహరము.

ఉపయోగములు—ఇది రెండు విధములుగా నున్నది. అందులో తెల్లది రసాయనముగా హెచ్చుగా నుపయోగింపబడుచున్నది. దీనిని తరుచుగా తిక్తరసాయనములతోను, సుగంధకర వస్తువులతోను చేర్చి విషమజ్వరము, మలబద్ధము, అజీర్ణము, కడుపు నొప్పి, కడుపులో కూతలు, వాతము చేకలుగు గుణములు వీనియందు ఇత్తురు. అపస్మారములో దీనిని తప్పక ఉపయోగింపవలెనని భావప్రకాశలో చెప్పబడినది. పిల్లలకు వాంతులు కలిగినప్పుడు, కడుపులో ఆహారపదార్థము పులిసి యుండినప్పుడును దీనిని మసిబొగ్గు పొడితో కలిపి ఇత్తురు మరియు దీనిని ప్రవాహిక, అతిసారము, దగ్గు, వీనిలోను విషముగల అజీర్తివ్యాధులయందును ఉపయోగింతురు. వృష్యయోగములలో ఇది చేరుచుండును.

దీని చూర్ణమును పుండ్లపై చల్లవచ్చును. శరీరముపై వాపు లున్నప్పుడు దీనికి సమభాగము ఆవాలు కలిపి నీటిచే చేర్చి ముద్దగానూరి పైన పట్టువేయవచ్చును. ఇది ఎరుపు, చీముపట్టకుండ, మంట మున్నగు వానితో నుండియుండు వాపులకు మిక్కిలి ఉపయోగకరము,



### వాసము

మోతాదు—దీని వేరుయొక్క చూర్ణము 5 మొదలు 15 గ్రేనులవరకు తేనెతోగాని ½ మొదలు ఒక తులమువరకు కషాయముగా గాదిగాని ఉపయోగింపవచ్చును. పచ్చిదిగా నున్నప్పుడు వేరును నాలుగురెట్లు నీళ్ళుపోసి కషాయము కాచవలెను, ఎండుదిగా నున్నప్పుడు ఎనిమిదిరెట్లు నీళ్ళుపోసి కాచవలెను.

పచ్చియాకులనుండి కాడలనుండి తీసిన స్వరసము ½ మొదలు 1 తులమువరకు ఈయవచ్చును, ఎండిన ద్రవ్యమునకు ఎనిమిదిరెట్లు నీళ్ళుపోసి కషాయముకాచి ఈయవచ్చును.

దీనిపండు ½ మొదలు ½ తులము స్వరసముతీసిగాని, నాలుగు వంతులు నీళ్ళుపోసిగాని కషాయముకాచి వడియగట్టిగాని తేనెతో కలిపి ఈయవలెను.

కఫమును బయలు వెడలించుటలోను, వాంతి కలిగించుటలోను వేరు మృదువుగాను, కాడ, ఆకులు మధ్యమముగాను, పండు తీవ్రముగాను పని చేయును.

గుణము—ఉత్తేజనము కలిగించుచు పుప్పుసములోని, గొంతుకలోని, కఫమును వెడలించును; మృదువిరేచనీయము; వేరు మూత్రలముగూడ కావచ్చును.

ఉపయోగములు—ఊపిరితిత్తులలో కఫము పట్టుబడి బయటకు రాకున్నప్పుడు దానిని సులభముగ వెడలించుటకు ఇది మిక్కిలి ఉపయోగకరమైన మందు, అందుచే రోగములో కఫమునుండి వచ్చు జ్వరములలో మంచిమందు ఇంగ్లాండులో ఈద్రవ్యముయొక్క ఉపయోగము మిక్కిలి శ్లాఘనీయము ఇది దశమూలములలో నొకటి : బాలలను, కఫమును హరించు దశమూలములలో ఇదియే ప్రధానమైన ద్రవ్యము, కఫము హెచ్చుగా నున్నప్పుడు వాంతి యగుటకు దీనిని ఉపయోగింపవచ్చును ఇది పైత్యమును హెచ్చు చేయదు గనుక సన్నిపాత జ్వరములలోను, కష్టతరమైన జ్వరములలోను ఉపయోగింపవచ్చును. శ్వాస, దగ్గు వీనిలో దీనిని పానకముగా చేసి ఇచ్చిన మంచిది.

### వాయువిడంగము

మోతాదులు:—½ మొదలు 1 తులము నీటితో నూరి వడియ కట్టి అందులో చక్కెర, తేనె, లేక ఆముదమును వేసి ఒకే మోతాదుగా నీయవచ్చును.

5 మొదలు 15 గ్రైనులు ప్రత్యేకముగాగాని ఇతర వస్తువులను చేర్చిగాని అనేకసార్లు ఈయవచ్చును.

గుణము:—పాచనీయము, అంత్ర కృమిహారము, దోషహారము.

ఉపయోగము:—ఇది కృమిహారమైన ద్రవ్యములలో శ్రేష్ఠమని ప్రసిద్ధిగాంచి ప్రత్యేకముగాగాని, ఇతర వస్తువులతో చేర్చిగాని నుపయోగింపబడుచున్నది. దీనిని కొన్ని దినములిచ్చి తరువాత విరేచనమగుటకు తెగడచూర్ణమునుగాని ఆముదమునుగాని ఇత్తురు. కడుపులోనుండు నలిపురుగులను ఇతర కృములను దీనితో పోగొట్టగలరు, నల్లజీలకర్ర మున్నగునవి చేర్చి ఇత్తురు. బ్రద్నకృములకు దీనిని దానిమ్మవేరుయొక్క కషాయము ప్రతి మోతాదునకు అరతులము మొదలు 1 తులమువరకు చేర్చి ఇత్తురు. ఈ కషాయము ప్రతినాలుగు గంటలకొకసారిగాని ప్రతిదినము ప్రొద్దుటగాని బ్రద్నక్రిమియొక్క తల ఊడిపడువరకు ఇత్తురు. అనేక ఔషధములకు దీనిని అనుపానముగా నుపయోగింతురు. కృమికుష్ఠములలో దీనిని లోనికిచ్చుచు పైనగూడ లేపనముగా పూయుదురు. సుశ్రుతుడు దీనిని రసాయనముగా వాడవచ్చునని చెప్పియున్నాడు. దీని చూర్ణమును నువ్వుల చూర్ణముతో కలిపి ముక్కుపొడిగా అర్ధావభేదకము లేక పార్శ్వపు తలనొప్పులలో నుపయోగింపవచ్చునని చెప్పబడినది.

### వావిలి

మోతాదు:—½ ఔన్సు మొదలు 1 ఔన్సు స్వరసమును తేనెతోగాని లేక ½ తులము మొదలు 2 తులముల ఆకులను మామూలుగా కషాయము పెట్టిగాని ఆకులముద్దలో మిరియాలను కలిపి 5 మొదలు 15 గ్రైనులవరకుగాని ఈయవచ్చును.



గుణము:—దోషహారము, విషమజ్వరహారము, జ్వరహారము, శూలహారము.

ఉపయోగములు:—దీని కషాయమునైనను స్వరసమునైనను మిరియాలతో చేర్చి విషమజ్వరములో నిత్తురు. మరియు దీనిని కుష్ఠ, శూల, అజీర్ణము, ఆమవాతము, కృములు, వీనిలో ఇత్తురు. దీని ముద్దను తలభారముగా నున్నప్పుడు తలకు కట్టుదురు. మరియు వాతజ్వరములోను ఉపద్రవసహితములైన జ్వరములలోనుగూడ తలకు కట్టుదురు.

దీని ఆకులను ఉడికించి ఆమవాతములో కీళ్ళనొప్పులకు నొప్పిని తగ్గించుటకై ఉపయోగింతురు. నొప్పులున్న ప్రదేశములపై దీని కషాయమును వేడి వేడిగా నున్నప్పుడు పోయుదురు. ప్రసవించిన స్త్రీలు స్నానము చేయుటకై నీటిని వావిలియాకులు, గొంతెమ గొలుసు, వెదురు ఆకులు, వేపాకు, వీనితో కాచెదరు. సర్వవాత వ్యాధులయందును పైకిని లోనికిగూడ హెచ్చుగా నుపయోగకరమని ప్రసిద్ధిగాంచియున్నది. దీని స్వరసముతో కాచిన నూనెను నొప్పులను తగ్గించుటకు చాల విరివిగా నుపయోగింతురు. మద్రాసులో కాలుడై ఇతై (గొంతెమగొలుసు) యనునదిగూడ ఇట్లే ప్రచారముగా ఆమవాతములో నొప్పులను తగ్గించుటకు లేపనముగా నుపయోగింతురు.

### వెదురుప్పు

మోతాదు:—5 మొదలు 15 గ్రైనులు తేనెతోగాని నేయి, చక్కెర వీనితోగాని తీసికొనవలెను.

గుణము:—శీతలము, ధాతువృద్ధికరము; రసాయనము.

ఉపయోగములు:—దీనిని దగ్గు, క్షయ, శ్వాస, జ్వరము వీనిలో ఉపయోగింతురు. ఇతరములైన స్తంభనీయ ద్రవ్యములతో దీనిని చేర్చి చిరకాలము నుండియున్న గ్రహణీరోగము, స్రోతస్సుల నుండి రక్తము పడుచున్నప్పుడును ఇత్తురు. ఇందులో కొన్ని లవణములు చేరియుండుటచే ఇది రక్తము, అస్థి ధాతువులు వీనిని వృద్ధి

చేయును, మూత్రనాళములోను, పుప్ఫుసములలోను ఇది ఉద్రేకమును అడచును, దీనిని వీర్యవృద్ధిచేకలిగిన బలహీనతయందును ఉపయోగింతురు. ఇది ప్రవాళభస్మము, ముత్యభస్మము వీనితో సమానమైన గుణములుకలిగి వానికంటెకూడ శీతలమై యుండును. శ్రేష్ఠమైన రసాయనములగు చవ్యనప్రాశ్యావలేహ్యము, వాసావలేహ్యము వీనిలో ప్రధానద్రవ్యమిదియే. కఫనిస్సారకములగు తాళిసాదిచూర్ణము, శీతోపలాది చూర్ణము వీనిలోగూడ ప్రధానద్రవ్యమిదియే. 10 గ్రైనులు మొదలు 15 గ్రైనుల చూర్ణమును తేనెతో కలిపి ఉసిరికాయల మురబ్బాతో కలిపి ఇచ్చినచో క్షయ మున్నగు ధాతు క్షయకరములగు వ్యాధులలో మంచి రసాయనముగా పని చేయును. ఇది చిరకాలగతమైన గనేరియాయం దుపయోగింపబడు చున్నది.

సీమ అవిసాకు గుణము

దీనిని పసరుతీసి కొబ్బరినూరి తీసిన పాలు కలిపి గజ్జి, కురుపులు మున్నగు చర్మవ్యాధులకు పైపూతగ నుపయోగించి వానిస్నానము చేసిన చర్మవ్యాధులు నివారణయగును.

శీకాయ చెట్టు గుణము

దీని చిగురును గ్రహించి తగుమాత్రము రెండు మిరప కాయలు కలుపుకొని పచ్చడిచేసి అన్నములో కలుపుకొని భోజనము చేసిన పైత్య సంబంధమగువని నివారణయగును. పచ్చికాయలను పచ్చడిచేసి తినిన విరేచనమగును.

తెల్లనాగజెముడు గుణము

దీని పూలు పసుపుపచ్చగ నుండును. ఈ పూలను నలిపి గడ్డలపై వేసిన గడ్డ త్వరలో పగులు చూపును. పండ్లు మేహ శాంతిని ఉష్ణశమనమును కలిగించును. ఎండలో తిరిగి మూత్రము పచ్చగను, చురుకులను నుండినచో దీని పండ్లు ఒకటి రెండు తినిన త్వరితముగ శరీరము శాంతించును.



సుకులుపట్ట గుణము

దీనిని 2 పలములు గ్రహించి నీటితోనూరి కొబ్బరినూనె ఒక పలము చేర్చి ఎండలోపెట్టి కాచి యుంచుకొని వ్రణముల కుపయోగించిన వ్రణములు త్వరితముగ మానును.

సంకేత నామములు.

త్రిఫలములు: కరక్కాయ, తానికాయ, ఉసిరికకాయ.

త్రికటుకములు శొంఠి, మిర్యాలు, పిప్పళ్ళు

త్రిజాతకములు దాల్చినచెక్క, ఏలకులు, లవంగాలు.

లవణత్రయం సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము.

బలాచతుష్టయము బలా, అతిబల, మహాబల, నాగబల,

చాతుర్జాతకములు ఏలకులు, లవంగాలు, నాగకేసరములు, దాల్చినచెక్క.

పంచగవ్యము ఆవునెయి, ఆవుపెరుగు, ఆవుపాలు, గోమూత్రము ఆవుపేడ,

పంచాంగములు ఏ చెట్టుయొక్కగాని చెక్క, ఆకు, వేరు పండ్లు, పూలు.

పంచకోలములు శొంఠి, పిప్పళ్ళు. మోడి, చిత్రమూలం, చవ్యము.

ఛాగపంచకము మేకపాలు, పెరుగు, నేయి, పెంటికలు, మూత్రము.

పంచలవణములు సైంధవలవణము, సౌవర్చలవణము, సముద్ర లవణము, కాచిలవణము, బిడాలవణము.

పంచమూత్రములు ఆవు, గొర్రె, ఎనుము, మేక, గాడిద మూత్రములు,

సప్తధాతువులు బంగారు, వెండి, రాగి, తగరము, సత్తు, సీసము, లోహము,

అష్టగంధములు పచ్చకర్పూరము, మంచిగంధము, తుంగముస్తెలు (పచ్చివి) కుంకుమపువ్వు, దేవదారు, గోరోజనము, నాగకేసరములు, వట్టివేళ్ళు,

నవరత్నములు ముత్యము, పద్మరాగము, వజ్రము, ప్రవాళము, మరకతము, నీలము, గోమేధికము, వైడూర్యము, పుష్యరాగము.

దశాంగధూపము సరళదేవదారుజుంట, అగరుచెక్క, రాతి పువ్వు, తుంగముస్తెలు, ఆవాలు, మంచినెయి, తేనె, మహిసాక్షి గుగ్గిలము, గంధకము, శిలాంసపుజిగురు.

దశమూత్రములు ఏనుగ, ఎనుము, ఒంటె, ఆవు, మేక, గొర్రె, గుఱ్ఱము, గాడిద, స్త్రీ, పురుష మూత్రములు.

## పంచవిధకషాయములు

స్వరసము, కల్కము, క్వాథము, హిమము, ఫాంటము వీనికి కషాయములని పేరు.

## వివరణము

స్వరసము—పచ్చి వస్తువులను బాగుగ కడిగి శుభ్రపరచి నీళ్ళు కలపకుండ దంచి తీయబడిన రసము.

కల్కము-పచ్చి ద్రవ్యమైన మొదల నీరు కలపకను ఎండు ద్రవ్యమైన మొదల జలము కలిపియు మెత్తగ నూరి ముద్దగ తయారు చేయబడునది.

క్వాథము-ఒక భాగము ద్రవ్యములను కచ్చాగాదంచి దానికి 16 భాగములు నీరుపోసి సగము మిగులునటుల కాచబడునది.

హిమము—ఒక పలము ద్రవ్యములనుంచి 7½ పలముల నీళ్ళు పోసి వస్తువులను బాగుగ తడిపి ఒకరాత్రి నాననిచ్చి పైన మూత పెట్టి ఉదయము బాగుగ పిసికి వడియబోసి ఉపయోగించుకొనునది.

ఫాంటము—ద్రవ్యము ఒక పలమును దంచి 6 పలముల వేడి నీటిలో పోసి కొంతసేపు వుండనిచ్చి పిదప వడబోసి గ్రహించునది.

## విషవిరుగుడులు

| విషము | విరుగుడు |
|---|---|
| అడవిబీర | తుంగముస్తెలు |
| అటుకులు | సైంధవ లవణము |
| అనుములు | మంచిగంధము |



| | |
|---|---|
| ఆవాలు | ఉసిరికపప్పు |
| ఇంగువ | కేతకీసరము |
| ఉమ్మెత్త | తామరపూలు, పుల్లపావిలి, చింతపండు పులుసు |
| ఉమ్మెత్తవిత్తులు | నిమ్మరసం, జిలకర |
| ఊడుగ | కరక్కాయలు |
| కంద | తమలపాకు |
| కర్పూరము | గుంటగలగర |
| కొబ్బరి | బియ్యము |
| గన్నేరు | కరక్కాయ |
| గుమ్మడు | మజ్జిగ |
| చల్ల | చిల్లగింజ |
| జిల్లేడుపాలు | చంచలాకు, నీలియాకు |
| జీడి | దూలగోవెల |
| జీడిగింజ | మోదుగపువ్వు |
| జీర్ణించని అన్నమునకు | ఆవాలు |
| జెముడుపాలు | తంగేడాకు |
| తమలపాకుతొక్క | చింతపండు |
| తెగడ | తుమ్మచెక్క |
| తెలకపిండి | నూనె |
| తేనె | మంచినీళ్ళు |
| త్రికటకము | బియ్యపుకడుగు |
| నల్లమందు | శొంఠి, అల్లము |
| నిమ్మపండు | ఖర్జూరపుకాయ |
| నువ్వులు | మొగలిచల్లరసము |
| నేయి | వేన్నీళ్ళు |
| నేరేడుపళ్ళు | పాలు |
| పనసపండు | శొంఠి |
| పాషాణములు | పత్తిగింజలు |
| పొగాకు | వేడినీరు |

| | |
|---|---|
| హస్తికర్ణ | శొంఠి |
| జలరక్కసి | ఉలిమిడాకు |
| బెల్లము | పెసలు |
| మామిడిచెడి | నారికేళపాకు |
| ముంచిణి | నేరేడు, వెంగలి |
| వసనాభి | చిత్రివేళ్ళు |
| సున్నము | తిప్పతీగ, పసుపు |

దొరకని వస్తువుల ప్రతినిధులు

| | |
|---|---|
| కుంకుమపువ్వు | పసుపు, కుసుంబా పువ్వు, పద్మకేసరము |
| సన్నరాష్ట్రం | శొంఠి |
| పిప్పళ్ళు | మిర్యాలు, శొంఠి, అల్లం |
| చెంగల్వకోష్టు | జటామాంసి |
| లవంగములు | ధాతకీ పుష్పము |
| ద్రాక్షపండు | ఖర్జూరపుపండు, ఇప్పపువ్వు |
| తుంగముస్తలు | గ్రంధి తగరము |
| తెల్లజిలకర | నల్లజిలకర |
| వాము | వాయింటగింజలు |
| జెముడు | చవ్యము |
| గ్రంధి తగరము | మిర్యాలు |
| బ్రహ్మదండి | మోదుగ |
| వాకుడు | ములక |
| చిరుబొద్ది | దురదగొండి |
| చిట్టాముట్టి | పెరాముట్టి |
| మారేడువేరు | వెలగవేరు |
| గంటుభారంగి | వాకుడువేరు |
| తెల్లవట్టివేళ్ళు | శ్రీగంధము |
| వట్టివేరు | సుగంధిపాల |
| ఏలకాయలు | తాళిసపత్రి |



| | |
|---|---|
| పుష్కరమూలం | తామరతూడు |
| నేపాళము | తెగడ, చిత్రమూలం |
| పంచదార | బెల్లము |
| కరక్కాయ | తానికాయ, ఉసిరిక |
| తేనె | పాతబెల్లం |
| మహిషాక్షిగుగ్గిలం | వేపబంక |
| లవణము | సైంధవలవణం |
| కరివేప | గలిజేరు |
| ఆవుపాలు | మేకపాలు |
| ఆవునేయి | మేకనేయి |
| జ్రెపాలు | గొర్రెపాలు |
| నల్లజీడిగింజలు | చిత్రమూలం |
| తుందిలం | కానుగ |
| పెద్దమ్రాను | కానుగ |
| రాజనాలు | వడ్లు |
| మోడి | గజపిప్పలి |
| చవ్యం | మోడి |
| తెల్లఆవాలు | ఎర్రఆవాలు |
| లోహము | కాసీసము |
| దానిమ్మ | చింతపండు |
| కోడిమాంసము | నెమలిమాంసము |
| జీవకము | పాలవేళ్ళు |
| కాకోళి | సుగంధిపాల |
| మహామేద | పల్లేరువేళ్ళు |
| వెండి | లోహము |
| మాంసము | మత్స్యములు |
| మత్స్యములు | నత్తగుల్లలు |
| నత్తగుల్లలు | నీటిచిప్పలు |
| నేయి | పాతపువ్వులనూనె |
| ముత్యములు | ముత్యపు చిప్పలు |

## వసిష్ఠప్రోక్తముగు

| | |
|---|---|
| వజ్రము | అయఃకాంతము |
| హారతికర్పూరము | తుంగముస్తెలు |
| కస్తూరి | పునుగు, భావంచాలు |
| అన్నిరకముల మాంసములు | పావురాయిమాంసము |
| ములుమోదుగ | వేప |
| మాంసకషాయము | పెసరకట్టు |
| పొగడపువ్వు | ఎర్రకలువపువ్వు |
| జాపత్రి | లవంగము |
| జిల్లేడుపాలు | జిల్లేడుఆకు రసము |
| పుష్కరమూలము | చెంగల్వకోష్టు |
| మానిపసుపు | మంచిపసుపు |
| మంచిగంధం | కర్పూరము లేక రక్తచందనము |
| కస్తూరి | పునుగు, చలవమిర్యాలు, బావంచాలు |
| అతివస | తుంగముస్తెలు |
| నాగకేసరములు | పద్మకేసరములు |
| అమ్లవేతనం | చుక్కకూర |
| క్షీరకాకోలి | శతావరి, పిల్లితేగలు |
| కాకోలి | సుగంధిపాల |
| చలవమిర్యాలు | జాపత్రి |
| వృషభకము | బిట్టామట్టి వేళ్ళు |
| వెండి | తారమాక్షికము |
| కాంతభస్మం | లోహభస్మం |
| మౌక్తికభస్మం | ముత్యపుచిప్పల భస్మం |

వసిష్టప్రోక్తముగు పులిప్పాణి వైద్యము

సర్వం

సంపూర్ణము